# చతుర

సంపుటి : 3 మే 1980 సంచిక : 4

## ఈనెల సమగ్ర నవల

"మీరు ఎప్పటికీ ఇప్పటిలాగే వుండండి. మన చుట్టూ జనం మంది వాళ్ళకి బంగారు పంజరాలూ, బంగారు బోనులూ తయారుచేసి పెట్టారు. హృదయం విప్పి మాట్లాడే వాళ్లు, హృదయం నిండుగా ప్రేమించే వాళ్లు, నిష్కల్మషంగా బ్రతికే వాళ్లు, నిటారుగా చూసేవాళ్ళు అరుదై పోతున్నారు. అరవై కోట్ల అసమర్థుల్లో కనీసం ఆరుకోట్ల సమర్థులున్నా చాలు యీ దేశం బాగుపడుతుంది." అలా ఆవేశంగా మాట్లాడిన ఆమె వల్ల ప్రభావితుడై అతను యేం చేశాడు? అలజడి చెందిన ఆ రెండు హృదయాల స్పందన ఏ రూపు దాల్చింది? విద్యాధికుడైన అతను నక్కలూ, తోడేళ్ళూ తప్ప సాధువులు మనలేని ఈ

# చీకటి

లోకంలో నెగ్గుకు వచ్చే ప్రయత్నంలో

చివరికేమయ్యాడు? సమకాలీన సామాజిక వ్యత్యాసాలకు దర్పణంగా

## శ్రీసుభా

రచించిన 'చీకటి' నవల ఈ నెల చతుర సమగ్ర నవల.



ముఖచిత్రం - ఫొటో: దిలీప్ బెనర్జీ

2వ కవరు : బ్రహ్మదేవ్. 3వ కవరు : సూరజ్ ఎన్. శర్మ.

# రచయితలకు సూచనలు

* 'చతుర'లో ప్రచురణార్థం పంపే నవలలు అచ్చులో 100 పేజీలకు సరిపడేవిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే నవలలు పంపటం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జత పరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈవిషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.


చతుర

ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్-500 004

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.









2
ప్యాక్ లలో
'బ్లూ' మరియు
'శాండల్ వుడ్'

నైసిల్ పొందండి.
చెమటకాయలను మరువండి.
కేవలం 6 రూపాయల 63 పైసలు.*

* గరిష్ఠ రీటైల్ ధర.
స్థానిక పన్నులు అదనం.



ప్రత్యేకమైన ఔషధయుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి దశలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారులైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది

GN-79-364-TL

# అపురూప విందు...!

భార్యా, పిల్లల్తో సుఖంగా సంసారం చేస్తున్న డాక్టరు మహాశయుడు అనుకోని విధంగా మరొకరి బేగం సాహెబాకు 'నాలుగో మొగుడు' అయ్యేడు. ఓ. రెండేళ్ళపాటు ఆవిడతో ఇంద్రభోగాలనుభవించేడు... అలాంటిది ఓ సుదినాన ఆవిడను ముక్కలు ముక్కలుగా నరికించి, మసాలాలతో మహారుచిగా వండించి ఆప్తమిత్రులకు విందు భోజనం వడ్డింపించేడు...ఎందువల్ల?

'విపుల' మే నెల సంచికలో సాదత్ హసన్ మంటో ఉర్దూ కథ 'విందు భోజనం' చదవండి.

వివిధ భాషల వైవిధ్యంగల అనేక కథలతో పాటు మరెన్నో జోకులు, కార్టూన్లు, విచిత్ర విశ్వ విజ్ఞానం అందజేస్తోంది విపుల. తెలుగు పత్రికా పాఠకులకు గర్వకారణమైన విశ్వకథా విపంచి 'విపుల'... రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో 132 పేజీలు... 125 పైసలే!





Marketed By

**Margadarsi Marketing**
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad-500 004

ప్రతి నెలా
1వ తేదీకి వెలువడే
విశ్వకథా విపంచి.

**విపుల**

# బట్టతలల క్లబ్

ఆడవారికి, మగవారికి విడివిడిగానూ, కలిసీ క్లబ్‌లుండడం విన్నాంగాని బట్టతలల వారికోసం ప్రత్యేకించి క్లబ్ పెట్టడం విడ్డూరమైన విషయమే! అమెరికాలో లాస్ ఏంజిల్స్‌కి చెందిన పీటర్ అనే బట్టతల మహాశయుడు జుట్టున్నవాగి పట్ల నిరసనగా ఈ పనికి పూనుకున్నాడు. అందుకు కారణంవుంది. ఒక్క వెంట్రుకైనా లేకుండా నున్నగా, తళతళలాడుతున్న పీటర్ తలని చూసి అంతా ఆటలు పట్టించేవారు. ఏపార్టీకి, మీటింగుకు వెళ్ళినా అందరి దృష్టిలో పీటరు జోకరై కూర్చున్నాడు. కొందరు కొంటె కోణంగులు అతని తలమీద తబలా కూడా వాయించేవారు. దాంతో విసుగెత్తి ఓ శుభ ముహూర్తాన మంచి విగ్గు పెట్టుకుని హీరోలా తయారై మీటింగుకు వెళ్ళాడు. అక్కడో కొంటె స్నేహితుడు తారసపడి అందరిలోనూ అతని విగ్గు లాగేసి పెద్ద జోకు వేసినట్లు పగలబడి నవ్వాడు. పీటరుహృదయం అవమానంతో దహించుకుపోయింది. ఆనాటి నించీ స్నేహితుల్ని కలవడం మానేశాడు. కేవలం బట్టతలల వారికోసం ప్రత్యేకంగా క్లబ్ తెరవాలని నిశ్చయించుకుని మరుక్షణం అమలు జరిపేశాడు. తలమీద ఒక్క వెంట్రుకున్నవాడికి కూడా అందులో ప్రవేశించేందుకు అనుమతిలేదు. పొరపాటున వస్తే పెద్ద మొత్తం జరిమానాగా వసూలు చేసి బైటికి గెంటాలని నియమం కూడా పెట్టాడు. క్లబ్బుకి త్వరలోనే గుర్తింపు కలిగింది. ఎంతో మంది బట్టతలలు సభ్యత్వం కోసం ఎగబడ్డారు. చూస్తుండగానే సభ్యుల సంఖ్య రెండు వందలకి పెరిగింది. మేరియా అనే బట్టతలావిడ తన క్లబ్‌లో సభ్యురాలిగా చేరిన రోజు ఎంతో సుదినమని మురిసిపోయాడు పీటర్. సభ్యులందరూ ఎంతో స్వేచ్ఛగా తమ కష్టసుఖాలను చర్చించుకుంటారు. జుట్టున్న వారి హేళనలు, నవ్వులతో వారికి పనిలేదు. చక్కని సాంస్కృతిక కార్యక్రమాలను



రూపొందించి క్లబ్‌ను అభివృద్ధి చేసి వచ్చిన సొమ్మును బట్టతలవారి ఉపయోగార్థం వాడాలని తీర్మానించారు. ఈలోపల మేరియా,పీటర్ కల్సి బట్టతలవారు నడిపే హోటలు నొకదాన్ని పెట్టాలన్న నిశ్చయానికి వచ్చారు. బట్టతల వారికోసం ప్రత్యేకంగా స్కూళ్ళు, కాలేజీలు తెరిచినా ఆశ్చర్యపోనక్కర్లేదు మనం. బట్టతల వాళ్ళు జుట్టు లేదని విచారించకుండా ఎంతో గర్వంగా తమ తలను నిమురుకోవచ్చు. *





# మరో నైటింగేల్

పాలనురుగులాంటి తెల్లని గౌను తలమీద టోపీ, కళ్ళల్లో కన్నతల్లి ప్రేమ, పెదవుల మీద చెరగని చల్లని చిరునవ్వు, కేవలం చూపుల్లోనూ, మాటల్లోనూ సేదదీర్చే దయామూర్తి నర్స్. ఆ వృత్తికి ఒక ఒరవడి పెట్టిన ఘనత ఫ్లారెన్స్ నైటింగేల్ ది. ప్రతిక్షణం ఓర్పు, నేర్పు, జాలి, దయతో సేవ చేయాల్సిన నర్సు వృత్తి అనుకున్నంత తేలికకాదు. ఇన్నాళ్ళకు ఫ్లారెన్స్ మళ్ళీ పుట్టిందా? అని ఆశ్చర్యాన్ని కలుగజేసే సంఘటన ఇటీవల తమిళనాడులోని రాయవెల్లూరు క్రిస్టియన్ మెడికల్ కాలేజ్ లో జరిగింది.

ఓ వయసుమళ్ళినాయనికి గొంతులో పుండయింది. ఇన్ ఫెక్షన్ వల్ల దాన్నిండా చీము పేరుకు పోయింది. అత్యవసరంగా ఆపరేషన్ చేస్తేనేగాని కుదరని పరిస్థితి రావడంతో ఆపరేషన్‌కు అంతా సిద్ధం చేశారు. డాక్టరుతోబాటు అతనికి సహాయంగా ఇద్దరు ఇటాలియన్ నర్సులు ఆపరేషన్ థియేటర్లోకి వెళ్ళారు.

గొంతులోనించి చీమునంతా బైటికి తీసేందుకు ఒక రబ్బరు గొట్టాన్ని అమర్చారు. కరెంటు సహాయంతో ఆ గొట్టం ద్వారా ఆటోమెటిక్‌గా రసి బైటికి వచ్చేస్తుంది. అందుకు కావల్సిన అధునాతన పరికరాలన్నీ అమర్చారు. రోగికి మత్తుమందు ఇవ్వడంతో స్పృహ తప్పింది. గొట్టం నించి చెడు రక్తం, చీము బైటికి వస్తున్నాయి. వాటినించి వచ్చే దుర్గంధం భరించరానిదిగా వుంది. డాక్టర్లు అతి కష్టం మీద భరించడానికి ప్రయత్నిస్తున్నారు. కానీ నర్సులు ముక్కుకి వాసనేరానట్లు, తమకేమీకానట్లు పనులు చకచకా చేసుకు పోతున్నారు. అలా పుండును శుభ్రం చేస్తుండగా వున్నట్టుండి కరెంటు పోయింది. చెడు రక్తం, చీము రబ్బరు గొట్టంలో ఇరుక్కుపోయాయి. సాధ్యమైనంత త్వరలో గొట్టాన్ని శుభ్రం చేస్తేగాని వీల్లేదు. కరెంటుమీద రోగి ప్రాణాలు ఆధారపడి వున్నాయి. రోగి ప్రాణాలు అటూ ఇటూ వూగిసలాడుతున్నాయి. క్షణం గడుస్తున్న కొద్దీ అతని చావు



దగ్గర పడుతోంది. అతణ్ని రక్షించడం ఎలాగో తెలియక డాక్టర్లంతా అత్యవసర సమావేశం జరిపి అర్జంటుగా చీము బైటికి తీయాలనీ, అలా చేస్తేనేగాని రోగి ప్రాణాలు దక్కవనీ తీర్మానించారు.

ఎంతో విలువైన సమయాన్ని సమావేశాలకు, చర్చలకు వినియోగించడం ఇష్టంలేని ఇటాలియన్ నర్సు ముందుకి వచ్చి "మీరేమీ విచారించకండి. నేను

నోటితో చీము, రక్తాన్ని పీల్చేసి ఉమ్మేస్తాను" అంది.

ఒక్కసారిగా వెన్నులోంచి విద్యుత్ ప్రవహించినట్లయింది డాక్టర్లకు. ఇన్‌ఫెక్షన్‌తో దుర్గంధాన్ని వెలువరించే చీము, రక్తాన్ని నోటితో పీల్చడం ఎంతో దారుణమైన విషయం అనుకుంటూ అవాక్కయిపోయిన డాక్టర్ల సమాధానం కోసం కూడా ఎదురు చూడకుండా తను చేయదల్చుకున్న పని చేసేసిందా నర్సు. పది నిమిషాల పాటు చీము, రక్తాన్ని పీల్చి ఉమ్మివేసి మృత్యువు కబంధ హస్తాల్లోంచి రోగిని కాపాడింది. ఆమె చేసిన ఎనలేని త్యాగానికి ప్రపంచమంతా నివాళు లర్పించింది. ప్రపంచ పత్రికలన్నీ పతాక శీర్షికలతో ఈ వార్తను ప్రచురించాయి.

రోగి ఆస్పత్రినుంచి డిస్చార్జి అయిన దాదాపు ఓ నెల రోజులకు అతని కుటుంబసభ్యులు ఆ నర్సు దగ్గరికొచ్చి ప్రాణదానం చేసినందుకు ప్రతిఫలంగా కొంతసొమ్ము ముట్టజెప్పబోయారు. కానీ అది తన వృత్తిలో ఒక భాగమనీ, తన విద్యుక్త ధర్మాన్నీ, బాధ్యతనూ నెరవేర్చినందుకు పారితోషికం తీసుకోననీ త్రోసిపుచ్చింది. కానీ అభిమాన పూర్వకంగా ఇస్తున్నందుకు ఏదో ఒకటి తీసుకోక తప్పదని బలవంతం చేయడంతో చేసేదిలేక వచ్చీరాని అరవంతో 'మ..సాలా..దోసె చాలు' అని మాత్రం అంది నవ్వుతూ.

## జగమే మాయ

తాగుడు అలవాటైతే సర్వనాశనం తప్పదని ఎవరెంత మొత్తుకున్నా 'నా చిన్న నాటికి సారాయే రక్ష' అనుకొనే సారా భక్తులు కోకొల్లలు. తాగుడులోని ఆనందం కోసం దేనికైనా తెగిస్తారు వాళ్ళు. అలాంటి ఓ తాగుబోతు ఇంట్లో వున్న అన్ని సామాన్లనీ తాకట్టు పెట్టేశాడు. అవి తిరిగి వెనక్కి రాకుండానే వేలం వేయబడ్డాయి. ఆ బాధలు భరించలేక అతని భార్య మరణించింది. ఇంట్లో కూతురు రాధతప్ప మరేంమిగలలేదతనికి. చేతిలో పైసాఅయినా లేనప్పుడు మైకంలో తన కన్నకూతుర్ని కేవలం 42 రూపా



యలకు తెగనమ్మి ఓ విస్కీసీసా కొని తిరిగి మత్తులో మునిగిపోయాడు. అతని కూతురు రాధను కొన్నవాడు ఆమెను క్రూరంగా అనుభవించి వదిలిపెట్టేడు. చిరిగిన బట్టలతో రాధ స్నేహితుల ఇళ్ళకు చేరింది. తన కథంతా వాళ్ళతో చెప్పి తాగుబోతులందరికీ బుద్ధి వచ్చేలా కథను రాయమని కోరి ఇంటికెళ్ళి ఆత్మహత్య చేసుకుంది. రాధ స్నేహితురాలి అన్న పురుషోత్తమన్ ఈ సంఘటనకు కదిలి పోయి ఇదంతా కథగా రాశాడు. ప్రస్తుతం ఆకథ సినిమాగా రూపొందింది.

'నేనెప్పటికీ తాగుతాను' అని పేరు పెట్టారు. తెంగై శ్రీనివాసన్ ఈ సినిమాలో పారితోషికం తీసుకోకుండా నటిస్తున్నాడు నీతిదాయకమైన సినిమా గనుక. ఈ చిత్రంలో కె. ఆర్. విజయ నటించింది. ఈ విషాద సంఘటన తమిళ నాడులోని కడ్డలూర్‌లో జరిగింది.

## ఆపద్బాంధవుడు

**59** ఏళ్ళ సుభబీర్ పాండే బ్రహ్మచారి. ఏ బాదరబందీలేదు. 1942లో థైరాయిడ్ గ్రంధులువాయడంతో డాక్టర వాలన్న ఆశయానికి ఆటంకం ఏర్పడింది. అప్పటినుండి క్రొత్తరకం వ్యాపకం ఏర్పరచుకొన్నాడు. సంవత్సరానికి రెండు సార్లు ఖాట్మండు నుంచి 2,500 కిలో మీటర్ల దూరం ప్రయాణించి వెల్లూరులోని కేన్సరు హాస్పిటల్‌కి ప్రయాణ మవుతుంటాడు. 1959లో ప్రారంభంలో పాండే తన ఆరోగ్యం పరీక్షించుకోడానికి వెళ్ళేవాడు. తర్వాతర్వాత నేపాల్‌లోని ఇతర రోగులను కూడా వెల్లూరు తీసు కెళ్ళ సాగాడు. ప్రపంచమంతటిలో ఇదే చాలా ఉత్తమమైన ఆస్పత్రని అతని నమ్మకం. ఇప్పుడు పాండే వెల్లూరుకి తీసికెళ్ళే రోగుల సంఖ్య వందలకు చేరు కుంది. ముఖ్యంగా చలికాలంలో నేపాల్ లోని చలిని తప్పించుకోడానికి రోగులూ, వారి బంధువులూ పాండేతో వెల్లూరు వచ్చేవారు. నేపాల్ నుంచి వచ్చే రోగులకి టోపీవాలా అని పిలవబడే పాండే దగ్గరుంటే చాలు ఎంతో ఉపశమనం కలి గినట్టు భావిస్తారు. అత్యవసర పరిస్థితుల్లో డాక్టర్లతో మాట్లాడే శక్తి సామర్థ్యాలు అతనికి ఉన్నాయని వారినమ్మకం. పాండే అక్కడి డాక్టర్ బి.ఎం. పులిమూడ్ నేపాల్ నుంచి వచ్చేపేద రోగుల వైద్య ఖర్చుల నిమిత్తం స్వచ్ఛంద చందాలతో ఓ నిధి ఏర్పాటు చేయాలన్న అభి ప్రాయంతో వున్నారు.

ఇతని నిస్వార్థసేవకు అందరూ సంతో షించినా స్థానిక డాక్టర్లు మాత్రం పాండేని శాపనార్థాలు పెడుతున్నారట. నేపాల్ ఇండియా ఫ్రెండ్‌షిప్ అసోసియేషన్‌కు ఉపాధ్యక్షుడిగా వున్న పాండే శ్రీమతి ఇందిరాగాంధీ అభిమాని. ఇతనికి



వెల్లూరు ఆస్పత్రి మొదటి ప్రాణం. తర్వాతే అన్నీ!

## లండన్ బస్

ఈ రోజుల్లో బస్సులో సీటు మాటలా వుంచి, బస్ దొరకడమే గగనంగా వుంది. అలాంటిది మద్రాసులో ఈమధ్య 'లండన్' బస్సుకోసం ప్రజలు విరగ

బడ్డంలో ఆశ్చర్యం లేదు. ప్రజల సౌకర్యార్థం లండన్నుంచి ప్రత్యేకంగా తెప్పించిన ఈ బస్సులో 48 సీట్లుగాక మరో 22 మంది నిలబడేందుకు వీలుంది. దీనికి మూడు ద్వారాలున్నాయి. మూడింటి తలుపులు మూసేనేగాని బస్సు కదలదు. ఈ పద్ధతి ఫుట్‌బోర్డు ప్రియులకు అయిష్టంగా వున్నా ఎంతోమంది ప్రాణాలను కాపాడేందుకు అనువైన పద్ధతి. ఈ బస్సులో ప్రయాణం చాలా హాయిగా వుంటుంది. ఎలాంటి అవరోధాలు లేకుండా కవి కుమారులు కవిత్వంకూడారాసుకోవచ్చు.




ఎక్కువగా కుదుపులు, వేడి లేకుండా వుండడానికి ఇంజను వెనకభాగంలో అమర్చబడింది. ఈ బస్సులో నిలబడి ప్రయాణం చేసేవాళ్ళంతా బాగాపొడుగ్గా వుండితీరాలి. ఏ మాత్రం పొట్టిగా వున్నా హేండిల్ బార్ అందనంత పైనుంది. గాలి,వెలుతురు ధారాళంగా వచ్చేందుకు వీలుగా బస్‌పై భాగాన కిటికీలు పెట్టారు. ప్రతి సీటు పక్కన ఒక స్విచ్ వుంటుంది. ఎవరు దిగాల్సిన స్టేజిలో వారు స్విచ్ నొక్కగానే డ్రైవరు బస్సునాపి తలుపు తెరుస్తాడు. తలుపులు తెరిచేందుకు ఆటోమేటిక్ కంట్రోలు డ్రైవరు దగ్గర వుంటుంది. 33అడుగుల పొడవున్న ఈలండన్ బస్సు ఖరీదు ఐదున్నర లక్షల రూపాయలు. భారత దేశంలోని పెద్ద నగరాల్లో త్రిప్పి చూడ్డానికి లండన్‌నించి మోడల్‌గా ఈ బస్సును తెప్పించారు. ఈ ఫారిన్ బస్సులో కాలు పెట్టడం అదృష్టంగా భావించే మద్రాసీయుల కోసం రాష్ట్రప్రభుత్వం ఇదే నమూనాలో స్వదేశీ బస్సుల్ని తయారు చేయించాలని నిశ్చయించింది.

# త్రిశంకు స్వర్గం

**50** ఏళ్ళ రోహిణి దేవనాథ్, 55 ఏళ్ళ జామిని దేవనాథ్, వీరి కుటుంబ సభ్యులు 11 మందిని అస్సామ్ అధికారులు విదేశీయులుగా ప్రకటించడంతో త్రిశంకు స్వర్గంలో ఊగులాడుతున్నట్లయింది వీరి పరిస్థితి. అటు బంగ్లాదేశ్ కూడా వారిని బంగ్లాదేశ్ పౌరులుగా గుర్తించటానికి అంగీకరించడం లేదు.

జామిని దేవనాథ్ 1946లో గోల్‌పారా గుండా అస్సామ్‌లోని కామ్‌రూప్ జిల్లాకి చేరాడు. రోహిణి 1950లో వచ్చాడు. ఈ అన్నదమ్ములు కామ్‌రూప్‌లోని నల్‌బరి సబ్ డివిజన్‌లోవున్న రంగఫలిలో స్థిరపడ్డారు. జామిని హలం చేత పడితే, రోహిణి కలం పట్టి బి.ఎ. పూర్తిచేసి గౌహతి విశ్వవిద్యాలయం నుంచిచరిత్రలో ఎమ్.ఎ పాసైభువనేశ్వర్ వద్దనున్న ఉత్కళ విశ్వవిద్యాలయంలో అస్సామ్ ప్రభుత్వ స్కాలర్‌షిప్‌తో బి.ఇడి. చేయడానికి వెళ్ళాడు. ప్రస్తుతం

అతను ధంధమా హైస్కూలు హెడ్మాష్టర్‌గా పనిచేస్తున్నాడు. స్వాతంత్ర్యం రావడానికి ముందే వచ్చాడు గనుక జామినికి భారత పౌరసత్వం వున్నదని రుజువుచేసే సర్టిఫికేట్ అవసరంలేదు. కాని 1949 జూలై 26 తర్వాత వచ్చినందున రోహిణిని భారతీయ పౌరుడుగా పరిగణించడంలేదు. అదీగాక అతను పౌరసత్వం కోసం దరఖాస్తు కూడా పెట్టుకోలేదు అప్పట్లో. ఇప్పుడు వాళ్ళపని తుమ్మితే ఊడే ముక్కులా వుంది. అధికారులు ఎప్పుడు తుమ్ముతారోనని భయపడుతున్నారు.

# కృషితో నాస్తి...

పంతం, పట్టుదల మనిషిచేత ఎంత పనైనా చేయిస్తుందనడానికి మోహన్ సాయి వృత్తాంతమే నిదర్శనం. బీద కుటుంబంనించి వచ్చిన మోహన్ ఏడవ తరగతి చదువుతుండగా సెకండ్‌హాండ్ పుస్తకాల షాపులో కొనుక్కున్న పాఠ్య పుస్తకం కాగితాలు వూడిపోతుంటే బైండు చేయమని ఓ బైండరు కిచ్చాడు. అప్పుడు డబ్బుల్లేవని తర్వాత ఇస్తాననే సరికి మోహన్‌కేసి ఎగాదిగా చూసి తనకి తీరుబడి లేదని పుస్తకం మోహన్ చేతిలో పెట్టి వెళ్ళిరమ్మని పంపేశాడా బైండరు. మోహన్ బాధ పడ్డాడు. తర్వాత కాగితపు గుజ్జు తయారు చేసుకుని తనే రిపేరు చేసుకున్నాడు. అతనికి ఎంతో తృప్తిగా అనిపించింది. ఆరోజు మొదలుకొని బైండింగు పన్లో మెలకువలన్నీ నేర్చుకుని ఎంతో నైపుణ్యం సంపాదించాడు. తల్లిదండ్రులకు బరువవడం ఇష్టంలేక కష్టపడి తిరిగి పెద్దలతో, స్కూలు హెడ్మాష్టర్లతో పరిచయం కల్పించుకుని, పరిస్థితులు చెప్పుకుని వారి ద్వారా బైండింగ్ వృత్తిగా స్వీకరించాడు. తన స్కూలు ఫీజులు, ఖర్చులు పోను మిగతాదానిలో కొంత సొమ్ము తల్లిదండ్రులకు పంపిస్తున్నాడు కూడా. అలా అని చదువుపట్ల నిర్లక్ష్యం చూపడు. జీవితంలోని కష్టసుఖాలను బాగా ఆకళింపు చేసుకున్నాడేమో తనలాంటి బీద విద్యార్థులకు ఉచితంగానే పుస్తకాలు బైండు చేసి పెడతాడు. మద్రాసు టి.పి. జైన్ కళాశాలలో బి.యస్‌సి.చదువుతున్న మోహన్ ఎన్నో పాత పుస్తకాలకు ఊపిరిపోసి




పునర్జన్మనిచ్చాడు. హాబీగా చేసున్నాగాని తన జీవనాధారమైన బైండింగ్ పనంటే అతనెంతో శ్రద్ధ చూపిస్తాడు.

# ఎలక్ట్రిక్ సైకిల్

ఎక్కడ చూసినా ఎలక్ట్రిక్ పరికరాలు ఎక్కువైపోయాయి. కరెంటుతో

నడిచే రైళ్ళని, ట్రాముల్ని చూశారుగాని సైకిళ్ళను చూడలేదు. కానీ బెంగుళూరికి చెందిన అనిల్ అనంత క్రిష్ణన్ అనే అతను ఈ పద్ధతిని కనిపెట్టాడు.

కెమేరా ఫ్లాష్‌కు చార్జ్ చేసినట్లే ఈ సైకిలు కూడా ఇంట్లోనే కరెంటు చార్జ్ చేస్తే గంటకు 25 కిలో మీటర్ల వేగంతో 40 కిలో మీటర్ల దూరం వెళ్తుందా సైకిలు. అందుకయ్యే ఖర్చు ఒక్క యూనిట్ విద్యుత్ మాత్రమే.



సామాన్యుడికి అందుబాటులో వుండే తక్కువ ఖరీదుగల ట్రాన్స్‌పోర్టును కనిపెట్టే వుద్దేశంతో అనిల్ పరిశోధన చేసి మామూలు సైకిలును బ్యాటరీ సాయంతో మోటారు సైకిల్లా నడిపించవచ్చని కనుగొన్నాడు. దీనికి 'ఎలక్ట్రో అనిల్ సైకిల్' అని పేరుపెట్టాడు. ఇదేగాక ఓ చిన్న ఎలక్ట్రిక్ మోటర్ సైకిల్‌ను కూడా డిజైన్ చేశాడు. ఒకవేళ దార్లో ఎక్కడైనా కరెంటు ఫెయిలయితే పెడల్స్‌తో తొక్కుకుంటూ వచ్చేయచ్చు. వీటివల్ల కాలుష్యం వుండదు, పొగ రాదు గనుక చెవులు బద్దలు చేసే చప్పుడుండదు. చీటికి మాటికి ఇంజన్ ట్రబుల్‌ను ఎదుర్కొనవసరంలేదు. రాష్ట్ర ప్రభుత్వ ఆమోదంతో కొద్దికాలంలోనే ఈ వాహనాలు వెలుగులోకి వస్తాయి.

## చోర శిఖామణి

సౌమ్యంగా, మృదువుగా మాట్లాడుతూ, ఎప్పుడూ నవ్వుతూ వుండే చార్లెస్ సొబ్రాజ్, మేరీ ఆండ్రీ అనే అమ్మాయితో కలిసి 89 మందిని హతమార్చాడంటే ఆశ్చర్యంగానే వుంటుంది. వీళ్ళిద్దరూ ఎంతో సంస్కారవంతులైన టూరిస్టులుగా నటించి దూరప్రాచ్య దేశాల్లో పెద్ద పెద్ద హోటళ్ళలో దిగిన యాత్రికులతో పరిచయం సంపాదించి స్నేహితులుగా మెలుగుతూ నమ్మకంతో వారిని వంచించి చంపి డబ్బు దస్కం



తస్కరిస్తుండేవాడు. ఓ సారి థాయ్‌లెండ్

హోటల్లో దిగిన ఆస్ట్రేలియా దంపతులతో అక్కడి నీళ్లు మంచివి కావని చెప్పి వేరే బాటిల్ పానీయాలను తాగించాడు. అంతే! ఆ తర్వాత వాళ్లు ఆస్పత్రిలో కోలుకునే లోపల 1200 డాలర్లు, ఒక కెమేరా, వజ్రపుటుంగరం మాయమయ్యాయి హోటలు గదినుంచి. బ్యాంకాక్ లోని ఓ హోటల్లో బసచేసిన 18 ఏళ్ల హిప్పీ అమ్మాయి శవం ఆ తర్వాత ఐదు రోజులకి ప్లాస్టిక్ సంచీలో థాయ్ లాండ్ గల్ఫ్ ప్రాంతాల్లో దొరికింది.

1944లో సైగాన్లో పుట్టిన సొబ్రజ్ పారిస్‌లో చదువుకున్నాడు. అందంగా ఆకర్షణీయంగా చూపరులని ఆకట్టుకునే సొబ్రజ్ ఏడు భాషల్లో నిష్ణాతుడు. ఓ పెద్ద టూరిస్టు బస్సులో వచ్చిన జనాలందరికీ విషప్రయోగం చేయడంతో గుట్టురట్టయి సొబ్రజ్ పోలీసులకు దొరికిపోయాడు. ఏడేళ్ల కఠిన జైలుశిక్ష పడింది. ప్రస్తుతం జైల్లో కూర్చుని తను చేసిన హత్యల ఉదంతాలన్నిటినీ వివరిస్తూ ఓ పుస్తకం రాయాలని ఆలోచిస్తున్నాడు. ఆ పుస్తకం మరికొన్ని కోట్లు తెచ్చిపెడుతుందతనికి.

# గుండె జబ్బుకు గరళం

త్రాచుపామే కాదు, "ఏ పాము విషమైనా ప్రాణాల్తుతీస్తుందని భయమే. పాముపేరు చెబితేనే ఆమడ దూరం పరిగెత్తే వాళ్ళకి విషాన్ని మందుగా వాడతారంటే ఈ లోకంలోంచే పైకెళ్ళిపోయే ప్రమాదం వుంది.

ఢిల్లీలోని లేడీ హార్డింగ్ ఆస్పత్రికి చెందిన ఆరుగురు డాక్టర్లు తీవ్రంగా పరిశోధనలు జరిపిన మీదట నల్ల 'జెహువన్' అనే సర్ప విషంలో వైద్యోపకార లక్షణాలున్నాయని తేల్చారు. నిజానికి ఒక వ్యక్తి గుండె ఆగిన వెంటనే మరణించడు. గుండె కొట్టుకోడం ఆగిన కొంత సేపటికి మాత్రమే ప్రాణాలు పోతాయి. ఈలోపల 'జెహువన్' విషాన్నిగనుక ఇచ్చినట్టయితే గుండె తిరిగి కొట్టుకోవడం ప్రారంభించి పునర్జీవితుడౌతాడు. కుందేళ్ళమీద,



ఎలకలమీద ప్రయోగాలు జరిపినతర్వాతనే ఈ సత్యాన్ని బైటపెట్టారు. అందుకుగాను వాటి గుండెను కృత్రిమంగా కొంత సేపు ఆపివుంచి ప్రయోగంచేసి చూశారు. కానీ ఇదింకా ప్రయోగ స్థాయిలోనే వుంది. వాడకంలోకి రావడానికి కొంత కాలం పట్టొచ్చు.

చిత్ర విచిత్రాలు జరుగుతున్న 20వ శతాబ్దంలో గుండెజబ్బుల్ని నయం చేయడానికిపాము విషాన్ని కాప్స్యూల్స్‌లో అమ్ముతారేమో ఎవరికి తెలుసు?!

డిగ్రీ చేతికొచ్చి రెండేళ్ళయింది. అంటే డిగ్రీ వయసు రెండేళ్ళు. అక్షరాలు దిద్దటం నుంచి యం. ఏ. డిగ్రీ సంపాదించడం మధ్య పదహారుసంవత్సరాలు ఖర్చు అయ్యాయి. చదువుకు ఖర్చు ఎంత య్యిందీ అని ఆలోచిస్తే అబ్బో వేల మీదే వుంటుంది. చదువుపేర ఖర్చయిన కాలంతో కొలిస్తే జీవితంలో సగం బూడిదలో పోసిన పన్నీరయినట్టే లెఖ్ఖ!

సరదాగా మొదలయిన చదువు కొంత దూరం పోయేసరికి సుడిబండగా మారి, ఆ తర్వాత వదిలించుకోలేని దెయ్యంలా అయింది. డిగ్రీ అందుకున్న రోజే కాదు, ప్రతి క్లాసు కూడా పాసవుతూంటే బ్రతుకు ఒక్కొక్క కుబుసం విడుస్తూ వచ్చినట్లే ఉంది.

ప్రకాశం ఆలోచిస్తున్నాడు!

గోడ మీద బి. ఏ. పాసయినప్పుడూ, యం.ఏ.తర్వాతా తీయించుకున్న ఫొటోలు వెక్కిరిస్తున్నట్లున్నాయి. తల్లి పరిభాషలో తనప్పుడు లేత వంకాయలా వుండేవాడు. డిగ్రీ తీసుకున్నప్పుడు ఒళ్ళంతా విజయ గర్వంతో ఉప్పొంగింది. యం.ఏ.లో జాయిన్అయినప్పుడు చెప్పనే అఖ్ఖరలేదు. వెర్రిఆనందం.మందిలోంచి ముఖ్యుల్ని ఏరే ప్రయత్నంలో నెగ్గినట్టు, తెలివయిన వాళ్ళ కోసం ఏర్పాటు చేసిన పోటీలో గెల్చినట్టూ అన్పించింది.

పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేస్తోన్నందుకు, వేలలో ఒకడిగా గుర్తించబడుతున్నందుకు గుండె గుక్కెడు మధువు సేవించినట్టు తూలిపోయింది.

ప్రకాశానికి తండ్రి మాటలు గుర్తొచ్చాయి.



"నీ చదువుకని కాదుగానీ నా వెన్ను విరిగిపోయింది. ఈ యం. ఏ. చదువు దండగ. ఇప్పుడే ఉద్యోగం కోసం ప్రయత్నం చేస్తే జీతం రావడమే గాక రెండేళ్ళ సర్వీసు పుటప్ చేసిన వాడివవుతావు."

'బి.ఏ.తో ఏ వుద్యోగం వస్తుంది. గ్రాడ్యుయేట్స్ లక్షలున్నారు. నన్ను గుర్తించేది ఎవరు?' అనుకున్నాడు.

తల్లి అన్నం పెడుతూ చెప్పింది.

"తాహతు ఆలోచించుకోవాలిరా! నువ్వు అక్షరాభ్యాసం చేసిన్నాడు మనకి నాలుగెకరాలు వుండేది. అక్కయ్య చదువు, ఆపైన దాని పెళ్ళి, నీ చదువు... చూసుకో ఈవేళ అరెకరం భూమి మిగిలింది. దాని మీద కూడా అప్పులు."

"కాదన్ను అమ్మా! ఇదంతా పెట్టుబడి లాంటిదే! మనం వట్టినే దుబారా చేయడం లేదుగా."

"యం. ఏ. చదువుతానంటున్నావు? సరే! అదయ్యాక ఖాయంగా ఉద్యోగం వస్తుందా?"

"రావాలి"

"నీ ఇష్టం"

యం. ఏ. చదువు ఆ అనుభవం, ఆ రోజులు అదంతా ఓ చక్కని కలలా మిగిలిపోయింది ఈనాటికీ.

కాలేజీ వాతావరణం, స్నేహితులు, ఆకాశం దాటి అంతరిక్ష నావకన్నా వేగంగా పోయే ఆశలు...

ఒక్కొక్క రోజూ ఒకొక్క ప్రకరణంగా అనుకుంటే కాలేజీ జీవితం ఉత్కంఠతో సాగిన కావ్యం.

అడుగడుగునా థ్రిల్.

ఇవన్నీ అప్పటి భావనలు. ఎదిగీ ఎదగని వయసు అనే సముద్రంలో ఎగసెగసి

పడే ఆవేశాల అలలు...గట్టున నుంచుని సముద్రాన్ని జాపోసన పట్టెయ్యగలమను కునే అమాయకత్వపు ఊహలు...అంత వరకే.

చదువు పూర్తి అయిన తర్వాత మని షిని కొత్త బతుకుతో చెడుగుడు ఆడ మనిగోదాంలోకి ఆహ్వానిస్తుంది భవిష్యత్. చేతికి ఏ ఆయుధం యివ్వకుండా యుద్ధ భూమిలోకి రమ్మని సవాల్ చేస్తుంది!

అప్పుడు తెలుస్తుంది భయం అంటే ఏమిటో! బాధని ఓర్చుకోవడానికి ఏం చెయ్యాలో!. నా అన్నవాళ్ళు లేకుండా ఏకాకిగా జనారణ్యంలోకి ప్రవేశించి పులులు, తోడేళ్లు, నక్కల మొహాలు తొడుక్కుని జీవనయాత్ర చేస్తూన్న మనుష్య కూటమితో ఎలా తలపడాలో!

వెనక్కి చూస్తే క్షణంలో గతంగా మారిన వర్తమానం.

ప్రకాశం ఆ గతంలోకి వెళ్లాడు. అప్పుడు అక్కడ ఏ బాదరబందీ వుండదు. అక్కడ అన్నీ శీతల సరోవరాలు. స్నేహ శీలుల ఓదార్పులు...ప్రేమలు...ఎన్నో దొరుకుతాయి.

ప్రకాశానికి సీత గుర్తొచ్చింది.

"నువ్వు కూడా యం. ఏ.లో జేర కూడదా" అన్నాడు ప్రకాశం.

"ఈ చదువే ఎక్కువ అంటున్నాడు నాన్న. యం. ఏ అన్నానంటే ఈవేళే పెళ్ళిచేసి అత్తారింటికి పొమ్మంటాడు."

"మరీ మంచిది ఆ కట్టుకున్నవాణ్ని కొంగున కట్టుకుని కాలేజీకి వెళ్లచ్చు."

"చంకన పిల్లాణ్ని కూడా ఎత్తుకుని వెళ్లచ్చు."

ప్రకాశానికి సీత మాటలు,ఆ మాటల వెనక వుండే వేగం, ఆ వేగం అంచున మెరిసే ఆప్యాయత అంటే ఎందుకో యిష్టం.

సీత పెద్ద కుటుంబంలో పుట్టింది. అన్నలు పట్నాల్లో ఉద్యోగాలు చేస్తు న్నారు. తండ్రి దశరథంగారికి ఊళ్లో పొలం వుంది ... స్వంత వ్యవసాయం చేస్తాడు. యం.ఏ.లో జేరిన్నాడు సీత కూడా అంది–

"ఉద్యోగాలు దొరకడం రోజు రోజుకూ కష్టం అయిపోతోంది. త్వరగా ఉద్యోగం సంపాదించు."

"నా ఉద్యోగం సంగతి నీ కెందు కంత తొందర...?"

"ఎందుకంటే?" సీత ఆగిపోయింది.

"నేను ఉద్యోగం లేక బాధపడితే నువ్వు..."

"దుఃఖ పడతాను బాధపడతాను... సరేనా."

"అదే, కారణం ఏమిటని?"

"కారణా కారణాలు దేనికి? నా స్నేహితుడు,క్లాస్‌మేట్ ఉద్యోగస్తుడయితే నాకు గొప్ప."

"నీ గొప్పకోసం నేను ఉద్యోగం చూసుకోవాలంటావ్?"

"జీతం నేనడగను"

"జీతం అడిగే వాళ్లు ఒక్కళ్లే"

''తల్లిదండ్రులా''

"కాదు.''

''పెళ్ళాం అని నీ భావన. అంతేనా?''

"కరక్ట్.''

"నా జీతం అడిగే పిల్లని నేను పెళ్ళాడను.''

సీత నవ్వేసింది.

ప్రకాశం కూడా నవ్వాడు.

"మన జట్టులో నీతోపాటు ఎవరెవరు వున్నారు యం.ఏ.లో?''

"పదిమంది దాకా. పద్మావతి కూడా వుంది వాళ్ళలో''

సీత మాట్లాడలేదు.

''పద్మావతి చదవగా లేన్ది నేను మానేశానేమిటని ఆలోచనా?''

''దాంతో నాకు పోలికేమిటి?''

''పద్మావతి కూడా ఆడపిల్లే కదా?''

"కాదని అంటే నువ్వూరుకునేటట్టు లేవు'' అని అంతలోనే నవ్వేసింది సీత.

''పద్మావతి మీద చెయ్యేవేస్తే ముందు వాళ్ళ వాళ్ళు కాదు, ప్రభుత్వం మనకి మంచి నీళ్ళు పుట్టకుండా చేస్తుంది.. పద్మావతిది ప్రివిలైజ్‌డ్ క్లాస్'' నవ్వుతూ అన్నాడు ప్రకాశం.

"నా మొహం. షెడ్యూల్డ్ కేస్ట్ వాళ్ళని నెత్తికెక్కించుకున్నందుకు ఓరోజు ప్రభుత్వమూ, వాళ్ళతోపాటు మనమూ ఏడ్వవల్సి వస్తుంది"

"అలా అనకు సీతా! వాళ్ళు వెనకబడిన కులంలో పుట్టి ఎన్ని బాధలు పడ్డారో మనకి అర్థం కాదు. ఊహించలేం కూడా."

"అంతకన్నా నరకం అనుభవిస్తోన్న వాళ్ళు మన కులంలో లక్షలున్నారు"

"మనం నరకం అనుభవిస్తోన్నది మన అవక తవక భేషజాలవల్ల. ఏభై ఏళ్ళ క్రితం మనం జమిందారులం. ఈ వేళ పాపర్లం అయ్యామంటే అందుకు మన పొరబాట్లే కారణం. కళ్ళు నెత్తికెక్కి మనం బోల్తా పడ్డాం. వాళ్ళు అలా కాదే? వందల సంవత్సరాల నుంచి చెయ్యి అందించే వాళ్లు లేక, ఓదార్చే వాళ్లు దొరక్క భూమిలో మొలిచిన పిచ్చి మొక్కల్లా..."

"ఈ జాలంతా పద్మావతిని చూశా."

"కాదు సీతా! ఎదటివాడు బాగుపడుతూంటే వాడిలా జీవించాలని మనం వుబలాట పడతాం. దానితోనే తెలుస్తుంది మన సాంఘిక పతనం. చెడిపోయిన వాడిలా ఒక్కరోజు బ్రతకాలని కూడా కోరుకోం.! ఎందుకని? ఆ బ్రతుకులో చీదర, దుఃఖం వుంటాయి కాబట్టి. మనం మహారాజుల్లా పుట్టాలని నిత్యం అనుకుంటాంగానీ మాలవాడిగా పుట్టాలని ఎందుకు అనుకోం, చెప్పు. వాడి జీవితం దుర్భరం కాబట్టి. ఆ నిజం మనకి బాగా తెలుసు కాబట్టి.! ఇప్పుడు చెప్పు. వాళ్ళే అదృష్టవంతులయితే వాళ్ళలా మనల్ని వుంచమని దేవుణ్ణి అడక్కపోయే వాళ్ళమా?"

సీత మాట్లాడలేదు.

పద్మావతి జ్ఞాపకం వచ్చింది ప్రకాశానికి.

పదేళ్ళు తనతో చదివింది స్కూల్లో! కాలేజీలో ఆరేళ్ళు చదివింది.

తనతో చదివిన ఎందరో ఆడపిల్లల్ని మర్చిపోయాడు. కొందరు చదువు మానేసి వెళ్ళిపోయారు. ఆర్థిక పరిస్థితులు వికటిస్తే. మరికొందరు చదువురాక మానేశారు. ఇంకొందరు డబ్బు మూలంగా చదువు అబ్బక దానికి తిలోదకాలిచ్చారు.

పద్మావతి తండ్రి తాపీపని చేసేవాడు. అన్న కూలీ పనికి వెళ్ళేవాడు. ఆ ముద్ర పద్మావతి మీద చాలాకాలం పడింది..

"మీ నాన్నగారేం చేస్తారని" టీచర్ ఓ సారి అందర్నీ అడిగినప్పుడు అందరూ గర్వంగా జవాబులు చెప్పడం, పద్మావతి తలవంచుకుని లేత మందారపు కొమ్మలా నిజం చెప్పడం, క్లాసు నవ్వులతో




ధ్వనించడం...

ప్రకాశానికి సుతి మెత్తని తన మనసుకు ముల్లు గుచ్చినట్టు అన్పించేది.

చిరిగిన పరికిణీ మీద సిరా మరకలు. పువ్వులుగా కన్పడితే ఎంత రభస జరిగేది క్లాసులో...

జడ వేసుకోకుండా చింపిరి జుట్టుతో వచ్చిన పద్మావతి అంటుకట్టని అడవి మొక్కలా కన్పిస్తే గులాబీ పువ్వులు ముళ్ల కోరలు చూసేవి!

స్కూలు పుస్తకాలు కొనలేని పద్మావతి లేమితనం చూసి తన పుస్తకాలు ఇచ్చి పద్మావతి కళ్ళకి కన్నీటి వరదలు రాకుండా ఆనకట్ట కట్టేవాడు.

పద్మావతికి స్కూల్ ఫస్ట్ వచ్చిన రోజు...

''బాగా చదివావు కదూ!'' అన్నాడు ప్రకాశం.

"సగం గొప్ప నీదే ప్రకాశం. లేకపోతే ఫెలయ్యేదాన్ని.''

''నాకు పుస్తకాలు ఎందుకు? మా నాన్నగారు చెప్తారు. కొందరి నాలిక చివర్న సరస్వతి తిష్ట వేసుకుని కూర్చుంటుందిట."

పద్మావతి నవ్వేది.

రేపటి కోసం ఎదురు చూసే గులాబీ మొగ్గలోని ఆరాటం, ఆనందం కన్పించే నవ్వు అది.

ప్రకాశంతోపాటు కాలేజీలో ప్రవేశించింది పద్మావతి. స్కాలర్‌షిప్ వచ్చింది తెలికగానే. పద్మావతిలో మార్పు ప్రకాశానికి బాగా గుర్తుండేది! కింది తరగతి నుంచి మధ్య తరగతి జాబితాలోకి వస్తోంది పద్మావతి. ఇంకొంచెం తోడ్పాటు వుంటే పద్మావతి పైమెట్టు చేరుకోవడం కష్టం కాదు.

కాలం ఆగదు. కష్టాల కావిడి వేసుకునో, సుఖసంతోషాలు నెత్తికెత్తుకునో నడుస్తూనే వుంటుంది.

పద్మావతి యమ్.ఏ.లో జేరినందుకు ఈర్ష్యపడ్డవాళ్ళనీ, తమ బాధని వ్యంగ్యంగా మార్చి మాటల తూటాలు వదిలినవాళ్ళనీ చూశాడు.

పద్మావతి సెకెండ్ క్లాస్‌లో పాసయ్యింది.

"కంగ్రాట్స్'' అన్నాడు ప్రకాశం.

"డబుల్ కంగ్రాట్స్" అంది పద్మావతి.

"ఎందుకు?"

"నీది ఫస్ట్‌క్లాస్ కదా.''

"నీ సెకెండ్‌క్లాస్‌తో పోలిస్తే నాది ఫెయిల్యూర్ కిందే లెఖ్ఖ.''

''ఎలా?''

''నీ పరిస్థితుల్లో అయితే నేను టి.సీ తీసుకుని తిరోగమనం పట్టేవాణ్ణి."

"అదేం లేదు ప్రకాశం. కష్టాలు సుఖాల ఉధృతం కొంతకాలమే. వాటికి అలవాటు పడ్డవారికి ఆ అనుభూతి పాతదయి పోతుంది.''

"నువ్వు బాధని దాచుకోగలవు. అదే నీ అడిషనల్ క్వాలిఫికేషన్"

"ఎదటివాళ్ళ బాధకి తట్టుకోలేవు నువ్వు. అదే నీ ప్రత్యేకత"

''గట్టున కూర్చుని కబుర్లు చెప్పడం ఏమంత విశేషం కాదు."

"గట్టుదాకా వచ్చినవాడివి. చాలు.''

"ఇప్పుడేం చేస్తావ్?"

"ఏం చేస్తాను. ఇంటికి వెడతాను."

నవ్వేసింది పద్మావతి. ఆపైన అంది. "రిసెర్చి చేద్దామనుకుంటున్నాను."

"కంగ్రాట్యులేషన్స్. చాలాఅదృష్టం"

"నువ్వూ చెయ్యి ప్రకాశం"

"రిసెర్చ్ కు స్తినా .... ఇప్పటికే మా వాళ్లు అలసిపోయారు."

"ఎంత రెండేళ్ళలోపు."

"లేదు పద్మా ! మా ఇంటి పరిస్థితులు బాగా లేవు. ఉద్యోగం చెయ్యాలి."

పద్మావతి మాట్లాడ లేదు.

నెల తర్వాత పద్మావతి వారణాసి వెళ్ళింది బెనారస్ హిందూ యూనివర్సిటీలో రిసెర్చి చేయడానికి.

ప్రకాశం స్టేషన్‌కి వెళ్లాడు. పద్మావతి తండ్రి, అన్నలు, చుట్టాలు ఎందరో వచ్చారు. వాళ్ళందరూ మట్టి మనుషులు, చరిత్ర హీనులు. కానీ అందరూ కలిసి ఓ బంగారు బొమ్మకి ప్రాణం పోశారు.

"నీకు ఉద్యోగం దొరగ్గానే లెటర్ రాయి" అంది పద్మావతి. తన యడ్రసు ఇచ్చింది.

"అలానే"

"అదేమిటి అలా డీలా మొహం వేశావ్"

"మంచి స్నేహితురాలివి దూరం వెడుతున్నావ్" ప్రకాశానికి పద్మావతితో తనకున్న ఆత్మీయత ఎంతటిదో ఆ రోజు తెలిసింది ! రైలు తన శక్తినంతా కూడ గట్టుకుని హోరు చేసుకుంటూ ప్రతీ స్టేషన్‌లోనూ ఆగి, రోజూ ఎంతమంది స్నేహితుల్ని, భార్యాభర్తల్ని, చుట్టాల్ని విడదీస్తుందో!!

ఎందుకిలా మెదడు ఆలోచనల చుట్టూ తిరుగుతుంది. అలసిన మనసుకు అందమైన గతం అంటే ఎంత అభిమానం. గాయపడ్డ సైనికుడిలా వెనక్కి పరిగెడుతుంది!

ప్రకాశం కాలవ గట్టు మీద నుంచి లేచాడు. చీకటి పడింది. ఆలోచనలకు అలసట వచ్చింది. ఇల్లు నిశ్శబ్దంగా ఆహ్వానించింది.

తల్లి అన్నం పెడుతూ అడిగింది.

"నాన్నగారితో పొద్దున్న అన్నావట హైదరాబాద్ వెడతానని"

"అవును."

"ఎందుకూ?"

"ఉద్యోగం సంపాదించుకుందుకు"

"ఎవరిస్తారు ?"

"ఫలానా వాళ్లు వుంటే వాళ్ళ దగ్గరకు వెళ్లవచ్చు. ఎవరూ తెలియనప్పుడు అందరూ తెలిసిన వాళ్లే అనుకోవాలి."

"డబ్బు ఎలాగరా?"

ప్రకాశం మాట్లాడలేదు. అన్నం దగ్గర నుంచి లేచి మంచం మీద వాలాడు.

తండ్రి భోజనం చేసి వాకిట్లోకి వచ్చి ఉయ్యాల బల్ల మీద కూర్చున్నాడు. ఉయ్యాల చప్పుడు.

"వీడు వెళ్లడం ఖాయమేనా ?"

"వెడతాట్ట"

"ఇంటర్వ్యూ ఏమన్నా వచ్చిందా?"

"ఈ వేళ పోస్ట్‌లో ఏదో ఉత్తరం వచ్చింది.."

"డబ్బు వాడి దగ్గరేమన్నా వుందా?"

"వాడి దగ్గర ఎక్కడి నుంచి వస్తుంది? మీరే ఎవర్నయినా అడిగి తెండి."

"బావుంది..." విసుక్కున్నాడు గోపాలరావుగారు.

"అలా అంటే ఎలా అండీ..."

"నువ్విలా పోరి వాణ్ని ఇంత దూరం లాక్కొచ్చావ్... హాయిగా వ్యవసాయం చేసుకుంటే ఎంత బావుండేది.."

"అరెకరం వ్యవసాయమా ! అందులో బ్రాహ్మణ వ్యవసాయం.."

"అరోజయితే నాలుగెకరాల చెక్క"





ప్రకాశానికి యిక తల్లి దండ్రుల మాటలు వినబడలేదు.. ఆ రోజు పోస్ట్‌లో వచ్చిన ఇంటర్వ్యూ కార్డు గుర్తుకు వస్తోంది ఇంటర్వ్యూ ఎలా చేస్తాడు తను? ఎలా వెయ్యాలి? అనే ఆలోచనల కన్నా గుమ్మం ఎలా దాటాలన్నదే ప్రశ్న! డబ్బు... డబ్బు... సీతని అడిగితే.....

మర్నాడు సీతే వచ్చింది తల్లిని పేరంటానికి పిలవడానికి...

"అమ్మ లేదా?"

"పూజ గదిలో వుందేమో"

"అమ్మో మైల బట్టలతో లోపలికి.."

"నా గదిలోకి మరి ఎలా వచ్చావ్?" నవ్వుతూ అడిగాడు.

"అది సరే నీకు ఇంటర్వ్యూ వచ్చిందటగా.."

"అవును.."

"అయితే హైదరాబాద్ వెడుతున్నావా?"

"వెళ్ళాలి..."

"మళ్లీ రావా?"

"నిరుద్యోగిగా మాత్రం రాను.."

"ప్రకాశం..." అంది అదోలా సీత

"ఏమిటి?"

"నువ్వు ఉద్యోగంతో తిరిగిరా. చాలా త్వరగా తిరిగి రావాలి తెలుసా"

"ఎందుకు?

"ఎందుకో తెలియదా?"

"తెలియక పోతేనే అడుగుతారు"

"తెలిసీ అడిగితే"

"అది నటన"

"ప్రకాశం! నాన్న సంబంధాలు చూస్తున్నాడు నాకు. వచ్చిన సంబంధాలన్నీ వంక బెట్టి నాకొద్దు అనేయాలనుకుంటున్నాను"

"పెళ్ళి చేసుకోవా?"

"ఊహూ"

"మగవాళ్ళ మీద కోపమా?"

"కాదు. నిరుద్యోగులమీద జాలి" సీత నవ్వేసింది.

ప్రకాశం సీతనే చూస్తున్నాడు. సీత కళ్ళు, సీత చూపులు, ఆ చూపుల వెనక దాక్కున్న కంగారు, ఎగిసిపడే గుండెను కప్పలేని పమిట చాటు అందం.

"సీతా! ఒకవేళ నేను..."

"నన్ను గుర్తు పెట్టుకో చాలు" అనేసి లోపలికి వెళ్ళిపోయింది.

ప్రకాశానికి సీత వెళ్ళిన జాగాలో చీకటి! సీత అందగత్తె, అదృష్టవంతురాలు. తనని ప్రేమించే మనిషి. తను కూడా తరచు ప్రేమిస్తున్నానేమోనని వెన్ను తడుముకునేటట్లు చేసే మనిషి.

సీతతో పెళ్ళి, సీతతో సంసారం, సీతతో జీవనం. నిజమే! అదృష్టవంతుడికి సీత అన్నివిధాలా తగిన భార్య.

ప్రకాశం బట్టలు సర్దుకుని బయలుదేరబోతూ పర్స్ చూసుకుంటే అందులో తల్లి బంగారు గాజులు కన్పించాయి.

"అవసరం వస్తే అమ్మేయి. పరవాలేదు. నాన్నగారికి చెప్పే యిచ్చాను" అంది తల్లి.

"మొహమాట పడకు. చిన్నాన్నగారింట్లో వుండు. నాన్న ఉత్తరం రాశారు" అంది తల్లి ఓ పెద్ద బుట్టనిండా మిఠాయి వుండలు పెట్టి.

"ఇవన్నీ ఎందుకమ్మా?"

"శారదా, రాణీ మిఠాయి అంటే పడి చస్తార్రా" అంది ఆవిడ.

"స్నేహితుల్తో బజార్ల వెంబడి బలాదూర్లు తిరక్కు. ఉత్తరం రాయి" గోపాలరావుగారు చెప్పారు. "పిన్నిని

అడిగానని చెప్పు"

ప్రకాశం రైలు ఎక్కాడు. పిన్ని... లలితమ్మ పిన్ని పినతండ్రిభార్య... చిన్నతనంలో భర్త పోతే కొడుకురాఘవనీ, కూతుళ్లుశారదనీ,రాణినీ పెట్టుకుని హైదరాబాద్‌లో వుంటోంది. రాఘవకి పెళ్ళి అయింది. శారద పెళ్ళి చేసుకోలేదు. తనకన్నా పెద్దది. రాణీ తనకన్నా చిన్నది.

ప్రకాశం గైడ్ తీసుకుని ప్రపంచ జ్ఞానం మననం చేసుకుంటున్నాడు. విజ్ఞాన సర్వస్వం ఆ పుస్తకం. ఇంటర్వ్యూలకు వెళ్ళే నిరుద్యోగులకు అది కల్పతరువు.




ప్రకాశం హైదరాబాద్‌లో రైలు దిగి రాఘవ కోసం జనంలో వెదుకుతున్నాడు. రైలు దిగిన వాళ్ళని రిసీవ్ చేసుకుందుకు వచ్చినవాళ్ళు నవ్వులతో, కబుర్లతో చుట్టు ముడుతున్నారు, ఎంత కోలాహలం. "ప్రకాశం!" అంటూ దూరం నుంచి రాఘవ పెట్టిన కేకతో ప్రకాశం సూట్‌కేస్ తీసుకుని ఎదురు వెళ్ళాడు.

"నువ్వొచ్చిన మూలంగా అనుకుంటా నురా రైలు టైముకి వచ్చింది"

ప్రకాశం నవ్వేశాడు.

ప్రకాశం తన ఇంటర్వ్యూ సంగతీ, ఇంటి గొడవలూ చెప్పాడు. రాఘవ సరిపోని తన జీతం గురించి, రావల్సిన ఇంక్రిమెంట్ల గురించి, చెల్లెళ్ల పెళ్ళిళ్ళ గురించి చెప్పాడు.

ఇద్దరూ బాలనగర్ దాటి హెచ్.ఎమ్.టి. వైపు మళ్ళి ఐ.డి.పి.యల్. కాలనీలోకి వెళ్ళారు. ఓ గుడినీ, మరో చర్చినీ, షాపింగ్ సెంటర్నీ దాటి ఓ సందులో ఆగింది ఆటో.

"పైకి నడు"

ప్రకాశం మెట్లెక్కాడు.

లలితమ్మగారు ప్రకాశాన్ని చూసి-

"రా రా, అమ్మా నాన్నగారూ కులాసానా?" అంటూ పలకరించింది. లోపలి నుంచి శారదా, రాణీ వచ్చారు.

"బావున్నావా" అంది శారద.

"ఉద్యోగం లేదన్న బెంగతో చిక్కిపోయి కన్పిస్తూంటే అలా అడుగుతావేమిటి అక్కయ్యా" అంది రాణి.

ప్రకాశం ఊరుకోలేదు. "నువ్వూ చిక్కినట్లు కన్పిస్తున్నావ్ పెళ్ళిబెంగేనా?"

"పెళ్ళి కాదురా! దానికీ ఉద్యోగం పిచ్చి"

"మీ ఫ్యాక్టరీలోనే ఓ పెళ్ళి కొడుకుని చూస్తే పోలా?"

"నువ్వొచ్చిన తర్వాత కలిసి ఆ పని చేద్దామని ఆగాడు" వ్యంగ్యంగా అంది రాణి.

ఓ అరగంటలో శారద సూట్‌కేస్ లాంటి హేండ్‌బేగ్ తీసుకుని ఆఫీసుకు బయలుదేరింది. చిన్న స్టీల్ టిఫిన్ బాక్స్‌తో రాఘవ గుమ్మం దిగుతూ అన్నాడు-

''నువ్వు రెస్ట్ తీసుకో.''

''ఇంటర్వ్యూ ఎక్కడో చూసుకుని రావద్దా.''

''దగ్గరేలేవోయ్ రేపు నేనూ వస్తానులే."

ప్రకాశానికి అప్పుడు గుర్తొచ్చింది. "అన్నయ్యా! ఈ ఊళ్ళో నాతోపాటు బి.ఏ చదివిన మిత్రుడు శేఖరం అని వున్నాడు. వాడి అడ్రసు వుంది. వెళ్ళి ఓసారి కలిసొస్తాను''

"పెందరాళే వచ్చెయ్యి. బస్‌లు దొరక్క ఇబ్బంది పడతావ్" అంటూ ఏ నెంబర్ల బస్‌లు ఎక్కి ఎక్కడికి వెళ్ళాలో వివరంగా చెప్పాడు.

''సరే."

ప్రకాశం కాసేపు న్యూస్ పేపర్ చదివాడు. ఇంతలో రాణి వచ్చింది.

"అన్నయ్యా! నాకూ ఉద్యోగం దొరికితే బావుణ్ను'' అంది.

ప్రకాశం ఆశ్చర్యంగా రాణివైపు చూశాడు.

''అవును. ఉట్టినే గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవాలంటే బాధగా వుంది."

''ఏ టైలరింగో నేర్చుకో, మహాగిరాకి అనుకో."

"నా దగ్గర బట్టలు ఎవరు కుట్టించు కుంటారు? ఒకవేళ కుట్టించుకున్నా అన్నీ ఫ్రీ కాతాలే.''

ఇంతలో లోపలినుంచి రాఘవ భార్య విశాల వచ్చింది.

"భోజనం చేస్తావా మరిదీ'' అంటూ.

''ఇంత పొద్దున్నేనా!"

''మీ అన్నయ్య తొమ్మిదింటికి తింటారు. శారదా అంతే.''

"తరువాత"

"తరువాత ఏముంది. కబుర్లు, పుస్తకాలు చదువుకోవడం. కాలనీలో వేరే తోచుబాటు ఏం లేదు.''

''మీకు క్లబ్ లేదా?''

''ఉంది.''

"మహిళా మండలి?"

"లేదు"

''ఒకటి స్థాపించు వదినా. బోల్డు కాలక్షేపం."

"ఇక్కడ కాలనీలంటే మన పల్లె టూర్లలాంటివి. పక్కింటి వాళ్ళ తాజా కూరలూ, వాళ్ళ చీరలూ, వాటి ఖరీదు ఇవే చెవిలో పడతాయి. మా లోకం ఇంత వరకే" విశాల నవ్వేసింది. ప్రకాశం ఓ గంట తర్వాత నారాయణగూడా బయలు దేరాడు. రెండుగంటల తర్వాత నారాయణ గూడా చేరుకున్నాడు. ప్రకాశాన్ని చూడ గానే శేఖరం చేతులు కలిపి కౌగలించు కున్నాడు.

''ఏమిటి హైదరాబాద్ వచ్చింది పక్షి."

"పక్షి పనే అది...తిరగడం."

''సంగతి చెప్పరా.''

''ఇంటర్వ్యూ వచ్చింది."

"ఎక్కడా? ఎప్పుడు?"

ప్రకాశం వివరంగా చెప్పాడు

"అరే" అంటూ కళ్ళు తేలవేశాడు శేఖరం.

ప్రకాశానికి శేఖరం తడబాటు అర్థం కాలేదు.

''అదేమిటిరా. అలా అయిపోతు న్నావ్" శేఖరం సర్దుకుని, "నాకూ వచ్చిందిరా ఇంటర్వ్యూ, ఇదిగో" అంటూ లెటర్ తీసి చూపించాడు.

''చాలా బావుందిరా.''

"ఏమిటి ఈకాల్ లెటరా?''

ప్రకాశానికి శేఖరం ఆ ఇంటర్వ్యూ ఎవరు చేసేదీ, ఎలా చేసేదీ, ఎన్ని ఉద్యోగాలు ఖాళీ వున్నదీ వాళ్లు ఎన్ని

ఖాళీలు భర్తీ చేసేదీ కథగా చెప్పాడు.

"అయితే నువ్వు చాలా స్పీడ్‌లో వున్నావ్?"

"ఏం స్పీడో లేరా."

ప్రకాశం నెమ్మదిగా తను ఇంటి దగ్గర నుంచి ఎలా బయలు దేరిందీ, తనకి ఉద్యోగం ఎంత అవసరమో అన్నీ చెప్పాడు.

"ఏమిటోరా. బి.ఏ. అవగానే నాన్న చెప్పినట్టు అప్పుడే ఉద్యోగం చూసుకోవాల్సింది."

"నీకేంరా యం.ఏ.వి"

"పెర్సనాలిటీకి ఎన్ని మార్కులు పడతాయో నా డిగ్రీకి అవే మార్కులురా. నేను రాకేండిడేట్ నే కదా"

శేఖరం మాట్లాడలేదు.

"మనకిఉద్యోగం వస్తుందంటావురా?" ప్రకాశం ఆశగా అడిగాడు.

శేఖరం ఎక్కడో ఆలోచిస్తున్నవాడు తేరుకుని నెమ్మదిగా అన్నాడు.

"ఇంటర్వ్యూ చేసే పెద్దమనిషి శేషావతారంగారనిఉద్దండపిండం. ఆయనకి కాండిడేట్ల తెలివి తేటలతో, ప్రజ్ఞతో పని లేదు. తనవాళ్ళన్న వాళ్లు ఇంటర్వ్యూకి వస్తే ఓ టిక్ పారేస్తాడు. మహామేధావి గాడవనీ, పై కులం వాడయితే చాలు ఆయనకు దోమల్లా, చీమల్లా కన్పిస్తారు."

"చచ్చాం"

"రోజులలా వున్నాయి"

"సరే నిరాశతోనే వెడదాం ఇంటర్వ్యూకి."

"పరవాలేదురా. ఆయన మీ వాడే. కానీ నువ్వు ఆయన కులం వాడివని ఆయనకు తెలియాలి అంతే..."

"ఛా ఛా వద్దురా. ఉద్యోగం కోసం ఇలా దొడ్డి తలుపులు తెరుచుకుని దొంగలా రంగ ప్రవేశం చేయడం..."

"రోజులు బ్రదర్!నిజాయితీ పేంటూ, స్వమత షర్టూ తొడుక్కుని, డిగ్రీ టై కట్టుకుని 'నాకో ఉద్యోగం ఇవ్వండంటే ఎవరూ యివ్వరోయ్. మనుష్యుల్ని పట్టాలి. సమయం చూసి వలవెయ్యాలి."

ప్రకాశం ఆలోచిస్తున్నాడు. ఉద్యోగం కోసం వ్యక్తిత్వాన్ని చంపుకోవాలా లేక వ్యక్తిత్వం కోసం ఉద్యోగం కాదనాలా!

"మన ఊరి చలమయ్యగాడు గుర్తున్నాడా"

"చలమయ్య అంటే..."

"అదేరా రాఘవయ్య తమ్ముడు."

"స్కూల్ ఫైనల్లో మనతో చదివి గజనీఘోరీ దండయాత్రలు చేసి..."

"ఆ.."

"వాడిప్పుడు ఈ ఊళ్ళోనే పెద్ద ఉద్యోగం సంపాదించాడు."

"మంచిదే"

"మంచిది కాదోయ్. ఎలా సంపాదించాడను? వాడికి డిగ్రీలేదు. కానీ, డిగ్రీ వాడుతప్పచేయలేనిఉద్యోగంచేస్తున్నాడు. వాణ్ని చూస్తే ఆశ్చర్యపోతావ్. నీలాంటి యం.ఏ గాళ్ళనీ, నాలాంటి బిఏ గాళ్ళనీ వాడు పాలేర్లని చూసినట్టు చూస్తాడీ రోజు."

"రోజులు కలిసివచ్చి వుంటాయ్."

"అందుకే చెప్తున్నాను. శేషావతారం పేరు గుర్తుపెట్టుకో. సమయం, సందర్భం చూసి వాత పెట్టు. వారం తిరిగేసరికి నువ్వూ ఉద్యోగస్తుడివి అవుతావ్."

ప్రకాశం చిరాగ్గా అన్నాడు. "ఆపరా గోల. నువ్వేం ప్రిపేర్ అవుతున్నావ్. ఏ పుస్తకాలు చదువుతున్నావ్. సబ్జెక్ట్ రీడింగ్ ఇద్దామా చెప్పు."





"నా బొంద. ఇంటర్వ్యూ లేదు, పాడు లేదు. ఇదేం పరీక్ష కాదురా. స్వయం వరంగా బాబూ" అన్నాడు నవ్వేస్తూ శేఖరం.

* * *

ఇంటర్వ్యూకి యిరవై మంది వచ్చారు. అంతా హడావిడిగా వుంది. నిరుద్యోగుల సమావేశం జరుగుతున్నట్టుగా వుంది. అందరూ పాతిక సంవత్సరాల లోపు కుర్రకారే. ప్రతీ ఒక్కరూ క్లాస్‌గా డ్రెస్ చేసుకున్నారు. షేవ్ చేసుకున్నారు. వాళ్ల మొహాల్లోంచి ఉద్యోగం ఆకలి తీసేస్తే వాళ్ళంతా జాతి పరువు నిలబెట్టే యువతరంగా కన్పిస్తున్నారు. నిరుద్యోగుల్లా ఎక్కువ కాలం వాళ్ళని అలానే వుంచితే ఆకలిగొన్న పులులూ, సింహాలుగామారేట్టుకూడా కన్పిస్తున్నారు.

అరగంట తర్వాత సలుగురు సూపర్వైజర్లు లోపలినుంచి వచ్చి ఇంటర్వ్యూకి వచ్చిన వాళ్ల సర్టిఫికెట్లు చెక్ చేసి ప్రథమ పరీక్ష పూర్తిచేసి వాళ్లందర్నీ బంగారయ్య అనే ప్యూన్‌కి అప్పగించి "ఒకళ్ల తర్వాత ఒకళ్ళనే పంపు" అంటూ హెచ్చరించి వెళ్ళిపోయారు.

బంగారయ్య తన డ్రెస్ సర్దుకుని, టోపీ సరిచేసుకుని రాజభవన్ దగ్గర కాపలా వుండే మిలిటరీ ఆఫీసర్‌లా మారిపోయాడు. పది నిమిషాల్లో ఇంటర్వ్యూ మొదలయ్యింది. ప్రకాశం లోపలికి వెళ్లి వస్తూన్న వాళ్ళని లెక్కపెట్టడం మొదలు పెట్టాడు. కొందరు ఇంటర్వ్యూ యిచ్చి వచ్చినవాళ్లని, కార్యం గదిలోంచి వచ్చిన పెళ్ళికూతుర్ని చుట్టుముట్టిన ముత్తయిదువుల్లా పట్టుకుని లోపలేం జరిగిందీ అడుగుతున్నారు.

ప్రకాశం గుండె కొత్త తరహాలో కొట్టుకుంటోంది.

బంగారయ్య లోపలినుంచి వచ్చి "ప్రకాశంగారు". అని పిలిచి, లోపలికి దారి చూపించాడు.

ప్రకాశం లోపలికి వెళ్లాడు. సలుగురు ఆఫీసర్లు కుర్చీల్లో కూర్చునివున్నారు.

ప్రకాశం. అందరికీ మూకుమ్మడిగా నమస్కారం చేశాడు.

వాళ్లలో ఒకాయన మౌనంగా కూర్చోమని సౌంజ్ఞ చేశాడు.

ఒకాయన ప్రకాశాన్ని పేరూ, క్వాలిఫికేషన్ అడిగాడు.

ఒకాయన రాజకీయాల గురించి అడిగాడు. మరొకాయన ఓ సినిమా హీరోయిన్ చుట్టు కొలతలు అడిగాడు.

దానికి మిగిలిన ముగ్గురూ సినిమా టిక్‌గా నవ్వారు.

"అలా వున్నావేం?"

"నాలుగు రోజులక్రితం జ్వరం వచ్చింది"

వెంటనే శేషావతారంగారు టేబిల్ మీదికి వంగి, "చూడు మిస్టర్! కాస్త ఒళ్లు వేడి చేస్తే థర్మామీటర్ కోసం పరుగు పెడతాం. ఆ థర్మామీటర్ కని పెట్టిన ధర్మాత్ముడి పేరు చెప్తావా?" అన్నాడు.

"సెంట్రోయిస్" ప్రకాశం చెప్పాడు.

"మరి గేలన్ ఎవరూ?"

"రోమన్ ఫిజీషియన్."

"ఆఁ సరే! లిబిడో అనే మాట విన్నావా? వింటే దాన్ని గురించి వివరంగా చెప్తావా"

"అది మనిషి మనసులో వుండే అంతస్సు. అందులో ఎన్నో తీరని



వాంఛలు బోనులో సింహాల మాదిరి గర్జిస్తూ వుంటాయంటారు సార్."

అంతటితో ప్రకాశం ఇంటర్వ్యూ అయింది. బయటకు రాగానే శేఖరం పట్టుకున్నాడు. ప్రకాశం లోపల జరిగిన తతంగం చెప్పాడు.

"నే వచ్చేవరకూ వుండు" అని శేఖరం లోపలికి పరిగెత్తాడు.

ప్రకాశం ఇంటర్వ్యూ వాళ్ల కోసం వేసిన కుర్చీలో కూర్చున్నాడు. అతని ఆలోచనలన్నీ ఇంటర్వ్యూ మీదే వున్నాయి. తను ఇంటర్వ్యూ బాగానే చేశాడు. అయితే తను సెలక్ట్ అవుతాడా. శేషావతారం గుర్తొచ్చాడు. శేఖరం చెప్పినట్టుగా శేషావతారాన్ని కల్సుకుంటే పని అవచ్చేమో!

శేఖరం రూమ్‌లోంచి బయటకు వచ్చాడు. ప్రకాశం శేఖరానికి ఎదురు వెళ్లాడు.

"ఎలా చేశావు ఇంటర్వ్యూ"

"సింపిల్‌గా ఫేలయ్యాను"

"అరే"

"పరవాలేదురా ఇది కాకపోతే మరో ఉద్యోగం" అంటూ శేఖరం ప్రకాశాన్ని చూసి–

"మరి రూమ్‌కి పోదామా."

"పద."

"అయితే నే చెప్పింది మర్చి పోయావా?" శేఖరం ప్రకాశాన్ని అడిగాడు.

"అంటే"

"అదేనోయ్! శేషావతారాన్ని కల్సుకోవా?"

"ఎలా కల్సుకోవాలిరా."





శేఖరం క్షణం ఆలోచించి ప్యూన్ బంగారయ్యని పక్కకి పిల్చి వాడి చేతిలో ఐదు రూపాయల కాగితం కుక్కి "బాగున్నావా బంగారయ్యా" అన్నాడు ఎంతో తెలిసిన మనిషిలా.

బంగారయ్య క్షణం ఆశ్చర్యపడి ఆపైన తనకే అలవాటయిన నువ్వు ఒకటి నవ్వేసి

"మీ దయవల్ల బాబూ" అన్నాడు.

"నీతో చిన్న పనుంది బంగారయ్యా"

"చెప్పండి."

"శేషావతారం గారిల్లెక్కడ. కరెక్ట్‌గా చెప్పగలవా?"

"అదేటి బాబూ అశోక్‌నగర్‌లో" అంటూ జేబులోంచి చిన్న పుస్తకం తెరిచి ఇంటి నెంబరు చెప్పాడు.

"అది నీ డైరీనా బంగారయ్యా?"

"పెద్దోళ్ళ అడ్రసులు బాబూ! మీ లాంటోళ్ళకి పని బడతది కదాఅని..."

"మంచిది వెళ్లిరా"

బంగారయ్య వెళ్లిన తర్వాత "మరి శేషావతారాన్ని కల్సుకుంటావా?" అని ప్రకాశాన్ని అడిగాడు.

"ఇంటికెందుకురా, ఇక్కడే కల్సుకుంటే బావుంటుందేమో!"

"నీ ఇష్టం"

"ఆయన ఒక్కడూ వుండడం చూసి కల్సుకుందామనుకుంటున్నాను."

"మరి నే వెడతాను"

"మళ్లీ కలుస్తాను" శేఖరం మెట్లు దిగి వీధిలో పడ్డాడు.

ప్రకాశం ఓ అరగంట అక్కడ వుండి, ఇంటర్వ్యూకి వచ్చిన మిగతా సభ్యులు వెళ్లిపోయిన తర్వాత కుర్చీలోంచి లేచాడు. అతనికంతా కొత్తగా వుంది. గుండె చేత్తో పట్టుకోవల్సిన అవసరం

కల్గుతోన్న అనుభవం.

బంగారయ్య అటుగా వెడుతోన్న వాడల్లా ఆగి "ఏటి బాబూ! ఇంకా వున్నారు?" అన్నాడు ఆశ్చర్యంగా

"శేషావతారంగార్ని కలవాలి."

"అయ్యగార్నా?!"

"అవును."

"ఆరిప్పుడు అలిసి పోయివున్నారు కదండీ ... మిమ్మల్ని లోన కంపిస్తే నన్ను బూతులు తిడతారు."

ప్రకాశం జేబులోంచి ఓ అయిదు కాగితం తీసి బంగారయ్య చేతిలో పెట్టి చటుక్కున శేషావతారం గదిలోకి మెరుపులా వెళ్లాడు. అప్పుడు శేషావతారం తలొంచుకుని పని చేసుకుంటున్నాడు. చప్పుడుకు తలెత్తి ప్రకాశాన్ని చూశాడు.

"సార్! నేను ఇంటర్వ్యూ ఇచ్చాను. నా పేరు ప్రకాశం. మా ఇంటి పేరు వాడ్రేవు మా నాన్నగారి పేరు గోపాలరావు. మాకేం ఆస్తి లేదండి. ఉన్న రెండెకరాలూ చదువుకే అయ్యింది. నాకు యం.ఏ.లో ఫస్ట్ క్లాస్ వచ్చింది. కానీ ఉద్యోగం రాలేదు. బ్రాహ్మలకు ఉద్యోగాలెవరూ యివ్వడంలేదు. మీరు బ్రాహ్మలని విన్నాను. బ్రాహ్మలంటే మీకు సాఫ్ట్ కార్నర్ వుందని తెలిసింది."

శేషావతారంగారు మాన్పడిపోయాడు. ఆయన కళ్లలో అగ్ని గోళాలు కదులున్నాయి.

"మిస్టర్...యు గెటవుట్ ఫస్ట్" అని అరిచేశాడు.

ప్రకాశం అదిరిపోయాడు. బెంబేలు పడిపోయాడు. శేషావతారంగారి తిట్లతో బంగారయ్య వచ్చి ప్రకాశాన్ని బయటకు తీసుకు వెళ్లాడు.

"వెళ్లండి బాబూ"

ప్రకాశానికి ఏం చెయ్యాలో తోచలేదు. రోడ్డుమీద పడ్డాడు. కాఫీ తాగి పారడైజ్ దగ్గర నిలబడ్డాడు. ఎంత మర్చిపోదామనుకున్నా శేషావతారంగారి ఉగ్రరూపం గుర్తుకు వస్తోంది. ఇంతలో ఒకటి రెండు ఆర్ టిసి కాంట్రాక్ట్ బస్‌లు వచ్చి ఆగాయి. అందులోంచి ఎందరో దిగుతున్నారు. ఆ దిగిన వాళ్లలోంచి చలమయ్య దిగాడు.

ప్రకాశం ఆశ్చర్యంగా చలమయ్యని చూసే లోపునే చలమయ్య ప్రకాశాన్ని గుర్తు పట్టి "ఏటి ఇట్టా వచ్చావ్? నే గుర్తుండానా ప్రకాశం?" అంటూ ప్రకాశం భుజం మీద గుద్దాడు.

ప్రకాశం-"బాపున్నాను, ఇంటర్వ్యూకి వచ్చాను. నువ్వెక్కడ పనిచేస్తూంటా?" అని అడిగాడు.

"బి.హెచ్.ఇ.ఎల్. లో వుంటన్నా" అని, "నువ్వేం చేస్తున్నా?"అని అడిగాడు.

"యం.ఏ. అయ్యింది"

చలమయ్య అదిరిపోయాడు ఆ మాటకి. అతనికి ప్రకాశాన్ని చూస్తే కొద్దిగా జాలీ మిక్కుటంగా ఈర్ష్యా కలిగాయి. అంతలోనే మెరుపులా ఏదో ఆలోచన వచ్చింది.

"ఎక్కడ దిగా?" అని అడిగాడు.

"ఐ.డి.పి.ఎల్. కాలనీలో మా కజిన్ వున్నాడు. అక్కడే దిగాను."

"బి.హెచ్.ఇ.ఎల్.కి రా...చాలా పెద్ద కంపెనీ. గవర్నమెంటుది"

"విన్నాను. నాకేపన్నా ఉద్యోగం దొరుకుతుందా...అక్కడ ?" ప్రకాశం ఆత్రుతగా అడిగాడు.

"అబ్బో చాలా కష్టం. అయినా

చూద్దాం...రా''

"రేపే వస్తాను''

''నా అడ్రసు ఇదిగో. ఇల్లు కూడా కాలనీలోనే. చుట్టాల పెళ్లి వుంటే ఇలా వచ్చాను. తప్పకుండా రా మర్చిపోకు'' అనేసి స్టేషన్‌కి వెళ్ళే బస్‌స్టాప్‌కి వెళ్లాడు.

ప్రకాశానికి చలమయ్య ఆశ్చర్యంగా వింతగా కన్పిస్తున్నాడు. ఎలాంటి వాడు ఎలా మారిపోయాడు! చదువు లేదు. కిందా మీదా పడి మెట్రిక్ చదివాడు. చదువుతోన్నంత కాలం అల్లరి చిల్లరిగా తిరిగేవాడు. అలాంటి మనిషి పెద్ద ఉద్యోగస్తుడవడం అవకాశమో, అదృష్టమో!

ప్రకాశం చీకటి పడ్డతర్వాత కాలనీకి వెళ్ళాడు. రాఘవ భోజనం చెయ్యకుండా ప్రకాశం కోసం కూర్చున్నాడు. ప్రకాశం ఇంటర్వ్యూ విశేషాలు చెప్పాడు. కానీ తను శేషావతారాన్ని కల్సుకున్న విషయం చెప్పలేదు.

* * *

ప్రకాశానికి చలమయ్య చాలా పెద్దగా ఆహ్వానం పలికాడు. చుట్టుపక్కల స్నేహితులకు పరిచయం చేశాడు. ఫ్యాక్టరీ అంతా చూపించాడు. రకరకాల పిండి వంటలతో భోజనం ఏర్పాటు చేశాడు. చలమయ్య భార్య కామేశ్వరి దగ్గరుండి ప్రకాశానికి వడ్డన చేసింది. భోజనం అయిన తర్వాత తన పడగదిలోకి తీసుకు వెళ్ళి, పడత మంచంమీద కూర్చోబెట్టాడు.

"నీ గురించి మా సెక్షన్ మేనేజర్‌తో మాట్లాడతాను"

"నాకు ఉద్యోగం దొరికేటట్టు చూడు చలమయ్యా నీ మేలు మర్చిపోను"

"అదేంటి ప్రకాశం మనం ఒకూరి వాళ్ళం" చలమయ్య అన్నాడు.

చలమయ్య తనకి తెలుసున్న పెద్దవాళ్ల జాబితా, తన చుట్టాల్లో పెద్ద పొజిషన్‌లో వున్నవాళ్ళ సంగతీ చెప్పి అఖర్న అన్నాడు.

"నాకో ఉపకారం కావాల మరి"

"ఉపకారమా!?"

"అవును ప్రకాశం! నీకు తెలుసుగా. మనకి చదువంటే మంట. ఎపవ చదువు ఎక్కువాపలేదు. ఇప్పుడు క్వాలిఫికేషన్ పెంచుకోకపోతే ప్రమోషన్ ఇవ్వనంటున్నాడు జనరల్ మేనేజర్"

"ఏ నైట్ కాలేజీలోనైనా చేరి చదవ వల్సింది"

"ఐదేళ్ళ క్రితమే జేరాను"

"అయితే ఇంకేం"

"ఏదు. ఆ చదువు మనకి ఎక్కాలా. పిల్లలూ, పెళ్లాం, ఉద్యోగం వీటితో చదువెక్కడ ఎక్కుతుంది, పోయింది"

"అరె..."

"రెండుసార్లు తప్పారు అన్నయ్య గారూ!" అంటూ కామేశ్వరి పాలు తీసుకు వచ్చి టేబిల్‌మీద పెట్టి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

"నే చెప్పేదేమిటంటే ఆ పరీక్షలు మనవల్ల జరిగేపని కాదు. వచ్చే నెల్లో పరీక్షలు వున్నాయి. నా తరఫున నీబోటిగాడు వెళ్ళి రాసి పారేస్తే నేను పాస్ అవడం ఖాయం"

ప్రకాశం ఆశ్చర్యంగా వింటున్నాడు.

"నాకీ పని చేసి పెట్టు. ఇక్కడనేను నీకు ఉద్యోగం వేయిస్తాను. ఏమంటావ్ ?"

"అదికాదు చలమయ్యా! దీనివల్ల చాలా ప్రమాదం. నీకు డిగ్రీ మాట అటుంచి నా డిగ్రీ పోవచ్చు. నన్ను ఉద్యోగానికి అనర్హుణ్ని చేసి పారేస్తారు.




పైగా నీ హాల్‌టికెట్ ఎవరు చెక్ చేసినా..." ప్రకాశం ఆగిపోయాడు.

"సింగినాదం కాదూ. ఎవడు మనల్ని పట్టుకునేది. గుమాస్తాలకీ, ఇన్‌విజిలేటర్లకీ డబ్బు పారేసాను. ఆ సంగతంతా నేను చూసుకుంటాను"

"ఆలోచించి చెప్తాను" అన్నాడు ప్రకాశం.

"నీ ఇష్టం. నాకు నిద్ర వస్తోంది" అంటూ చలమయ్య నిద్రలో పడ్డాడు. ప్రకాశానికి ఏం పాలుపోవడం లేదు. చలమయ్య తనకో అగ్నిపరీక్ష పెడుతున్నాడు. ఊహూ. శేషావతారం గనుక తనకి ఉద్యోగం ఇస్తే ఈ అగ్నిపరీక్ష తనకి తప్పుతుంది. ప్రకాశం దేవుడికి వేయిదండాలు పెట్టుకున్నాడు.

మర్నాడు ప్రకాశం నిద్రలేచి ఐ.డి.పి.ఎల్.కి బయలుదేరుతూంటే చలమయ్య ఇంటికి అతని అన్నగారు భూషణం వచ్చాడు. ఆయన సూట్ బూటులో వున్నాడు. చలమయ్య అన్నగారికి ప్రకాశాన్ని పరిచయం చేసి-

"మన కరణంగారి అబ్బాయి అన్నయ్యా! పాపం ఉద్యోగం లేదు"

"అలానా?" అన్నాడు మామూలుగా భూషణం.

"యం.ఏ. పాసయ్యాను"

"అందరూ ఉద్యోగాలంటే ఎలా పంతులూ, పల్లెటూర్లలో స్వంత పరిశ్రమలు పెట్టుకోవాలి ఏ బ్యాంక్ లోనో తీసుకుని. వెధవ ఉద్యోగాల వల్ల మిగిలేదేం వుండదు" అంటూ చాలా సేపు శ్రీరంగ నీతులు చెప్పాడు- కడుపు నిండిన కామందు పాలేరుకి నచ్చచెప్పినట్టు.

"అన్నయ్యా! ప్రకాశానికి మనం సాయపడాలి" అన్నాడు చలమయ్య జాలిగా.

"చూద్దాంలే" అన్నాడు భూషణం.

ప్రకాశం ఆడిటోరియం బస్‌స్టాప్‌కి వెళ్ళాడు.

* * *

ప్రకాశం రెండు రోజులు ఉద్యోగం గురించిన ఉత్తరం వస్తుందని ఎదురు చూశాడు. ఆ విషయం పదిసార్లు రాఘవ తోనూ, లలితమ్మ పిన్నిగారితోనూ అన్నాడు.

"వస్తుంది లేరా! అలా బెంగ పడి పోతున్నావు దేనికి?" అంది లలితమ్మ గారు. రాఘవ తెలుసున్న మిత్రుల ద్వారా ఉద్యోగం గురించి వాకబు చేస్తానన్నాడు. శారద కూడా ప్రకాశానికి ధైర్యం చెప్పింది. ఆ మధ్యాహ్నం ప్రకాశానికి పోస్ట్‌లో ఉత్తరం వచ్చింది. ప్రకాశం ఆత్రుతగా ఉత్తరం విప్పాడు. అది శేఖరం రాసింది.

ఒరేయ్ ప్రకాశం నువ్వు రోజూ హిందు పేపరు తెరిచి ఎడ్వర్ టయిజ్‌మెంట్లు చూస్తున్నావనే అనుకుంటున్నాను. ఎప్లయి చేసావ్! ఇంటర్వ్యూకి వెడతావ్.ఇదో ప్రాసెస్. ఇంటర్వ్యూలు వచ్చినంత తేలిగ్గా ఉద్యోగాలు దొరికితే మన దేశం అన్నపూర్ణా, అక్షయపాత్రా అయిపోయేది. అబ్బీ-ఇది పోటీలోకంరా! అమితంగా కుళ్ళూ, మితంగా మంచితనం రాజ్యం చేస్తున్నాయిరా యిక్కడ. ప్రకాశం! చేసిన పాపం చెపే పోతుందంటారు. అవకాశవాదులు పదే పదే వాడే మాట ఇది! పూట పూటకీ పొట్టలు కొట్టడం అలవాటయిన వాళ్ళూ, రోజు రోజుకూ గోతులు తవ్వే వాళ్ళూ పెర



గడం కోసం తప్ప మరెందుకూ ఉపయోగపడదీ సూక్తి. నేను నీకు చేసిన దగా విపులంగా రాస్తున్నాను. నువ్వు నన్ను తిట్టుకుంటావు శపిస్తావు. అయినా చెప్తున్నాను ఎందుకంటే రేపు నాలా మరొకడు నిన్ను దగా చేయకుండా జాగ్రత్త పడతావని!

నువ్వూ, నేనూ స్నేహితులం. మనిద్దరికీ ఉద్యోగం అవసరమే! కానీ నేవెళ్ళే ఇంటర్వ్యూకే నువ్వూ వచ్చావని తెలిసి నేను కంగారు పడ్డాను.

అక్కడ వున్నది ఒకే పోస్ట్. నీలాంటి వాణ్ణి కాదని నాలాంటి వాడికి అది దక్కడం అసంభవం. శేషాచలంగారి లాంటి నిప్పులాంటి మనిషితో తెలివి తేటలకు చేయూతనిచ్చే ఆ జమాజెట్టీ ముందు నేను నెగ్గుకు రావడం జరగనిపని.

నీకు గుర్తుండి వుండాలి. నువ్వు శేషాచలంగారితో మీ ఇద్దరిదీ ఒకే కులం అని చెప్పడం!

ప్రకాశం! నిజం చెప్తున్నాను. మాదీ శేషాచలంగారిదీ ఒకే కులం. అప్పుడు నీకు చెప్పలేదు.

అయినా శేషాచలంగారు కులాలకు ఓటు వేయని అహంకారి. కులం పేర కట్టుకునే గూడులో ఇమడలేని స్వేచ్ఛా జీవి.

అందుకే ఆయన నిన్ను సెలెక్ట్ చేయకుండావుండడం కోసం నీచేత అవాకులూ, చవాకులూ పేలించాను. నా ప్లాను సక్సెస్ అయింది.

ఇవన్నీ నేను చేయడం, చేయించడం తప్పేకాదు... ఘోరం. ఘోరం కాదు... నేరం. కానీ మనదేశంలో అందరూ చేసే ఏ పనైనా ఆచారం అవుతుంది. పైగా మనకి తప్పులు సమర్థించుకుందుకు సవాలక్ష సిద్ధాంతాలూ, ప్రమాణాలు, పురాణాలూ వున్నాయి. నన్ను క్షమించు.

నీ
శేఖరం.

ప్రకాశానికి తలలో ఎవరో రాక్షసులు దూరి హాహాకారాలు చేస్తున్నట్టనిపించింది. మనసునిండా బ్రహ్మ జెముడు ముళ్ళు గుచ్చుతున్నట్టుంది.

శేఖరం చాలా దగా చేశాడు. దగా కూడా కాదు పొట్టమీద కొట్టాడు. అదీ కాదేమో... తనే కంగారుపడి అవకాశం జారవిడుచుకున్నాడు.

సాయంత్రం రాఘవ వచ్చి ప్రకాశంతో ఉద్యోగం గురించి చెప్పాడు.

"పోనీ నాకు అదృష్టం లేదు"

"మరేం బాధపడకు. ఈ మహానగరంలో నీకు ఉద్యోగం దొరక్కపోదు" అంటూ ఓదార్చాడు.

ప్రకాశం ఆ మర్నాడు పద్మావతికి ఉత్తరం రాశాడు. ఎందుకో అతనికి నిజం దాచబుద్ధికాలేదు. జరిగింది జరిగినట్టు రాశాడు. సాయంత్రం వరకూ చిక్కడపల్లిలో తిరిగాడు. లైబ్రరీకి వెళ్ళాడు. పేపరు క్షుణ్ణంగా చదివాడు. వాచీ చూసుకుంటే ఏడుగంటలు చూపించింది.

త్వరత్వరగా నడుస్తూంటే కాళ్ళకి సన్నపాటి గొలుసు తగిలింది. ప్రకాశం వంగి గొలుసు చేతిలోకి తీసుకున్నాడు. బంగారపు చెయిన్. ఏం చేయాలో తోచలేదు. వచ్చిన దారినే కొంతదూరం నడిచాడు వెనక్కి.

ప్రకాశానికి ఎదురుగా ఇద్దరు అమ్మాయిలు నేలని చూసుకుంటూ, ఇసుకను కాళ్ళతో తుడుస్తూ వస్తూ కనిపించారు. వాళ్ళేదో వెదుకుతున్నారు.

"ఏమిటండీ వెదుకుతున్నారు?"

ఆఅమ్మాయి లిద్దరూ తలెత్తి ప్రకాశాన్ని నిరాశ పడ్డ కళ్ళతో చూశారు. అందులో ఓ అమ్మాయి అంది-

"నా ఫ్రెండ్ గొలుసు పారేసుకుంది. వెదుకుతున్నాం."

"ఏం గొలుసు"

"బంగారంది."

"ఎలా వుంటుంది?"

"ఎలావుంటుందంటే పురుకుసడిజైన్. కింద లాకెట్. స్వస్తిక్ మార్కు... మధ్యలో కె అనే అక్షరం" అంది.

ప్రకాశం జేబులోంచి గొలుసు తీసి, "ఇదా" అన్నాడు. "ఓ" అంది ఓ అమ్మాయి సంతోషంతో వెంటనే.

"కాంతి! లక్కే ఇది నీ గొలుసే" అంటూ ప్రకాశం చేతిలో గొలుసు లాక్కుని కాంతి చేతిలో పెట్టింది.

"థాంక్స్" అంది కాంతి.

"నో మెన్షన్" అన్నాడు ప్రకాశం.

"మీరేం చేస్తుంటారు"

"ఏం చెయ్యను."

"అంటే... ?" అంది అర్థంకాక అవతలి అమ్మాయి.

"ఉద్యోగం కోసం హైదరాబాద్ వచ్చాను."

"అలానా!"

"కాంతీ వెడదామా" అంది.

"సరూ! ఆయన్ని మనింటికి ఆహ్వానిద్దాం" అంది కాంతి నెమ్మదిగా. సరోజ వెంటనే అంది "సార్ మా కాంతి వాళ్ళిల్లు ఆంజనేయ స్వామి గుడి దగ్గర శ్రీనివాసరావు గారంటే ఎవరైనా చెప్తారు. రేపు మీరు రాగలరా?"

"దేనికి?" అన్నాడు.

"దేనికంటే..." ఆగిపోయింది

"వద్దులెండి. ఇంతకీ మీరు చదువుకుంటున్నారా?"

"అవునండీ! కాంతి, నేనూ ఫైనలియర్ బి. యస్సీ చదువుతున్నాం."

"గుడ్‌నైట్, నే వెడతానండీ" అంటూ ప్రకాశం వెనక్కి తిరిగాడు.

ప్రకాశం నడుస్తూనే వున్నాడు. చేతికి చిక్కిన ఉద్యోగాన్ని తను పోగొట్టుకున్నాడు. చేతికి చిక్కిన బంగారం కూడా తను జారవిడిచాడు. మొదటి దాంట్లో అవివేకం వుంటే, రెండో సంఘటనలో విజ్ఞత ప్రదర్శించాడు. గొలుసు కాజెయ్యాలనే ఊహ తనకి తట్టకపోవడం అదృష్టం. దిగజారితే ఏముంది? మెట్లు దిగడం చాలా తేలిక!

ప్రకాశం ఆలోచిస్తూంటే చటుక్కున చలమయ్య వెనకే వచ్చి ఒక్క గుద్దు గుద్ది—

"ఏరా రాలేదేం నిన్న" అన్నాడు.

ప్రకాశం అదిరిపోయి చలమయ్యని చూసి "క్షమించరా, మర్చిపోయాను" అనేశాడు

"భలేవాడివే, నీ గురించి అన్నయ్య మళ్ళీ అడిగాడు"

ప్రకాశం మాట్లాడలేదు.

"ఏమిటి ఆలోచిస్తుండా"

ప్రకాశం చేతిదాకా వచ్చిన ఉద్యోగం ఎలా చెయ్యిజారి పోయిందీ చెప్పాడు.

"ఓస్ దీనికేనా నేనున్నానుగా.."

"వద్దురా"

"అలా అన్నావంటే గుద్దుతా. నీకేం భయంలేదు. నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు. పద."

"ఎక్కడికి ?"

"హైదరాబాద్ వచ్చి గుడికి వెళ్ళావా ఇంతవరకూ" అన్నాడు ఎంతో ప్రేమగా.

"ఏ గుడి. వెంకటేశ్వరస్వామి గుడా"

"వాడి బాబు గుడి. ఇదిగో పద" అంటూ బార్‌లోకి లాక్కెళ్ళాడు. లోపలికి తీసుకువెళ్ళి మసక చీకట్లో సోఫాలోకి తోశాడు. ప్రకాశాన్ని మాట్లాడనివ్వకుండా సిగరెట్ నోటిలోకి తోసి ఆపైన ఒట్లూ, ప్రమాణాలూ పెట్టుకుని "కొంచెం తాగు, ఔషధం" అంటూ విస్కీ ప్రకాశం చేత పట్టించి, రెండు గ్లాసులు తను తాగి తాగుడు మైకంలో లోకాన్ని ప్రజల్ని, సినిమాల్ని, ఉద్యోగాల్ని పెళ్ళాల్ని తిట్టి పారేశాడు.

ప్రకాశానికి తిమ్మిరిగావుంది. లోకం







లోకంలా కాకుండా రంగుల వలలా కనపడసాగింది. మనుషులు మనుషుల్లా కాకుండా మంత్రగాళ్లలా కన్పించసాగారు.

చలమయ్య ప్రకాశాన్ని టాక్సీలో పడేసి బి. హెచ్. ఇ. ఎల్ టౌన్‌షిప్‌కు లాక్కుపోయాడు.

*   *   *

ప్రకాశానికి రాత్రి మత్తు చాలా మటుకు ఉదయానికి దిగినా ఆ అనుభవం మాత్రం ఆలోచనలనుంచి పోలేదు.

తను కిందటి రోజు సాయంకాలం నుంచి మూడు గంటలసేపు ఎత్తిన అపతారం, దాని తాలూకు ప్రభావం తల్చుకుందుకే భయంగా వుంది.

చలమయ్య తనని కొత్త లోకాలకు తీసుకు వెళ్ళినట్టు ఉదయం కూడా చెప్తూనే వున్నాడు.

"నీచేత ఊ అన్పించడానికి, మాట

తీసుకుందుకు రెండొందలు ఖర్చయింది.. అబ్బో సినియర్‌గాడిలా లాగించేశావ్ ?"

ప్రకాశం తను చలమయ్యని గ్రాడ్యుయేట్ ఎలా చెయ్యాలో, అందుకు తను ఏ స్థితికి దిగజారవల్సి వస్తుందో ఆలోచిస్తున్నాడు.

చలమయ్య ఉద్యోగం ఇప్పిస్తానన్నంత మాత్రాన పెద్ద నేరం చేయాల్సిందేనా? ఇది హత్య కాక పోవచ్చు. దొంగతనం, దోపిడీ కాకపోవచ్చు. కాని అంతకు మించిన నేరం. సాంఘిక పతనానికి తనూ ఓ సమిధ సమర్పించడం. ఊహూఁ. తల్లి ఇచ్చిన గాజులు గుర్తొచ్చాయి. అమ్మేసి చలమయ్య రుణం తీర్చుకోవాలి.

ప్రకాశం జనాన్ని తప్పించుకుని బస్ ఎక్కాడు. కోటీలో దిగాడు. అక్కడి నుంచి సుల్తాను బజార్‌లోకి వెళ్ళాడు. రాయల్‌టాకీస్ సినిమా వదిలినట్టున్నారు. జనం విపరీతంగా రోడ్‌మీద పడ్డారు.

ప్రకాశం జనాన్ని తప్పించుకుంటూంటే ఎదురుగా వస్తూ కాంతి కన్పించింది. చాలా దగ్గరగా వచ్చేసింది.

"మీరు..."

"అవును. నేనే."

"మా ఇంటికి రానేలేదు."

"క్షమించాలి. మర్చిపోయాను."

కాంతి ప్రకాశాన్ని చూసి, "ఇప్పుడైనా నన్ను గుర్తు పట్టారా?" అంది.

"బలేవారేనే."

"నేనూ,సరూ రోజూ మీగురించే అనుకుంటాం. రండి కాఫీ తాగుదాం."

ప్రకాశం నడుస్తున్నాడు.

"ఇటూ "

ప్రకాశానికి జేబులో వున్న ఐదు రూపాయల కాగితం గుర్తొచ్చింది. అది తప్పితే తల్లి ఇచ్చిన బంగారమే దాకి!

ఇద్దరూ కామత్ హోటల్లోకి వెళ్ళారు. కాంతే టిఫిన్‌కి ఆర్డరిచ్చింది.

"ఏదైనా జాబ్ దొరికిందా?"

"లేదు."

"ఏం చదివారు."

"యం.ఏ. పొలిటిక్స్."

కాంతి నవ్వుతూ అంది "పొలిటిక్స్ చదివారుకదా! ఇంకా ఉద్యోగం దొరక్కపోవడం ఏమిటి?"

"పొలిటిక్స్ చదవకపోయినా తెలుస్తున్నాయి."

కాంతి తన తండ్రి గురించి, ఆయన చేసే ఉద్యోగం గురించి, ఆయన పలుకుబడి గురించి చెప్పింది. తన సరదాలూ, కోరికలూ, ఉద్దేశాలూ చెప్పింది. ప్రకాశాన్ని అతని కుటుంబం గురించి ఏవేవో అడిగింది.

"మరి వెడదామా?" అంది ఆఖర్న.

"మీ ఇష్టం" అన్నాడు.

"మీరోసారి మా ఇంటికి రండి. అది కూడా నా కిష్టం" అంది నవ్వుతూ కాంతి.

"మీవాళ్ళు ఏమన్నా అనుకుంటే..."

"పబ్లిక్ గార్డెన్‌కి ఆదివారం రండి. అక్కడ కలుద్దాం."

కాంతి వెళ్ళిపోయింది.

ప్రకాశానికి ఎంత వద్దనుకున్నా కాంతి తండ్రి శ్రీనివాసరావు, ఆయన హోదా, పలుకుబడీ గుర్తుకు వస్తున్నాయి. కాంతి తనకు సహాయం చేస్తుందా? కాంతి చెబితే శ్రీనివాసరావుగారు వింటారా?

ప్రకాశం ఐ.డి.పి.ఎల్ కాలనీకి వెళ్ళే సరికి రాత్రి 7గంటలు దాటింది. ఇంటికి




వెడితే ఇల్లు తలుపువేసి వుంది. మార్కెట్ సెంటర్‌కి వెళ్ళాడు. క్లబ్‌లోంచి సంగీతం విన్పిస్తోంది.

ప్రకాశం క్లబ్ దగ్గరకు వెళ్ళాడు. ఆఫీసర్స్ క్లబ్. స్త్రీలంతా నవనాగరికంగా అలంకరించుకుని భర్తల పక్కన కూర్చున్నారు. ప్రకాశం వాళ్ళని పరకాయించి చూశాడు. ఒక్కళ్లూ పరాకుగా లేరు. ముందు వరసలో కూర్చున్న మరో ఆవిడ చీర గురించి, సిగముడి గురించి మాట్లాడు కుంటున్నారు. ఆ జనంలో రాఘవ తేలికగానే కనుపించాడు.

"రెండు రోజులబట్టీ ఎక్కడికి పోయావ్?" అన్నాడు రాఘవ నెమ్మదిగా.

ప్రకాశం ఏదో చెప్పాడు.

"కూర్చో"

"వద్దు. నే ఇంటికి వెడతా"

రాఘవ తాళం ఇచ్చాడు.

ప్రకాశం ఇంటికి వెళ్ళాడు. డ్రాయింగ్ రూమ్‌లో రేడియో పక్కన తనకి వచ్చిన ఉత్తరాలు కన్పించాయి.

ఒకటి తండ్రి రాసింది, మరొకటి పద్మావతి కాశీ నుంచి రాసింది. ప్రకాశం ఉత్తరం విప్పాడు.

ప్రకాశం-

నీ ఉత్తరం—నువ్వు బోల్తా పడ్డ కథ విన్నాను. మంచివాడు ధోకా పడ్డం జరిగి నంతకాలం మన పురోభివృద్ధి 'ఎక్కడ వేసిన గొంగళి...' లాగే వుంటుంది. నీ ఉత్తరంలో నిరాశ ఛాయలు. ఎందుకంత భయం? ఉద్యోగం దొరక్కుండానే ఓల్డైరయిపోయినట్టు ఫీలవుతున్నావా? కట్నం యివ్వలేక పెళ్ళికి వెనకబడ్డ ఆడపిల్లా, ఉద్యోగం దొరక్క రాటే అయిపోయిన ఓ తెలివిపరుడు వీళ్ళిద్దరూ మన సంఘానికి బొమ్మా బొరుసూ... కాశీ వచ్చాను. ఇక్కడ విశ్వనాథుడు ఒక్కడే వున్నాడు. ఆయన పవిత్రత సంగతి వదిలేస్తే... మిగతాదంతా అపవిత్రతే! ఈ ఊళ్ళో భక్తులున్నారు. భక్తిమీద విరక్తిపుట్టిస్తారు వాళ్లు..హిందూ మతానికి, హిందువులకూ ఆదర్శంగా వుండవల్సిన వారణాసిలో ఆమాటకి అర్థం తెలిసిన వాళ్లూ, భాష్యం చెప్పగలిగే వాళ్ళు కొద్దిమంది.

అయితే కాశీ మనం చూసిన కాశీ కాదు, వెనకటి కాశీ అనుకుంటే కొంచెం శాంతి... జవాబు రాయి.

—పద్మావతి

ప్రకాశం తండ్రి రాసిన ఉత్తరం విప్పాడు.

* * *

"నేను బి. హెచ్. ఇ. ఎల్. కాలనీకి వెళ్ళొస్తాను" అన్నాడు రాఘవతో ప్రకాశం.

రాఘవ అనుమానంగా అడిగాడు- "ఏమిటీ రామచంద్రపురం తరచు వెడుతున్నావ్? అక్కడెవరైనా స్నేహితులు వున్నారా..."

ప్రకాశం చలమయ్య గురించీ, అతని అన్నగారి గురించీ చెప్పి, "వాళ్లు సహాయం చేస్తామన్నారు."

రాఘవ అటూఇటూ చూసి అన్నాడు- "నీకేదైనా డబ్బు అవసరం అయితే నన్నడుగు. మొహమాట పడకు"

"నా దగ్గర వుందిలే" అన్నాడు చిన్నగా అబద్ధం ఆడుతూ ప్రకాశం.

రాఘవ ఫ్యాక్టరీకి వెళ్లిపోయాడు. ఆ రోజు శారద ఆఫీసుకు సెలవ. ఇంట్లోనే వుంది. లలితమ్మగారూ, రాణీ కలిసి సికింద్రాబాద్ ప్రయాణం అయ్యారు.



"ఏమిటే రేపు పెళ్లి చూపులకు సన్నాహాలా?" అన్నాడు నవ్వుతూ ప్రకాశం.

"కాదన్నయ్యా! అమ్మని డాక్టర్ దగ్గరకు తీసుకువెడుతున్నాను"

"మీకు కంపెనీ డాక్టర్ వుండడా?"

"వెయ్యి రూపాయల లోపు జీతగాళ్లందరూ 'ఇ.యస్.ఐ.'కు పోవల్సిందే! కానీ అక్కడ జబ్బులు నయంకావు.." రాణి అంది.

లలితమ్మగారూ, రాణీ బస్‌స్టాప్‌కి వెళ్ళారు.

ప్రకాశం శారద గురించి ఆలోచిస్తున్నాడు. శారదకు వివాహం కాలేదు. తన కన్నా పెద్దది. ముప్ఫైఐదేళ్లు వుండవచ్చు శారద పెళ్లికి ఎందుకు దూరమయ్యిందో తెలియదు. పద్మావతి రాసిన ఉత్తరం అతనికి పదే పదే గుర్తుకు వస్తోంది. పెళ్ళి కాని ఆడది, ఉద్యోగం లేని మొగాడు వీళ్లిద్దరూ సంఘం మాట ఏమో

గానీ ఇంటికి పెద్ద ప్రశ్నార్థకాలు!! ఉద్యోగానికి క్వాలిఫికేషన్స్ కావాలి! మరి పెళ్లికి! ఆడపిల్ల పెళ్లికావాలంటే అందం కావాలి, చదువు కావాలి.. కట్నం డబ్బు కావాలి. భర్త అలిగినప్పుడల్లా పుట్టింటి నుంచి డబ్బు తేగల నేర్పు కావాలి.

అయితే శారదకు ఎందుకు పెళ్లి కాలేదు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అంది శారద అటు వచ్చి.

''ఏం లేదు.''

"నీ గురించా?"

"కాదు మన గురించి"

''అంటే?" అంది.

''నాకు ఉద్యోగం రాకపోవటానికి కారణాలు వెదుకుతున్నాను. కానీ నీ లాంటి ఆడపిల్ల ఏ శాపం వల్ల అవివాహితగా మిగిలిపోయిందా అని...".

''చాలా పాత కథ. ఈ నాటికీ కొత్తగా కన్పిస్తోందా నా బ్రతుకు నీకు?" అంది.

"రాణికి పెళ్లి వారొస్తున్నారనగానే నాకు ఏదో చెప్పలేని బాధ పుట్టుకొచ్చింది అక్కయ్యా''

"నువ్వు కొత్తగా చూస్తున్నావ్ కాబట్టి ఈ బాధ.. పదేళ్ల క్రితమే నేను రాయినయ్యాను."

''ఎందుకు..''

"ప్రకాశం! ఇది ఎవరో వేసిన శిక్ష కాదు. ఎవరి పొరబాటూ కాదు. అలాగే నా తప్పూ లేదు. కానీ జరిగింది."

"నీ అంతట నువ్వయినా....." ఆగి పోయాయి మాటలు.

"నన్ను పెళ్లాడమని ఏ ఆడపిల్ల ఎవర్ని మొహం మీద అడుగుతుంది.. ప్రేమ...ఈ రోజు ఎంతో మంది మనుషుల్ని కలుపుతోన్న ప్రేమ కూడా నా కర్థం కాకుండానే మిగిలిపోయింది."

ప్రకాశం వింతగా చూశాడు శారదని.

''చదువు, ఉద్యోగం ఆ తపనతో ఇరవై ఏళ్లు, మరో ఐదేళ్ళు ఉద్యోగం మీద భయంతో గడిచింది. అమ్మా, అన్నయ్యా సంబంధాలు తెచ్చేవారు.నాకుగా నేనెవర్నీ కాదనలేదు. కొన్ని కట్నం దగ్గరా - కొన్నినా పెర్సనాలిటీదగ్గరాబెడిసి కొట్టేవి. అన్నయ్యకి పదివేల ఖర్చు. అన్నయ్య సంపాదన నాకు తెలుసు. పదివేలు కూడ బెట్టడం నా వల్ల కాదు. అన్నయ్య వల్ల అసలే కాదు. అలా మరో ఐదేళ్లు. నా కన్నా చిన్న వాళ్లయిన స్నేహితుల పెళ్ళిళ్ళు చూశాను. నా కన్నా అంద వికారులు ప్రేమలో పడ్డం చూశాను. నా పెళ్ళి గురించి అమ్మా, అన్నయ్యా దెబ్బలాడుకునేవారు. అది ఉక్రోషంతో జరిగే పోటాట. అపజయం అంగీకరించు కోలేక రేగే అలజడి. నాకే నా మీద అసహ్యం వేసింది. అందుకే యం.ఏ. చదువుతానని సాగర్ వెళ్ళాను. ఇంట్లో ఎవరికీ ఇష్టం లేదు. బలవంతంగా పంపారు.చాలా ఈజీగా చదువు సాగింది. క్లాస్ వచ్చింది. మొగుడుగాణ్ని సంపాదించుకోలేకపోయినా, చదువు మాత్రం నాకు చక్కగా వచ్చి నాకు కొంత ఉపశమనం కలగజేసింది. ఉద్యోగంలో పైకి వచ్చాను. మరో ఐదేళ్ళు. ఇప్పుడు నా నెత్తి మీద బాధ్యతలు, బరువులు ఎన్నో ఉన్నాయి. ఆఫీసుకు వెడితే నేను సర్వం మర్చిపోతాను. ఆఫీసు ఫైలు ఇంటికి తెచ్చుకుని అదో నవలలా, ప్రేమ

లేఖలా చదువుకుంటాను. నాకు పెళ్ళి కాలేదనీ, నేను ఏదో పోగొట్టుకున్నాననీ ఈ వేళ అనుకోవడం లేదు. ఆ స్టేజి దాటాను ప్రకాశం..."

ప్రకాశానికి శారద నిర్వికారంగా కనబడింది. తన ఊహ తప్పయినందుకు అతను కించపడ్డాడు. దుఃఖానికి అతీతంగా, బాధకు అందకుండా కూడా మనిషి జీవించగలడని శారద నిరూపిస్తోన్నట్టు అన్పించింది.

ఇంతలో లోపలినుంచి విశాల వదిన వచ్చింది. విశాల, శారదా పేకాటలో పడ్డారు.

ప్రకాశం బట్టలు వేసుకుని బయలుదేరాడు. "రేపు పొద్దున్నకి వచ్చెయ్" అంది శారద. ప్రకాశం బాలానగర్‌లో నిలబడి రామచంద్రపురం బస్ కోసం ఎదురు చూసి అది వచ్చిన తర్వాత బస్ ఎక్కితే అదికాస్తా కూకట్‌పల్లిలో ఇంజన్ ట్రబుల్ వల్ల చెడిపోయింది. ప్రకాశం అక్కడవున్న చిన్న హోటల్‌లో కాఫీ తాగి మరో బస్ వచ్చిన తర్వాత బయలుదేరాడు. చలమయ్య ఇంటికి వెళ్ళే సరికి ఇంటికి తాళం కనబడింది. పక్కింట్లో వాకబు చేశాడు. చలమయ్య తండ్రికి సీరియస్‌గా వుండటంతో అతగాడు ఊరికి వెళ్ళినట్టు చెప్పారు. ప్రకాశానికి నీర్సం వచ్చింది. చలమయ్య ద్వారా తల్లి బంగారు గాజులు అమ్మవచ్చని అనుకున్నాడు. రెండోది చలమయ్యకు తన నిర్ణయం చెప్పి క్షమించమని వేడుకుందామనీ అనుకున్నాడు. కానీ జరిగింది వేరు.

ప్రకాశానికి ఏం చెయ్యాలో తోచలేదు. కాసేపు అక్కడి టౌన్‌షిప్‌లో తిరిగాడు. తిరిగిన చోటనే ప్రదక్షిణలు చేశాడు. ఆఖరికి కోటీ బస్ ఎక్కి వెనక్కి బయలుదేరాడు. బాలానగర్‌లో దిగాలనిపించలేదు. కాంతి గుర్తొచ్చి టికెట్ కోటీ వరకూ తీసుకున్నాడు. కోటీలోదిగి నవజీవన్‌కాలేజీ దాకా వెళ్లాడు. నాలుగు గంటల ప్రాంతంలో కాంతి బయటకు వచ్చి ప్రకాశాన్ని చూసి నవ్వి చెయ్యి ఊపి-

"చాలా రోజుల తర్వాత కన్పించారు. పార్కుకి రాలేదేం?" అంది.

"మర్చిపోయాను"

"మీకు మతి మరుపు ఎక్కువా!"

"అనుకుంటాను."

"రండి మంచి కాఫీ తాగుదాం"

కాంతి, ప్రకాశంకలిసి తాజ్‌కి వెళ్లారు. ఆ తర్వాత ఇద్దరూ సుల్తాన్ బజార్‌లో తిరిగారు. కాంతి సరోజ ఇంటి కంటూ ప్రకాశాన్ని నింబోలిఅడ్డ అంతా తిప్పింది.

"ఎక్కడా, ఇల్లు మర్చిపోయారా?" అన్నాడు అనుమానంగా.

"అవునండీ,ఏదో అడ్రసు చెప్పింది."

"మీకు ఆలస్యం అవుతుందేమో"

"ఫరవాలేదు. మా ఇంట్లో ఏం అనరు."

ప్రకాశం ఏం మాట్లాడలేదు.

"మీ గురించి మానాన్నతో చెప్పాను. ఇంటికి తీసుకు రమ్మన్నారు."

"అలానా" అన్నాడు ప్రకాశం.

"ఇప్పుడు వెడదామా ఇంటికి. నాన్న ఇంటిలో వుంటారు."

ప్రకాశానికి కాదనాలనిపించలేదు. కాంతి ఆటో పిల్చింది. ఆటోలో ప్రకాశం సర్దుకు కూర్చున్నాడు.

కాంతి ఆటోని ఓ హోటల్ ముందు ఆపించి డబ్బులిచ్చి ఆటోని పంపించింది.

"ఇక్కడి నుంచి నడిచి వెడదాం





ఇంటికి. సరేనా" అంది నవ్వుతూ.

"మీకు చాలా ట్రిక్కు తెలుసే" అన్నాడు.

"లేకపోతే ఈ కాలం ఆడపిల్లలు బతకలేరు. పేరెంట్స్ గొడవ, అందులో పెళ్ళికాని నా లాంటి వాళ్ళకి పేరెంట్స్ పెట్టే పరీక్షలు మీరు ఊహించలేరు."

"మీ మంచికే కదా వాళ్లు చెప్పేది"

"ఏం మంచండి. రోజూ ఒకటే మాట జాగ్రత జాగ్రత అని. ఏం జాగ్రత్తో చంపేస్తారు." నవ్వేసింది కాంతి.

ఇంతలో ఇల్లు వచ్చింది. ప్రకాశాన్ని డ్రాయింగ్ రూమ్‌లో కూర్చోబెట్టి కాంతి లోపలికి ఒక్క ఉరుకు వురికింది.

పది నిమిషాల్లో కాఫీ కలిపి తీసుకు వచ్చింది. ప్రకాశం కాఫీ తాగి ఆ డ్రాయింగ్ రూమ్‌ని పరకాయించి చూశాడు. అన్నీ ఖరీదయిన వస్తువులు... అలంకారాలు కూడా ఆడంబరంగా కన్పించాయి. టీపాయ్ మీద రెండు న్యూస్ పేపర్లు, లైఫ్ మేగ్‌జైన్, ఓ అల్మారా నిండా సాహిత్యం.

ఇంతలో లోపలినుంచి కాంతీ, కాంతి వెనక కాంతి తండ్రీ వచ్చారు. ఆయన సోఫాలో కూర్చున్నాడు.

"మా నాన్నగారు" అని ప్రకాశానికి చెప్పి కాంతి తండ్రితో చెప్పింది.

"నే చెప్పాను కదా నాన్నగారూ, ఈయనే ప్రకాశం గారని."

"అలానా."

ప్రకాశం "నమస్కారమండీ" అన్నాడు. కాంతి తండ్రి విష్ చేశాడు మౌనంగా.

"యం.ఏ. చేసార్ట. పాపం ఉద్యోగం లేదు" అంది జాలిగా కాంతి.

"ఓహో" అన్నాడు ఆయన.

రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఆయనే తిరిగి ప్రకాశం ఊరూ, తండ్రి పేరు అడిగాడు.

ప్రకాశం చెప్పాడు.

"ఈ ఊళ్ళో ఎక్కడ వుండడం."

"మా కజిన్ ఐ. డి. పి. యల్.లో వుంటున్నాడు"

"ఏం చేస్తూంటారు?"

"ఎకౌంటెంట్"

ఆయన కాసేపు మాట్లాడలేదు. ఆ తర్వాత కాంతిని చూసి "నువ్వు లోపలికి వెళ్ళి చదువుకో" అని ఇంగ్లీషులో చెప్పాడు. కాంతి తల వంచుకుని లోపలికి వెళ్ళింది.

"ఉద్యోగాలు దొరకడం కష్టంగా వుందీ రోజుల్లో. నిరుత్సాహ పడకు. దొరుకుతుంది."

ప్రకాశానికి ఆ హితబోధ ఎందుకో అర్థం కాలేదు.

"రెండేళ్ళయ్యిందండీ యం. ఏ. పాసయి."

"ఎవర్నయినా ఎరుగున్న వాళ్ళ ద్వారా ప్రయత్నించు."

ప్రకాశం చొరవగా అన్నాడు. "మీ నేమ్ ప్లేట్ బయట చూశాను. మీరు శ్రీనివాసా అండ్ కంపెనీలో సెక్రటరీ అని తెలిసింది. క్షమించండి, నేను ఇలా అడుగుతున్నందుకు. నేను స్ట్రేంజర్‌ని మీకు. నాకేమైనా సహాయం చెయ్యగలరా శ్రీనివాసరావుగారూ"

"అబ్బే చాలా కష్టం. అయినా ట్రై చేసాను."

"మళ్ళీ కలవమంటారా"

"వద్దు. అడ్రసు యిచ్చి వెళ్ళు"

ప్రకాశం కాగితంమీద తన అడ్రసు, వివరాలూ రాసిచ్చి కుర్చీలోంచి లేచి, "వెడతానండీ" అన్నాడు.

శ్రీనివాసరావు క్షణం ఆగి, "కాంతి చిన్నపిల్ల. నీకేదో ప్రామిస్ చేసి వుంటుంది. డోంట్ డిసప్పాయింట్ యువర్ సెల్ఫ్" అన్నాడు.

"నో మేటర్"

"అది ఎప్పుడైనా కన్నడి చిన్నతనం కొద్దీ ఏమైనా చెప్పినా నమ్మకు. అది కైండ్ హార్టెడ్"

"కైండ్ హార్టెడ్ వాళ్ళని నమ్మకూడదాండీ" ప్రకాశం ఆశ్చర్యంగా అన్నాడు నవ్వుని బలవంతంగా ఆపుకుని."

"ఐ మీన్"

"మీ అభిప్రాయం అర్థమయ్యింది లెండి. వెడతాను"

ప్రకాశం వీధిలోకి వచ్చాడు. కాంతి అనే స్నేహితురాలు తనకి తండ్రి ద్వారా ఉపకారం చెయ్యాలని ప్రయత్నించడం, అందుకు ఆ స్నేహితురాలి తండ్రి ఉద్యోగం యిప్పించడం మాట అటుంచి పరిచయాన్నే త్రుంచి వేయాలని అనుకోవడం... ప్రకాశానికి శ్రీనివాసరావుని ఆఫీసరుగా కాకుండా పెళ్ళికాని ఆడపిల్ల తండ్రిగా అర్థం చేసుకోవడం తెలిసింది. సర్వసుఖాలూ అనుభవిస్తూ ఉపకారం అనే మాటకు ఆమడ దూరం పోయే ఓ పెద్దమనిషి పరిచయం మాత్రం మిగుల్చుకుని ప్రకాశం రోడ్డెక్కాడు.

నరాసరి ఆబిడ్స్‌లో ఓ బంగారు నగల దుకాణానికి వెళ్లాడు. జేబులోంచి గాజులు తీసి,

"కొనగలరా?" అన్నాడు.

షాపు యజమాని ప్రకాశాన్ని దొంగలా చూశాడు. ప్రకాశానికి కోపం ఆగింది కాదు. ఇంగ్లీషులో గడగడా వాగేశాడు. తన అడ్రసూ, చదువూ వివరించాడు. షాపు వాడికి ప్రకాశం ఇంగ్లీషు అర్థం కాలేదు. కానీ సరుకుమీద అప నమ్మకం మాత్రం పోయింది!

గాజులు తూకం వేసి, కిందా మీదా పెట్టి వేయి రూపాయలు యిచ్చాడు.

ప్రకాశం డబ్బులు తీసుకుని కాలనీకి వచ్చేసరికి డ్రాయింగ్ రూమ్‌లో చాలా మంది జనం కన్పించారు. రాఘవ ప్రకాశాన్ని అక్కడి వాళ్ళందరికీ పరిచయం చేశాడు. వాళ్ళల్లో శ్రీకాంత్ అనే వ్యక్తిని పెళ్ళి కొడుకుగా, మరొకాయన్ని పెళ్లి కొడుకు అన్నగారు షణ్ముఖరావుగా, ఆ తరువాత ఆయన భార్య రమణినీ పరిచయం చేశాడు.

"సమయానికి వచ్చావు. రాణికి పెళ్ళి చూపులు. ఈవేళ మంచి రోజంటే ఏర్పాటు చేశాను."

ఓ అరగంట పెళ్లిచూపుల కార్యక్రమం అయ్యింది.

రాణిని శల్య పరీక్ష చేసి దానికి పెళ్లి చూపులు అనే చక్కని పేరు పెట్టి కాఫీ టిఫిన్లు తిని నవ్వులు జోకులూ వేసుకుంటూ శ్రీకాంత్ అన్నగారు షణ్ముఖరావు, అతని భార్య రమణీ, రాఘవ, విశాలా, ప్రకాశం డాబా మీద కూర్చున్నారు.

"మా రాణి నచ్చినట్టేనా?" రాఘవ అడిగాడు. షణ్ముఖరావు భార్య రమణి మొహం చూశాడు.

"అన్నయ్యగారూ! మా మరిది ఉద్యోగం చేసుకునే అమ్మాయినే పెళ్లి




చేసుకుంటాట్ట. పెళ్లిచూపులకు మీ మాట కాదనలేక వచ్చాం."

"మా రాణి బి.ఏ. పాసయ్యింది. ఇక ఉద్యోగం దొరక్కుండా పోతుందంటారా?"

"అదికాదండీ. ఆ ఉద్యోగం వేయించేయండి. మాకేం అభ్యంతరం లేదు.



అసలు కట్నాలు తీసుకునే అలవాటు మా ఇంట్లో లేదు. మీ ముద్దుకొద్దీ ఖర్చు చేసుకోవచ్చు."

విశాలా, రాఘవా మొహా మొహాలు చూసుకున్నారు.

ప్రకాశం నెమ్మదిగా అన్నాడు. "కట్నం వద్దన్నారు, సంతోషం. కానీ మీరు అడుగుతోన్నది ఉద్యోగం. నేను యం.ఏ. పాసయ్యాను. రెండేళ్ళయ్యింది. మరో ఏడాది ఇలా వున్నానంటే పిచ్చి పట్టడం ఖాయం. రాణికి ఉద్యోగం సంపా

దించడం అంటే ఎంత కష్టమో మీకు వేరే చెప్పనవసరం లేదనుకుంటాం."

"నిజమే అనుకోండి."

"పూర్వం కట్నం సమస్య, ఇప్పుడు ఉద్యోగ సమస్య, ఆడపిల్ల పెళ్లిపాలిట శాపం అవడం- కష్టమే!" అన్నాడు ప్రకాశం.

"ఒకళ్ళ సంపాదన మీద సంసారాలు నడవడం లేదు చూడండి. ఏ కోరికలూ తీరవు. భర్త సంపాదనతో సంసారం యీదల్లేక భార్య బాధపడ్డం, గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునే భార్యని చూసి భర్త ఏవగించుకోవడం ఏం బావుంటుంది చెప్పండి. స్వంత ఇల్లు, బ్యాంక్ బేలన్స్, పుట్టబోయే పిల్లలకు మంచి చదువు ఇవన్నీ ఒక్కరి సంపాదనతో సాధ్యం కావు."

"మీరు మగపిల్లవాడి తరపున మాట్లాడుతున్నారు. ఇంట్లో ఆడపిల్లకి చదువు ఖర్చు, పెళ్లి ఖర్చు' మగవాళ్ళకి చదువూ, పీట్లతోనే ఇంటి యజమాని కుదేలవుతున్నాడు. మగపిల్లవాడి ఉద్యోగం కోసం నానాగడ్డీ కరిసే గానీ దొరకడం లేదు. ఏ మహానుభావుడో కనికరిసే ఇంటిలో ఓ మనిషికి రికమెండేషన్ చేయడమే కష్టం. రాణికి చదువు చెప్పించాం. పెళ్లి అయిందని దాన్ని వదిలేయం. మేమూ ఉద్యోగం కోసం ప్రయత్నిస్తాం" విశాల అంది.

షణ్ముఖరావు మళ్లీ భార్య వైపు చూశాడు.

"మీరు మరోలా అనుకోవద్దు. రాణి ఉద్యోగస్తురాలయితే మాకు అభ్యంతరం లేదు."

రాఘవ అయోమయంగా ప్రకాశం వైపు చూశాడు.

"వెడదామా" అంది భర్తని చూసి రమణి.

షణ్ముఖరావు లేదాడు. రమణి వెనకే మెట్లు దిగాడు.

రమణి విశాల దగ్గరగా వచ్చి "మీరే విషయం పది పదిహేను రోజుల్లో తెలియజేయండి. సరేనా" అంటూ పమిట జారిపోతూంటే జాకెట్లోకి అంచుల్ని దోపి, భర్తని అడుగుజాడల్లో నడిపించుకుంటూ వెళ్లిపోయింది.

ప్రకాశం, రాఘవ, విశాల మెట్లమీద చతికిల బడ్డారు. పై మెట్టుమీద లలితమ్మగారు కూర్చుంది.

''బాగా తెలివి మీరిపోయారు" అంటోంది విశాల.

"పై చేయి వాళ్ళది'' రాఘవ అన్నాడు.

"వాళ్ల నని తప్పేముంది. ఆ పెళ్లికొడుకుని అనాలి. ఆదర్శవాది. కట్నం వద్దుట. కానీ ఉద్యోగస్తురాలయి మాత్రం వుండాలిట."

"నిజమే మరిటి! కట్నం అయితే ఏ అప్పోచేసి ఇవ్వచ్చు. ఉద్యోగం ఆర్డర్స్ వేయించి ఆడపిల్లకి కన్నెధార పోయడం ఎవరితరం" విశాల అంది.

"అన్నయ్యా. ఇది ఆదర్శం కాదు. బందిపోటుతనం. మహా అయితే ఆడపిల్లకి పదివేలు ఇస్తాం. అది పెళ్ళిఅయిన వెంటనే ఖర్చవుతుంది. ఉద్యోగం అయితే కనీసం ముప్ఫై ఏళ్ళ సర్వీసు. అందులో ప్రమోషన్స్. ఏడాదికి ఆరువేల చొప్పున లెఖ్ఖవెయ్యి. లక్షా ఏభై వేలు మించే వస్తుంది."

"ఏం చేద్దాం" రాఘవ ఆలోచనగా




అన్నాడు.

"ఏమిటిరా ఆలోచన.వచ్చి భోజనాలు చెయ్యండి'' అంటూ కేకవేసింది లలితమ్మగారు.

అందరూ లోపలికి వెళ్ళారు. భోజనాల దగ్గర విశాల రాణిని అడిగింది. "ఎలా వున్నాడమ్మా పెళ్ళికొడుకు'' అని

"ఓ తలా, రెండు కళ్లూ, ముక్కూ, కన్పించాయి. నోరు కన్పడలేదు'' నవ్వేసింది రాణి.

"మీ చెల్లాయికి నోరులేని మొగుడంటే ఇష్టం కాబోలు.''

"మా పిల్లలకి నోళ్ళు లేకపోబట్టే నువ్వు మా ఇంటి కోడలి గా రాణిస్తున్నావు" లలితమ్మగారు నవ్వుతూ అంది.

"రాణికి తన నోరేకాదు అన్నల నోరు కూడా వుంది.'' విశాల అంది.

"అసలు సంగతి చెప్పండి. వాళ్ళకేం చెబుదాం."

"పోనివ్వరా. ఇది మనసు కుదిరే సంబంధం కాదు'' లలితమ్మగారు అంది.

"అలా అంటే ఎలా అమ్మా'' శారద చటుక్కున అంది.

"మరెలాగే! దానికి వున్న పళంగా ఎవడిస్తాడు ఉద్యోగం!''

"దాని పెళ్ళికి మనం ఎంత ఖర్చు పెడదాం అనుకుంటున్నాం.''

"అంతా కలిసి పదివేలు వుంది.''

"పదివేలా'' ఆలోచిస్తూ అంది శారద

"అవును.''

"నాదో ఐడియా'' అంది శారద.

"ఏమిటి'' అన్నాడు రాఘవ.

"చాలా రహస్యం. నువ్వూ, వదినా, ప్రకాశం, నాకూ తప్ప మరెవరికీ తెలియ కూడదు.''

"ఏమిటే?"

''అమ్మా! నువ్వూ, రాణీ వెళ్ళి దాబా మీద పడుకోండి జల్దీ'' అంది శారద.

''నా పెళ్ళి సంగతి నేను వినద్దా?''

''ఆఖర్న నీ అభిప్రాయం అడుగుతాంలే.''

రాత్రి పది అయింది. శారద ఊపిరి బిగపట్టి తన మనసులో ఊహకి రూప కల్పన చేసి మాటల్లో చెప్పింది.

రాఘవ తెల్ల మొహం వేశాడు. విశాల ఆశ్చర్య పోయింది. ప్రకాశం అయితే నోరు తెరుచుకుని వుండిపోయాడు.

"మరో దారి లేదన్నయ్యా. ఈ మహా ప్రపంచంలో సహజంగా బ్రతికే మార్గాలు లేవు. విషానికి కూడా విరుగుడు వుందంటారు. కాలం గాయాల్ని మాపడం కాదు. చాలా అపకారాల్ని తీర్చి దిద్దచ్చు. రాణికి పెళ్ళి కొడుకు నచ్చాడు. పైగా అతగాడు దానికి ఇదివరలోనే తెల్సు. వాళ్ల సమస్యల్ని వాళ్ళు సరి చేసుకుంటారు. ఆ షణ్ముఖరావు, అతని భార్య రమణి నోరు నొక్కాలంటే ఇదొక్కటే మార్గం."

"ఏదైనా గొడవలయితే..''

''చూద్దాం అప్పుడు.''

ప్రకాశానికి శారద ఆలోచనా సరళికి ఆశ్చర్యాన్నే కాదు, భయాన్ని కలగజేసింది. ఎంత తెగింపు, ఎంత ధైర్యం?

నిజానికి ఈ ధైర్యం వెనక, ఈ ఆలోచన వెనక ఎన్ని సంవత్సరాల మథన పాటు వుందో?

ప్రకాశం టేబిల్ లైటు వెలిగించి సీతకి ఉత్తరం రాశాడు. అప్పటికే సీత దగ్గర నుంచి ఉత్తరం వచ్చి వారం అయ్యింది..

ఉద్యోగ ప్రయత్నాల గురించీ, హైదరాబాద్ గురించీ వివరంగా వ్రాయమంది.



"నేను హైదరాబాద్ అనే మహా సముద్రం మధ్యన చిక్కుకుని వున్నాను. ఎప్పుడు గట్టున పడతానో తెలియడం లేదు. నీ గురించి అయినా ఉద్యోగస్తుణ్ణి అవ్వాలని వుంది" అని రాశాడు.

అలానే పద్మావతికి శారదని పరిచయం చేస్తూ శారద తీసుకున్న...కాదు శారద రాణి అనే చెల్లెలు పెళ్లి విషయంలో యిచ్చిన తీర్పు గొప్పగా వర్ణిస్తూ రాశాడు.

ఉత్తరం ముగించి కవరులో పెట్టి అంటించిన తర్వాత కాంతి అనే స్నేహితురాలి గురించీ, కాంతి తండ్రి శ్రీనివాసరావు గురించీ పద్మావతికి రాయలేదే అని నొచ్చుకున్నాడు. ప్రకాశం లైటార్పి పడుకోబోతుంటే పక్కగది లోంచి రాఘవ అన్నాడు-

"మధ్యాహ్నం చలమయ్య నీ గురించి

ఫోన్ చేశాడురా రేపు బి. హెచ్.ఇ.ఎల్ రమ్మన్నాడు.''

ప్రకాశం "అలానా!" అన్నాడు.

బాల్కనీలో పడుకున్న లలితమ్మ గారు అంది-

"నాన్న దగ్గర నుంచి ఉత్తరం రాలేదేంరా ప్రకాశం'' అని.

''ఆయనకు ఉత్తరాలు రాయడం అంటే బద్ధకిం అమ్మకి ఉత్తరం రాయడం రాదు.''

"ఏమిటోరా! ఆ ఊళ్ళో వున్నప్పుడే బావుండేది. ఇలా అందరూ తలో దారి అయ్యాం. ఏం ఉద్యోగాలో, చదువులో''

"అమ్మా! జీవిత పర్యావలోకన ఆపు. అంటూ డాబా మీద నుంచి రాణి ఒక్క కేక పెట్టింది.

"బుద్ధి లేనిదానా పడుకోవే. అంత చేటు నోరు పనికి రాదే'' క్రింద నుంచి అంది లలితమ్మ గారు. ప్రకాశం నవ్వుకున్నాడు.




ప్రకాశం గాజులమ్మగా వచ్చిన డబ్బు లోంచి సగం తల్లిపేర యం. వో చేశాడు. రెండొందలు జేబులో పెట్టుకుని బి. హెచ్. ఇ. ఎల్. బయలుదేరాడు. చలమయ్య ప్రకాశాన్ని అంత దూరం నుంచే చూసి-

"నీ కోసమే చూస్తుండా" అంటూ ఎదురు వెళ్లాడు.

ప్రకాశం మాట్లాడలేదు.

"మొన్నో రోజు వచ్చావంటగా."

"అవును."

"మా నాన్న జబ్బు పడ్డాడు. ఇప్పుడు కొంచెం పర్వాలేదు" అంటూ ప్రకాశానికి ఊపిరి సలపకుండా మాట్లాడసాగాడు. ప్రకాశం చలమయ్య హడావిడి చూస్తూనే వున్నాడు. చలమయ్య భార్య కామేశ్వరి హడావిడిగా టేబిల్ మీద స్టీల్ ప్లేట్లు పెట్టి వడ్డన ప్రారంభించింది.

"నేను భోజనం చేసి వచ్చాను."

"ఇది సెకండ్ రౌండు. కానియ్ నీ కోసం ఫారిన్ స్టఫ్ తెప్పించాను." అంటూ తలుపు దగ్గరగా వేసి అల్మైరా తెరిచి విస్కీ బాటిల్ తీశాడు.

"ఇదేమిటి?"

"అన్నం తినేముందు మీరు పరిషం పడతారు కదా...అదే..."

"నాకు వద్దు చలమయ్యా!"

"కళ్ళు పోతాయి"

"నిజంగా"

"కొద్దిగా తీసుకోవోయ్!" అంటూ రెండు గ్లాసుల్లో పోశాడు. బలవంతంగా ఓ గ్లాసు ప్రకాశం మూతి దగ్గరగా తెచ్చి "కానియ్, గుటకేయ్. చుక్క దిగిందంటే పానకాల స్వామివయిపోయి 'ఇంకా రానీ' అంటావ్"

ప్రకాశం విస్కీ సిప్ చేయక తప్ప లేదు. చేదు. చాలా చేదు. జీవిత సత్యాలు ద్రవ రూపం అయిన భావన.

"చలమయ్యా ! నన్ను క్షమించు" అంటూ ప్రకాశం జేబులోంచి రెండొందలు తీసి బల్లమీద పెట్టి "మొన్న నువ్వు ఖర్చు పెట్టింది" అన్నాడు.

చలమయ్య నిశ్చేష్టుడయ్యాడు. క్షణం తర్వాత ఓ గుక్కపట్టించి ప్రకాశాన్ని చూసి,

"ఎందుకిస్తుండావు?" అన్నాడు.

"మన ఖర్చు"

చలమయ్య నవ్వేసి "నా స్నేహితుడికోసం ఖర్చు చేశానోయ్!అన్యాయం. నరకం పోతాను ఈ డబ్బు తీసుకుంటే"

ప్రకాశం తల దిమ్మెక్కుతూంటే అన్నాడు-

"చలమయ్యా ! నేను బాగా ఆలోచించాను. నీ కోసం పరీక్షలు నేను రాయలేను. నా మనసు ఒప్పుకోవడంలేదు"

చలమయ్యకి ఎవరో గ్లాసు నెత్తిన పగల గొట్టినట్టయ్యింది.

"మనసే కదా. పరీక్ష మనసుతో రాయొద్దు చేత్తో రాసేయ్"

"అదికాదు చలమయ్యా...!"

"ప్రకాశం! నువ్వు ఎర్రిబాగులోడివి. నీకోసం మా ఆఫీసర్ని నేనూ, అన్నయ్యా కాళ్ళు పట్టుకున్నాం. సరే అనిపించాం. ఈ నెలలో నీకు ఉద్యోగం దొరుకుతుంది. నేను ఇక్కడ కిందా మీదా పడి నీ కోసం ట్రై చేస్తూంటే నువ్వేమో..."

"అది కాదు చలమయ్యా"

"ఏది కాదు పంతులూ! యం. ఏ. చదివావు. అన్నీ తెలుసు. ఎవరు న్యాయంగా వుంటున్నారంటావు? ఎవరు నిజాయితీగా బతుకుతుంటారంటావు? చూపించు. ప్యూన్ దగ్గర నుంచీ ఐ. యే. ఎస్. గాడి వరకూ లంచం పట్టని నా కొడుకులేడు. డబ్బు... డబ్బు కోసం ఏ ఎదవ పనైనా చేసి ఈ రోజుల్లో పైకి రావాలా? ఉద్యోగం లేకపోతే, నీ జేబులో పైసా లేకపోతే ఈ పట్నంలో నీకూ, ఓ ముష్టోడికీ తేడాలేదు. తెలివైన వాడివని నిన్నందరూ మెచ్చుకోవడం కావాలో, గొప్పోడివని నీకు దణ్ణం పెట్టడం కావాలో తేల్చుకో. అన్నం లేకుండా, పెళ్లాం లేకుండా, డబ్బులేకుండా బతికేసేది సన్నాసులొక్కళ్ళే. ఆళ్ళల్లో నువ్వు కలుస్తానంటే ఆ విషయం వేరు. మరో రెండేళ్ళు పోతే నువ్వు గవర్నమెంటు ఉద్యోగానికి పనికిరాకుండా ముదిరిపోతావు. మీ నాన్నా అమ్మనీ ఎవరు చూస్తారు? 'నేను న్యాయంగా బతుకుతుండా. ఆ న్యాయం విని మీరు సంతోషించండంటే' మీ అమ్మా నాన్నే నీ మొహం మీద వూస్తారు.ఆలోచించుకో పంతులూ! ఈ రోజుల్లో చుట్టరికం, స్నేహం, ప్రేమ అన్నీ కూడా డబ్బుతో దొరుకుతాయి. బికారోడికి లోకం ఓ పెద్ద జైలు. అన్నం పెట్టని ఆదర్శం నమ్ముకుని పిచ్చాడివయిపోవాలనుకుంటున్నావా?"

"నువ్వు చెప్పింది నిజమే చలమయ్యా! కానీ ఆత్మద్రోహం..."

"ఆత్మేటి పంతులూ! ఈ యుగంలో ఆత్మ లేనివాళ్లే అదృష్టవంతులు. ఇదేం అమెరికా, జపాన్, జర్మనీ అనుకుంటున్నావా? తెలివైన వాడివని గవర్నమెంటు దండలేసి ఆహ్వానించడానికి? మనదేశంలో రోజూ చస్తున్న వాళ్లని చూడు. ఏదో బాధతోనో, అసంతృప్తితోనే చస్తోన్న వాళ్లే ఎక్కువ- అయుర్దాయం లేకకాదు."

ప్రకాశం మాట్లాడలేదు.

చలమయ్య ఖాళీ అయిన తన గ్లాసు నింపుకుని ప్రకాశం గ్లాసు నింపి, "స్నేహితుడివి కదా అని నిన్ను సాయం చేయమన్నా. నా చేతనైన సాయం నీకు




చేస్తానన్నాను" చలమయ్య లేచి తన హాల్ టికెట్, ఎగ్జామినేషన్స్ వివరాలూ తెచ్చి–

"ఇదిగో అక్కడ గుమస్తాగాడికి లంచం పెట్టి అన్నీ ఎరేంజ్ చేశాను. స్టూడియోకి పద...నీకో ఫొటో తీయించి ఇక్కడ అంటించాలి."

ప్రకాశం ఏమీ మాట్లాడ లేదు.

చలమయ్య మళ్లీ అన్నాడు–

"ఇంకా అనుమానంగా వుందా? మందు తాగితే అజ్ఞానం పోయి జ్ఞానం రావాలే. సత్యం కళ్ల ముందు కనపడాలే" అన్నాడు.

ప్రకాశం మళ్లీ మాట్లాడలేదు.

చలమయ్య తిరిగి అన్నాడు.

"ఇంటికి ఉత్తరం రాసి పారేయ్... ఉద్యోగం దొరికిందని మీ నాన్నగారు సంబర పడతారు.'' అలా చలమయ్య ప్రకాశానికి ఓ గంట బ్రెయిన్ వాష్ చేసి అన్నగారి దగ్గరకు తీసుకు వెళ్లి ఆయన చేత మరో గంట నీతులు చెప్పించి ఆపైన స్టూడియోలో ఫొటో తీయించి గానీ ప్రకాశాన్ని వదలలేదు.

"సరిగ్గాసోమవారంపరీక్షలు మొదలు. ఆదివారం ఇక్కడికి వచ్చేయి. ఆదివారం ఇక్కడే వుందువు గానిఏమంటా?''

"సరే...'' ప్రకాశం లేచాడు.

చలమయ్య టేబిల్ మీద డబ్బు తీసి–

"ఈ డబ్బెందుకు ఉంచు'' అంటూ ప్రకాశం జేబులో బలవంతంగాకుక్కాడు.

ప్రకాశం ఆర్.టి.సి. బస్ ఎక్కాడు. బస్‌లో కూర్చున్న ప్రకాశానికి ప్రకృతి అంతా మత్తెక్కినట్టుగా వుంది.

తను దిగజారాడు. ఓడి పోయాడు. దానికి తిరుగు లేదు. పతనం ప్రారంభం అవకూడదు. పాతాళానికి పోయే వరకూ మరో దారి వుండదు.

ప్రకాశం జేబురుమాలు తీసుకుంటూంటే చలమయ్య కుక్కిన డబ్బు చేతికి వచ్చింది.నాలుగు వంద కాగితాలు. మళ్లీ చూశాడు. తను రెండు వందలు యిచ్చాడు. అవి... అవి నాలుగు వందలయ్యాయి. అంటే...? చలమయ్య తనకి బయానా ఇచ్చాడా? తెలివి తేటలు అమ్ముతోన్నందుకు ఖరీదు కట్టాడా?

ప్రకాశానికి బాలానగర్‌లో దిగ బుద్ధి కాలేదు. కండక్టర్‌కి తిరిగి టికెట్ డబ్బులిచ్చి కోటీ వరకూ టికెట్ తీసుకున్నాడు. కోటీలో దిగాడు. వేలకు వేల దీపాలతో జనసంతోషంతో, హోరుతో ఆ పరిసరాలన్నీ సంతలా కన్పించాయి. ఎవరి మొహంలో చూసినా సంతోషం. ఏదో హడావిడి. వెదుకులాట. తనలాంటి మనిషి సమస్యలతో తలబ్రద్దలు కొట్టుకుంటూన్న వ్యక్తి కన బడతాడేమోనని వెదక సాగాడు ప్రకాశం.

బట్టలు మాసి, గెడ్డాలు పెరిగి, సంస్కార విహీనులుగా వున్నవాళ్ళ మొహాల్లో దీనత్వం కన్పిస్తోంది.

వాళ్లెందుకు అలావున్నారు? ఏ బాధ వాళ్లని అలా ఆరగ దీసి అరిగిన గంధం చెక్కల్లా రోడ్డు పక్కన నిలబెట్టింది.?

పై తరగతివాడు తన సమాన ఫాయిదా వాడితో తప్ప సంతోషాల్నీ, బాధల్నీ పంచుకోడు! క్రిందవాడి బాధనీ సంతోషాన్ని గుర్తించడానికి కూడా ఇష్టపడడు!

క్రింద వాడికి అదేం లేదు. కాలే కడుపు, నిస్పృహ మూటగట్టుకున్న

కళ్లు, వణికే పెదాలూ వాటికి తోడు కావాలి! మాట వినబడితే చాలు, ఓదార్పు వంటికి తగిలితే చాలు ఇట్టే వాళ్ళు ప్రతి ధ్వనిస్తారు!

ప్రకాశానికి ఏం తోచలేదు. చల మయ్య ఆసమయంలో అర్జునుడికి బోధ చేసిన శ్రీకృష్ణుడిలా గుర్తొకొచ్చాడు.




రాఘువ, ప్రకాశం కలసి హెచ్.యం.టి రోడ్డున నడపడం మొదలు పెట్టారు.

"ఏం చేయను చెప్పు. శారద బ్రతుకు అలా అయిపోయింది. ఇక రాణి. దానికైనా వయసులో పెళ్ళి చేయకపోతే..."

"నిజమే అనుకో" అన్నాడు ప్రకాశం.

"డబ్బులేక దాని పెళ్లి వాయిదాపడి, ఆఖరికి అది అవివాహితగా వుండిపోవల్సి వచ్చింది. ఇప్పుడు ఎవరం కూడా దానికి సంతోషాన్ని ఇవ్వలేం సానుభూతి తప్పించి. రాణి ఎదిగింది. పది వేలు చేతిలో పెట్టుకుంటే దీనికెన్ని అడ్డంకులో చూడు."

"ఇంతమంది జనం వున్నారు. చదువు కుంటున్నారు. ఆదర్శాల గురించి తెగ వాగుతారు. కానీ ఆచరణలో పెట్టేవాళ్ళు కన్పించడం లేదో, మనకి కన్పడ్డం లేదో తెలియడం లేదు" అన్నాడు ప్రకాశం ఆలోచనగా.

"అందుకేరా ఈ తెగింపు. చట్టం, మనుషులూ ముందుకు వచ్చి ఆడవాళ్ళ బ్రతుకులు బాగుచేయనప్పుడు ఈ దొడ్డి దారి తప్పదు"

ఇద్దరూ చింతల్ దాటారు. ఓ బడ్డీ కొట్టులో టీ తాగి వెనక్కి తిరిగారు.

"పిన్నికి తెలియదా?"

"తెలియదు."

"రాణికి"

"తెలుసు. అది ఏమనలేదు."

"రేపు గొడవయితే."

"చూద్దాం కానీయ్ అంది."

ప్రకాశం మాట్లాడలేదు.

ఇద్దరూ కాలనీకి వచ్చేసరికి ఇంటి ముందు ఆటో ఆగివుంది. ఆటో బయట ఎవరో కుర్రాడు నిలబడి వున్నాడు.

"ఎవరు కావాలి?"

"రామచంద్రపురంనుంచి వచ్చానండి! చలమయ్యగారికి యాక్సిడెంట్ అయింది. ప్రకాశంగారిని తీసుకు రమ్మని పంపించారండి."

రాఘవ ప్రకాశం మొహం చూశాడు.

"నే వెళ్ళి వస్తాను."

"సరే."

ప్రకాశం ఆటో ఎక్కాడు.

ప్రకాశం బి.హెచ్.ఇ.ఎల్ కాలనీకి వెళ్ళేసరికి చలమయ్య లుంగీ కట్టుకుని గుమ్మంలో నుంచున్నాడు.

"ఇదేమిటి?" ఆశ్చర్యంగా చూశాడు ప్రకాశం.

"లోపలికి రా చెప్తా"అంటూ చలమయ్య ప్రకాశాన్ని ఇంట్లోకి తీసుకువెళ్లి మడత మంచం మీద కూలేశాడు.

"ఏమయింది?"

"బ్రదర్! ఎల్లుండి నుంచే పరీక్షలు.




నువ్వు క్రైమ్‌కి రావేమోనని చిన్న డ్రామా ఆడా."

"బావుంది."

"నువ్వు ఏదేదో ఆలోచించి బుర్ర పాడుచేసుకుంటావ్. ఇక్కడయితే నీ మెదడు ఫ్లవర్‌వాజ్‌లో పువ్వులా వుంటుంది." చలమయ్య ప్రకాశాన్ని చూస్తూ అన్నాడు.

"నా మీద నమ్మకం లేదన్నమాట" ప్రకాశం చిన్నగా అన్నాడు.

"నమ్మకం కాదోయ్ సింగినాదం. అక్కడయితే ఒక్కడివీ బోర్‌కొట్టచ్చు. మా కాలనీ అంటే చిన్న నగరం."

ప్రకాశం మాట్లాడలేదు.

"లే భోజనం చేద్దాం."

"నే చేసివచ్చా."

"భోజనం అంటే తిండి కాదోయ్.. ఔపోసన."

చలమయ్య భార్య కోడికూర, కోడి గుడ్లూ, సాంబారూ తెచ్చి టేబిల్ మీద పెట్టింది.



"నీవు తింటావా."

"అలవాటు లేదు."

"పోనీ స్వీట్లు తిను."

"ఆకలిలేదు చలమయ్యా."

"ఇదిగో ఈ గది నీది. ఈ వారం ఇక్కడే వుండువుగాని. నేనూ సెలవు పెట్టాను. మరి లీవులో వుండాలిగా" అంటూ చలమయ్య ప్రకాశానికి తను చేసిన ఏర్పాట్లూ అవీ చెప్పడం మొదలు పెట్టాడు.

* * *

ప్రకాశం నిజాం కాలేజీ లోపలికి వెళ్లాడు. అంతకు పూర్వమే అతను ఉస్మానియా యూనివర్సిటీ చూశాడు. హైదరాబాద్ వచ్చిన తర్వాత తిరిగి యూనివర్సిటీకి వెళ్లాలనుకున్నాడు. తన క్లాస్ మేట్స్ కనిపిస్తే కలిసి మాట్లాడవచ్చు అనుకున్నాడు. చలమయ్య పరిచయంతో అవన్నీ ఆపుకోవల్సి వచ్చింది.

ఇప్పుడు బి. ఏ. విద్యార్థిగా దొంగ దుస్తులు ధరించి, దొంగ రూపుతో పరీక్షలు రాస్తున్నాడు. ఇన్‌విజిలేటర్స్‌లో తెలుసున్న వాళ్ళకనిపిస్తే...? ప్రకాశానికి గుండె దడ దడ లాడింది.

చలమయ్య ఆఖరిసారి ధైర్యం చెప్పి బలిపీఠం దగ్గరకు పశువును తోలుకు వెళ్లినట్టు ప్రకాశాన్ని కాలేజీ లోపలికి నెట్టాడు.

మధ్యాహ్నం ఇంటర్‌వెల్ సమయం లోనూ, సాయంత్రం పరీక్ష టైం అయిన తర్వాతా ఎదురు వెళ్లి చలమయ్య ప్రకాశాన్ని అభినందించాడు.

ఆ సాయంత్రం ప్రకాశం వద్దన్నా వినకుండా చలమయ్య అతన్ని కాలనీకి లాక్కుపోయాడు.

పరీక్షలు వారం పది రోజుల్లో పూర్తి అవుతాయి. చలమయ్యకి గడిచిన ఒక్కొక్క రోజూ ఒక్కొక్క మధుర ఘట్టంగా వుంటోంది.

గుడ్డి వాడికి కళ్ళొచ్చి లోకం చూస్తే కల్గే ఆనందం. కుంటి వాడు కాళ్ళొచ్చి మెట్లెక్కి పైకి చేరిన పరవశత్వం కల్గాయి.

ఆ రోజు ఆఖరి పరీక్ష.

చలమయ్య అన్నాడు–

"నువ్వు మీ కాలనీకి వెళ్ళాలేమో! నీ గురించి మీ బ్రదర్ ఫోన్ చేశాడు. రెండు రోజులాగి ఆదివారం మా కాలనీకి వచ్చెయ్" అన్నాడు.

"సరే" అన్నాడు ప్రకాశం.

ప్రకాశానికి పగటంటలపడంతో మనసు తేలిక పడింది. గబ గబా కాలేజీలోంచి బయటకు వస్తూంటే సరోజ ఎదురయ్యింది.

"నమస్కారం సార్!" అంది

ప్రకాశం షాక్ తిన్నట్టు "మీరూ..." అన్నాడు.

"కాంతి స్నేహితురాల్నంటే మర్చిపోయారా అప్పుడే!"

"కొంచెం" అన్నాడు.

"లీలగా గుర్తున్నానన్న మాట."

"ఇదేమిటి కాలేజీ నుంచి వస్తున్నారు. ఉద్యోగం దొరికిందా?" అంది ఆతురతగా.

"లేదండీ! ఆ వేటలోనే వున్నాను. వెళ్లొస్తాను."

"అది సరే కాంతి గురించి మీకు తెలియదా?"

"ఏమయింది?" అన్నాడు కంగారుగా.

సరోజ నవ్వేసి అంది "అంటే ఈ మధ్య మీరు కాంతిని కలిశారా అని నా భావన"




"లేదు."

"మీ గురించే చెప్తుంది కాంతి ఎప్పుడూ. వాళ్లింటికి వెళ్ళారటగా"

"ఆ..."

"ఏం చేస్తాం? శ్రీనివాసరావుగారు ఆదోరకం. బ్యాంక్ ఎకౌంటూ, హోదా, స్వంత ఇల్లూ, కారూ యివేవీ లేని వాళ్లని ఆయన మనుషులుగా లెఖ్ఖ వేయడు."

"వడ్డించిన విస్తరి లాంటిది కాబోసు ఆయన జీవితం."

"అదిగో కాంతి" అంది సరోజ దూరాన్నుంచి వస్తోన్న కాంతిని చూసి.

కాంతి ప్రకాశాన్ని చూసి "నమస్కారం" అంది, ప్రకాశం ప్రతి నమస్కారం చేశాడు.

"చాలా రోజులయింది మనం కలిసి. పదండి కాఫీ తాగుదాం సిద్ధార్థకి పోయి"

"అంత దూరం ఎందుకే."

"మా అన్నయ్య పెళ్లే...మీకు పార్టీ"

ముగ్గురూ సిద్ధార్థ హోటల్‌కి వెళ్లి స్పెషల్ కౌంటర్‌లో కూర్చున్నారు. అర్ధ చంద్రాకారంగా నూతిలో కూర్చున్నట్టుంది.

కాఫీ టిఫిన్‌లు అయిన తర్వాత సరోజ హేండ్ బేగ్ తెరిచి రెండు శుభ రేఖలున్న కవర్లు తీసి ప్రకాశానికొకటి కాంతి కొకటి ఇచ్చింది.

ప్రకాశం కవరు విప్పి చూశాడు. అతని ఆశ్చర్యం చూసి "ఏమిటలా గుడ్లు తేలేస్తున్నారు."

"ఈ పెళ్లి కొడుకు..."

"మా చిన్నన్నయ్యండీ."

"సరే ఈ పెళ్లి కూతురు రాణి ఎవరో తెలుసా?"

"మా వదినవుతుంది."

"నాకు కజిన్ అవుతుందండీ"

"ఓ..." ఆశ్చర్యంగా ఓ కూత పెట్టింది సరోజ.

"మీకూ తెలుసుండాలే."

"ముహూర్తం యింత త్వరగా పెడతారని తెలియదు. పైగా వారం నుంచి నేను బి. హెచ్. ఇ. యల్.లో వుంటున్నాను"

సరోజ కాంతికి పెళ్లి కూతురు చేస్తోన్న ఉద్యోగం గురించీ, పెళ్లి కూతురు అక్క శారద గురించీ చెప్తోంది.

"మా వదిన ఉద్యోగం చేస్తోంది కాంతీ!"

"ఉద్యోగం లేని అమ్మాయిని మీ వాళ్లు చేసుకోమన్నారు."

"ఈజ్ ఇట్?" అంది ఆశ్చర్యంగా..

"పెద్ద గొడవ చేశారు"

"నాకేం తెలియదండీ.. మా చిన్నన్నయ్య శ్రీకాంత్ ఉద్యోగం చేసే అమ్మాయి కావాలనే వాడు. కానీ పట్టు బట్టారంటే..."

"లేక పోతే వేరే సంబంధం చూసుకోమన్నారు"

సరోజ తల వంచుకుంది.

"ఈ కాలంలో కట్నం సమస్యపోయి మీ పాలిట నిరుద్యోగం పెళ్లికి సమస్యగా ఎదిగే రోజులు వస్తున్నాయి."

"అందం, పెర్సనాలిటీ, చదువు, ఉద్యోగం ఇంకా ఇంకా మేం ఏం పోగు చేసుకోవాలో బతకడం కోసం" కాంతి అంటోంది.

"మీరు పెళ్లి చూపులకు రాలేదుగా?"

"లేదండీ..."

"సరే పెళ్లిలో మనందరం కలుస్తాం. వారమేగా టైముంది" అంది కాంతి.



చతుర ... లీల



సరోజ లేస్తూ "నేను ఈ శుభలేఖలు పంచి పెట్టాలి. మీరు మాట్లాడుకుంటూ వుండండి. వెడతానండీ." అంది ప్రకాశం వైపు తిరిగి.

"గుడ్ నైట్.."

సరోజ వెళ్లిపోయింది

ప్రకాశం కాంతిని చూసి "లేద్దామా" అన్నాడు.

కాంతి లేచింది.

ఇద్దరూ ఏం మాట్లాడలేదు. కాంతి ప్రకాశం వైపు చూసి,

"ఆ రోజు జరిగినదానికి క్షమించాలి" అంది.

"ఫరవాలేదండీ.."

"మా నాన్న అదోరకం మనిషి.."

"అదోరకం నాన్నగారికి కొత్త రకం కూతురు మీరు. మీ నాన్నగారు ఏనాడైనా మారితే ఆ క్రెడిట్ మీకే దక్కుతుంది."

"రండి.. కోటి దాకా వెడదాం, మీతో మాట్లాడాలి.."

ప్రకాశం కాసేపు ఆలోచించి "పదండి" అన్నాడు.

దారి పొడుగునా కాంతి తన చదువు గురించీ, దగ్గర్లో జరగబోయే పరీక్షల గురించీ చెప్పింది. ఆఖర్ని అంది-

"మా కంపెనీలో కొత్తవాళ్లని తీసుకుంటారుట... నిన్న మా నాన్న ఎవరికో ఫోన్ చేస్తుంటే విన్నాను."

ప్రకాశం ఏం మాట్లాడలేదు.

"అప్పుడే నాన్న చుట్టూ ఎంతో మంది ఉద్యోగాల గురించి తిరుగుతున్నారు."

"తప్పేముందండీ... సహజమేగా" అన్నాడు.

"నాన్నతో మీ గురించి చెప్పాను."

"అలానా ?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఏమన్నారని అడగరేం ?"

"మీరు చెప్పండి.."

"అనవసర రికమెండేషన్స్ చేయనన్నాడు."

"అవును... పెద్ద పొజిషన్‌లో వున్న వాళ్ల భార్యలూ, కొడుకులూ, కోడళ్ళూ, కూతుళ్లూ కలగజేసుకుంటూన్న మూలంగానే దేశంలో అరాచకం ప్రబలుతోందని అందరూ అనుకుంటున్నారు.."

"కొడుకు చెబితే వింటాడు గానీ ప్యూన్ చెబితే ఏ ఆఫీసరూ ఒప్పుకోడుగా" కాంతి అంది. ప్రకాశానికి నవ్వొచ్చింది.

"సరే మీకు టైం అవుతోందేమో"

"నాదో చిన్న కోరిక..."

"కోరికా..."

కోరికంటే ఏం లేదు. రేపు ఆదివారం ఎలాగైనా పబ్లిక్ గార్డెన్‌కి రండి మీతో చాలా పనుంది."

"చాలా పనా..."

"ఇప్పుడేం అడగొద్దు. మీరు మాత్రం తప్పకుండా రావాలి. ఒస్తానని ఒట్టెయ్యండి."

"మీరింకా కాలేజీలో చదువుతున్నారు. పెళ్ళి గిళ్లి కావాలి. ఇలా తెలియని మొహాల దగ్గర ఒట్లూ ప్రమాణాలు తీసుకుంటే..." ప్రకాశం ఆగిపోయాడు.

"ప్రమాణం తీసుకుంటేనూ, స్నేహం చేసేనూ ప్రమాదమని ఏ ఒక్క పాఠంలోనూ వినలేదు నేను" చిన్నగా అంది.

"జీవిత సత్యాలు పుస్తకాల్లో కనబడవు. అది మన దురదృష్టం."

"ఇంతకీ రేపు ఆదివారం..."

"శనివారం మా చెల్లాయి పెళ్లికి వస్తారుగా"

"ఓ మర్చేపోయాను. అప్పుడు గుర్తు చేస్తాను. వెడతాను" అంది కాంతి ఆగిన బస్ దగ్గరకు వెడుతూ.

ప్రకాశం చెయ్యి ఊపి రామచంద్రపురం స్టాప్ దగ్గరకు వెళ్లి నిలబడ్డాడు. బస్ వచ్చింది. వందమంది దాకా ఆడా మగా గింజుకుంటూ తోసుకుంటూ బస్‌లో దూరుతున్నారు. చంటి పిల్లలు ఏడుస్తున్నారు. బియ్యం బస్తాలు, కూరల బుట్టలు. బస్ ఎక్కిన వాళ్లు ఆర్.టి.సి.నీ దాని యాజమాన్యాన్ని దుమ్మెత్తి పోసుకుంటున్నారు.

ప్రకాశానికి తననే ఎవరో తిడుతోన్నట్టుగా అన్పించింది. తను పాటించని నీతిని నలుగురి నుంచి ఆశించడం ఒక్క మనిషికే చేతనవును. ఎంత ఘోరం.

* * *

ప్రకాశం వెళ్లేటప్పటికి చలమయ్యో వాలుకుర్చీలో పడుకుని, టీపాయ్ మీద

కాళ్లు పెట్టుకుని సినీ పత్రిక చదువు కుంటున్నాడు.

"రా ప్రకాశం!" అంటూ లేచి లోపలికి చూసి-

"కాఫీ పట్టావే. ప్రకాశం వచ్చాడు" అని కేకవేశాడు చలమయ్య.

ప్రకాశానికి చలమయ్యతో మాటలు ఎలా మొదలు పెట్టాలో తెలియలేదు. చేతిలో శుభలేఖ తీసి చలమయ్యకి యిచ్చాడు. పెళ్ళికి ఆహ్వానించాడు.

"కట్నం ఎంత యిస్తున్నారు."

"కట్నం లేదు."

"ప్రేమ పెళ్ళా"కిసుక్కున నవ్వాడు చలమయ్య.

"కాదు."

"ఆదర్శ వివాహం అన్నమాట"

"అదీ కాదు."

ఇంతలో చలమయ్య భార్య కాఫీ తెచ్చింది. ప్రకాశం మౌనంగా కాఫీ తాగుతూంటే చలమయ్య అన్నాడు.

"నీ గురించి వేణుబాబు గారితో చెప్పాను. ఈవేళ సెలవుగా. ఆరింటికి వెడదాం. నే స్నానం చేసి వస్తా"అంటూ లేచి లోపలికి వెళ్ళాడు.

ప్రకాశం సినిమా పత్రిక చేతిలోకి తీసుకుని చూస్తూ కూర్చున్నాడు.

చలమయ్య తయారయి వచ్చి 'పద ప్రకాశం'అని భార్యతో "తలుపువేసుకో" అని హెచ్చరించి వీధిలో పడ్డాడు. ఆ తర్వాత ప్రకాశాన్ని వీధులు తిప్పాడు. స్కూల్ బిల్డింగ్‌లో జరుగుతున్న రిహా ర్సల్స్‌కి తీసుకువెళ్లి స్నేహితులకు పరి చయం చేశాడు. ఆఖర్ని క్లబ్‌కి ఎదురుగా వున్న క్వార్టర్స్‌లో ఓదాంట్లోకి వెళ్ళాడు.

కారుగేరేజ్‌లో డ్రైవర్ కారు కిందదూరి రిపేర్ చేసుకుంటున్నాడు. పదేళ్ళ పిల్లలు చెట్లు దగ్గర ఆడుకుంటున్నారు. గేటు పక్కన మాగన్నుగా నిద్ర పోతున్న అల్షేషియన్ చలమయ్యని చూసి ఓ మొరుగు మొరిగింది.

"నేనే పడుకో" అంటూ చలమయ్య దాని నెత్తిమీద రుద్దాడు.

"అయ్యగారుండారా ?" డ్రైవర్ని చూసి అడిగాడు.

"ఉండారయ్యా!"

"మా నాన్న టిఫిన్ తింటున్నారు" అంటూ ఓ పిల్ల అరిచింది.

"నో. అలా చెప్పకూడదని అమ్మ చెప్పిందా" మగపిల్లవాడు హెచ్చరిం చాడు.

చలమయ్య లోపలికి వెళ్లాడు. ప్రకాశం చలమయ్య వెనకే వెళ్ళాడు. హాల్లోంచి అప్పుడే లోపలికి వెడుతూన్న పదహారేళ్ళ అమ్మాయి లోపలికి వచ్చిన వీళ్ళని ఆశ్చర్యంగా చూసి ఆగింది.

"మామయ్య లేరా" అన్నాడు చలమయ్య.

"వున్నారు. కూర్చోండి" అనేసి ఆ అమ్మాయి లోపలికి వెళ్లిపోయింది.

"యం.బి.బి.యస్. చదువుతోంది" చలమయ్య చెప్పాడు.

ఇంతలో లోపలి నుంచి వేణుబాబు గారు వచ్చారు. ఖద్దరులుంగి,చేతుల బనీను వేసుకున్నాడు.

చలమయ్యా, ప్రకాశం 'నమస్తే' అన్నారు. వేణుబాబుగారు కళ్ళతో ప్రతి నమస్కారం చేసి కుర్చీలో కూలబడి సిగరెట్ వెలిగించుకున్నాడు.

"కులాసాగా వున్నారా?" చలమయ్య అడిగాడు.





"ఏం కులాసారా! ఏదో బండ నడుస్తోంది. మీ అ త్తయ్యకి ఆయాసం, నాకు బ్లెడ్ ప్రెషర్. ఇల్లు ఆస్పిటల్‌లా వుందనుకో "అని ఇతగాడెవరూ ?" అన్నాడు.

"మావూరే మామయ్యా! పేరు ప్రకాశం. యం. ఏ. అయ్యింది. ఇంకా ఉద్యోగం దొరకలా"

"ఓ" అన్నాడు.

"నీకు అన్నయ్య చెప్పాడనుకుంటాను"

"అవును ఫోన్ చేశాడు మొన్న."

"నువ్వు సహాయం చెయ్యాలి."

వేణుబాబుగారు నవ్వేశాడు. "సహాయం అంటే ఉద్యోగం అంతేకదా"

"అవును"

"ఎవరబ్బాయివి?"

"గోపాలరావు మా నాన్నగారి పేరు. ఆయన కరిణీకం చేస్తారు"

వేణుబాబుగారు అవాక్కు అయిపోయాడు. ఆ తర్వాత పూనకం వచ్చినవాడిలా అన్నాడు-

"ఏం ఉద్యోగాలో! చస్తున్నాం... అనుకో తెల్లారి లేస్తే ఎవరో ఒకళ్ల రికమెండేషన్ కోసం వస్తారు. మా పైవాళ్ళేమో 'నువ్వెంత మందికి రికమెండేషన్ చేస్తావయ్యా' అని ఎత్తిపొడుస్తున్నారు. అందరూ కావల్సినవాళ్ళే. ఒకసారి ఈ రికమెండేషన్ ఊబిలోకి దిగితే అంతే! అంతూ దరీ వుండదు. పోనీ అని ఉద్యోగాలు వేయిస్తే సవ్యంగా ఉద్యోగాలు చేసుకుంటారా అంటే వీళ్ళే రేపు యూనియన్‌లో నాయకులై మాకు తలపోటుగా తయారవుతారు. మా పై వాళ్ళేమో 'అంతా మీ రికమెండేషన్ గాళ్ళే! వీళ్ళు అల్లర్లు చేస్తూంటే మీకు కంట్రోల్ చెయ్యండి' అంటూ మా నెత్తిమీద మొదతారు. పాలుతాగి రొమ్ము గుద్దే రకాలు మనవాళ్ళు. అదే ప్రైవేట్ వాళ్ళయితే ఏ అల్లరీ చేయరు."

"ప్రకాశం అలాంటి వాడు కాదు."

"ఉద్యోగం దొరికే వరకూ నిరుద్యోగి. ఆ తరువాత లీడర్. నాలుగేళ్ళలో మేనేజ్‌మెంట్‌కి పక్కలో బల్లెంగాళ్ళు"

చలమయ్య మాట్లాడలేదు.

"ఎవరు ఏం అడిగినా, ఏం చేసినా అన్నిటికీ కారణం ఆకలే కదండి" చిన్నగా అన్నాడు ప్రకాశం.

"ఆఫీసర్లమీద బాకులు దూయడం ఆకలికాదు అహంకారం. ఉద్యోగం తీసే అధికారం చిన్న ఆఫీసరు క్కూడా ఇచ్చిన రోజు ఈ వర్కర్లు లొంగుతారు"

ప్రకాశానికి ఏం మాట్లాడాలో తెలియలేదు.

"మరి వెడతాం"

"నువ్వు కాసేపు వుండు" అన్నాడు వేణుబాబుగారు.

"మరి నే వెడతానండీ! నేను నిరుద్యోగిని. మీరు సహాయం చేస్తే మీకు సర్వదా కృతజ్ఞతతో వుంటాను" ప్రకాశం చలమయ్యని చూసి "నే వెడతాను, మళ్ళీ కలుస్తాను" అని వేణుబాబుగారికి నమస్కారం చెప్పి వీధిలో పడ్డాడు.

వేణుబాబు "మంచిది" అన్నాడు. ప్రకాశాన్ని వెళ్ళనిచ్చి తిరిగి వేణుబాబు అన్నాడు.

"ఈ కుర్రాడు నీకెలా తగిలాడు."

"మా వూరే. ఉద్యోగం ఇప్పించమని ప్రాణం తోడేస్తే తీసుకు వచ్చాను"

"చలమయ్యా! మీకెప్పుడు జ్ఞానం వస్తుందో తెలియదు. మనవాళ్ళెంతమంది

ఉద్యోగాలు లేక రోడ్లు పట్టుకు తిరుగుతున్నారు! మనవాళ్ళ కుర్రాళ్ళే కనబడ లేదా నీకు? కగణంగారి అబ్బాయే దొరి కాడా? ఇప్పటికే వీళ్లు చేసిన అథారిటీ చాలు. వీళ్ళని నెత్తి కెక్కించుకుంటే మనకి ఒరిగేదేంలేదు. బ్రాహ్మల్ని అసలు నమ్మకూడదు. తాచు పాములు. పాలు తాగుతారు, కాటూ వేస్తారు"

"నిజమే అనుకో"

"ఎక్కడ చూసినా వీళ్ళే మనకి పోటీ. వీళ్ళకన్నా మాలాళ్లు నయం. విశ్వాసం వుంటుంది. మనం చాలా గొప్పవాళ్లం, ఈ జాతి ఔన్నత్యానికి మనమే కారకులం అని వీళ్ళకి అహంకారం. వీళ్లని పైకి రానివ్వకూడదు."

"ప్రకాశం అలాంటి వాడు కాదు."

"అదేం నాకు అవసరం లేదు. నీకంతగా నచ్చితే నువ్వేదయినా చేసుకో. నా వల్ల కాదు." అలా వేణుబాబు చలమయ్యకి ఓ గంట ఏవేవో చెప్పి ఆ తర్వాత భార్యనీ, పిల్లాణీ ఆస్పిటల్‌కి తీసుకువెళ్ళే పని వప్పగించి ఆ పైన అన్నాడు–

"ఈ నెల్లో మన సంఘం రవీంద్ర భారతిలో పెద్ద ప్రోగ్రాం ఏర్పాటు చేస్తోంది. నీకో ఏభై టికెట్లు యిస్తున్నాను. అమ్ము" అంటూ ఓ టికెట్ బుక్ ఇచ్చాడు.

చలమయ్య కిమనకుండా టికెట్ బుక్ తీసుకున్నాడు.

"ఈసారి మన సంఘానికి ప్రెసిడెంట్‌గా నన్ను నిలబడమంటున్నారు. మీరంతా బాగా వర్క్ చెయ్యాలి. ఆ ప్రెసిడెంటుగాడు తన కూతురికీ, కొడుక్కీ కులాంతర వివాహాలు చేసి ఆదర్శవాదినని విర్రవీగుతున్నాడు. వాడికి బాగా బుద్ధి చెప్పాలి తెల్సిందా"

"అర్థమయ్యింది"

"ఎగ్జిక్యూటివ్ మెంబర్‌గా నా చేతిలో రెండు పోస్టులు వస్తాయి. నిన్ను నామినేట్ చేద్దామనుకుంటున్నాను. నీకు అభ్యంతరం లేదుకదా" ప్రేమగా అడిగాడు వేణుబాబు.

"మీ ఇష్టం" అన్నాడు.

"రేపు మన సంఘానికి మీలాంటి కుర్రాళ్ళు కావాలి. జనాన్ని కొంచెం ఎడ్యుకేట్ చెయ్యి. తెల్సిందా?"

చలమయ్య టికెట్‌బుక్‌తో వీధిలో పడ్డాడు. అతనికి సుదూర భవిష్యత్‌లో తను– తమ సంఘానికి ప్రెసిడెంట్ అయినట్టూ, మినిస్టర్‌గార్ని ఆహ్వానించి సినిమానటితో ఫొటో తీయించుకున్నట్టూ, ఆ సినిమా నటి తనకు దండ వేసినట్టూ, ఊహ వచ్చింది.

అది ఊహకాదు, ఆలోచన కాదు, పూనకం. ఆ పూనకంలో అతను ప్రకాశాన్నీ, ప్రకాశంచేత చేయించుకున్న ఉపకారాన్నీ మర్చిపోయి, తిరిగి ప్రకాశం వచ్చినప్పుడు ఏం చెప్పి వాపసు పంపాలో మననం చేసుకోసాగాడు.




రాణి పెళ్ళి. ఎంత హడావిడి, ఎంతో సంతోషం, మరెంత ఆర్భాటం! రాఘవ, కాలనీ కల్యాణ మండపంలో



రాణి పెళ్ళికి ఏర్పాట్లు చేశాడు. మగ పెళ్ళివారికి ఎవర్నో స్నేహితుల్ని ప్రతిమ లాడి వాళ్ళింట్లో విడిది ఏర్పాటు చేశాడు.

వచ్చేపోయే స్నేహితులతో, బంధువులతో, సెంటువాసనలతో, బేండ్‌వాయిద్యాలతో అంతా హడావిడి, హోరు. కొత్త చీరలు, ఆడవాళ్ళ నగలు. కంగారు.. ఒకటే హడావిడి. మగపెళ్ళివారి తరఫున గంటకి రెండు చీరలు మార్చిన అమ్మాయి గురించి గుసగుసలు. భోజనాల దగ్గర రుచుల మీద చర్చ. ఈ పెళ్ళిళ్ళకీ, యుద్ధాలకూ తేడాలేదు. కొత్త దంపతులు ఒకటయ్యేంత వరకూ రెండు వైపుల బంధువులూ రమ్యమైన కొట్లాటలు, మూతి ముడుపులు విసురుకుంటూనే వుంటారు.

ప్రకాశం సరోజతో అన్నాడు "స్వయానా మీరు ఆడబడుచు. ఏమిటీ గమ్మున వుండిపోయారు? కాస్తయినా బెట్టు చేయండి."

"మీ సంగతి నాకు తెలుసు. రేపు నా పెళ్లిలో అంతకు రెట్టింపు అల్లరి చేద్దామని మీ ఉద్దేశం అవునా?" అంది నవ్వుతూ.

"అదేం కాదు. నలుగురూ నాలుగు అంటే పద్ధం ఎలానూ తప్పదు. అందరూ కోరస్ మాదిరిగా ఒకేసారి అల్లరి చేస్తే సరిపోతుంది."

ఇంతలో కాంతి వచ్చింది.

"మాకు గోంగూర పచ్చడి అంద లేదు" అని అరుస్తూ.

"అందుతుంది."

"ఎప్పుడూ?"

"తయారయినప్పుడు."

"అదెప్పుడు?

"టైం ఇచ్చినప్పుడు."

"లేదని ఒకమాట చెప్పెయ్యండి" కాంతి నవ్వుతూ అంది.

"వంటింట్లోకి వెళ్ళి చూసుకోండి. ఉన్నవి ఏమిటో తెలుస్తాయి."

పెళ్ళికొడుకు పెద మామయ్యగారు సరిగ్గా వడ్డన సమయానికి ఎటో వెళ్లాడు. ఆయన వస్తేగానీ ఎవరూ కూర్చోరుట.

రాఘవ బెంబేలుగా కన్పించాడు.

"ఆయనకేం రోగంట. సమయానికి పోయాడు" అంది నెమ్మదిగా విశాల.

"ఆయన కూతుర్ని శ్రీకాంత్ కి ఇద్దామను కున్నాడుట. కుదరలా. అదీ ఏడుపు" ఎవరో చెప్పారు.

ఓ గంట తర్వాత నలుగురు వెళ్ళి బతిమలాడితే ముహూర్తం టైములో తనకి తాంబూలం ఇవ్వలేదని, అందుకని అలిగినట్టు చెప్పాడాయన.

మూడు గంటల ప్రాంతంలో కాంతి వచ్చి ప్రకాశం పక్కన చేరింది.

"ఏమిటి తాంబూలం అందలేదా?"

"అదికాదు."

"పోకలు కావాలా?"

"కాదండీ. మొన్న చెప్పానుగా పబ్లిక్ గార్డెన్ కి వెడదామని."

"అవును."

"పెళ్ళి హడావిడి అయ్యింది. నేనెటూ వెడుతున్నాను."

"పదండి అయితే మిమ్మల్ని ఇంటి వరకూ డ్రాప్ చేసినట్టవుతుంది."

ప్రకాశం, కాంతి పబ్లిక్ గార్డెన్ కి వెళ్లాయి. మ్యూజియం బిల్డింగ్ ఎదురుగా వున్న ఖాళీ స్థలంలో చతికిల పడ్డారు.

"మీరు మళ్ళీ మా ఇంటికోసారి వచ్చి మా నాన్నని కలవండి" అంది కాంతి.

ప్రకాశం మాట్లాడలేదు.

"ఏం? ఇష్టంలేదా?"

"ఆయన నాకు ఉపకారం చేస్తారా అని!?"

"చేయచ్చు ఓ పని చేస్తే"

"అంటే...?"

"లంచం మాత్రం తీసుకోరు."

"మరేమిటి?"

"చెప్పుకోండి చూద్దాం."

"తెలియని చుట్టరికం ఏదైనా కల పాలి. అదొకటే మార్గం"

"కొంచెం దగ్గరగా వచ్చారు. మరి కొంచెం ఆలోచించండి"

"మీరే రక్ష మహాప్రభూ అంటూ కాళ్ల మీద పడ్డం."

కాంతి గల గలా నవ్వేసింది. "ఈ పని చాలా మంది చేస్తారు. దణ్ణాలకు దేముడే లొంగడంలేదు ఈ రోజుల్లో"

"మరేమిటి?"




కాంతి కాసేపు ప్రకాశం మొహం లోకి చూసింది.

"నాకు సత్యజిత్ రాయ్ సినిమాలన్నా, మృణాల్ సేన్ సినిమాలన్నా చాలాఇష్టం. ఈ ఇష్టం ఇష్టంగా వుండకుండా ఏదో వెర్రి తపన అంటారే అలాంటిది పుట్టు కొస్తుంది. ఊట బావిలా మనసులో ఏవేవో ఆలోచనలు... మన చుట్టూ జరిగే అన్యాయాల్ని చూస్తూ ఊరుకో కూడదని పదే పదే అన్పిస్తుంది. మనం సహాయం చెయ్యాలి. మనం సహాయం చెయ్యగల్గీ చెయ్యకపోతే, ఆ సహాయం అందుకోని మనిషి నిస్సహాయుడై, సమాజంలో ఏకాకి అయిపోయి,తన మేధస్సునీ, శక్తినీ ఏవగించుకుని నిరాశతో భీకరుడై నట్టు అన్పిస్తుంది. 'నీకు ఈ సమాజం వడ్డించిన విస్తరి అయినంత మాత్రాన కళ్ళు మూసుకుని భోజనం చెయ్యకు- ఓ రోజు విస్తరీ, అన్నం నీ కళ్ల ముందు విషంగా మారే సమయం వస్తుంది. ఒక్క ముద్ద పక్కవాడికి పంచు. అన్నం తినే ముందు ఆ అన్నం లేక పస్తులున్న వాళ్లని గుర్తు చేసుకుంటూ వుండు' అని ఎవరో చెబుతోన్నట్టు వుంటుంది."

ప్రకాశం కాంతి వైపు చూశాడు. కాళ్లు ముడుచుకుని తల వంచుకుని నేలని చూస్తూ ఏదో పుస్తకంలో వాక్యాలు చదివినట్టు చెప్పే ఇరవై ఏళ్లు లేని కాంతి అతనికి చైతన్యాన్ని దాచుకున్న చిన్న పిల్లలా కన్పిస్తోంది.

"మీరు.. చాలా చాలా మాట్లాడుతున్నారు. మీ మాటలు వింటే భయం వేస్తోంది. ఆడపిల్లకి మరీ సంఘం పట్ల విరక్తి పనికి రాదు. దానివల్ల..."

"ఏమీ కాదండీ! కాలేజీల్లోంచి నలుగురు అమ్మాయిల్నీ, అబ్బాయిల్నీ సంఘ విద్రోహులని పేరు పెట్టి తీసుకుపోయేప్పుడు వాళ్లలో నా పేరు కూడా వుంటుంది. అంతే!" కాంతి ఆగిపోయింది.

"తెలివైనవాళ్ళు అవివేకంగా ఆ[illegible] ఆపడాన్ని నేను ఇష్టపడనండీ.. సంఘానికి బాసటగా నిలబడవల్సిన కుర్రకారు చిన్నవయసులోనే అలసిపోకూడదు. ఏ ఇజమ్ అయినా మన దేశంలో అంత త్వరగా ఊడలు వేయక పోవడానికి మన ఆవేశమే కారణం. ఏం చెయ్యాలో, ఎలా చెయ్యాలో, ఏ విధంగా చేస్తే ఫలితం సిద్ధిస్తుందో తెలిసిన వాళ్లుతక్కువ. ఏదో చెయ్యాలనే చాలామంది ముందుకు వస్తారు. ఆలోచించండి! అనేక ఉద్యమాలు వచ్చి ఎందరో యువకుల్ని పొట్టన పెట్టుకుని పోయాయి. మిగిలింది కుళ్లు మిగుల్చుకున్న మనుషులు. వీళ్ళు ఆదర్శంగానీ, సమ సమాజంగానీ అంటే ఓనమాలు తెలియనివాళ్ళు. పెద్ద దేశంలో మార్పు తేవడానికి చాలా టైం పడుతుంది.. నిజమే! కానీ ఈ మార్పు కదన రంగంలోనే రాదు. మనసులో చాలా ముఖ్యమైన, సమూలమైన మార్పులు రావాల్సివుంది. విలువలు పెరగాలి. స్వార్థం పోవాలి. మన ఇల్లు చూడండి నలుగురు మనుషులుంటే ఎవరి దృక్పథం వాళ్ళదే! ఒకళ్ళనొకళ్ళు మింగుకోవాలని చూస్తారు. పదెకరాల్ని సవ్యంగా పంచుకున్న అన్నదమ్ములూ, అమ్మ చచ్చిపోతే నగల కోసం కొట్లాడుకోని ఆడపిల్లలూ కనబడరు.. బతుక్కి సాఫల్యం వుంటుందంటే నోరు వెళ్ళబెట్టే మనుషులే ఎక్కువ. సవాలక్ష దుర్గుణాలతో మనం జీర్ణరోగిలా బతుకుతున్నాం.. లంచాలు,

మాలు నడిపినా అభిమన్యుడిలా చస్తారే గానీ సంఘంలో బ్రతికి బట్టగట్టరు ? సాంస్కృతిక విప్లవంలో విజయం పొందకుండా సాయుధ విప్లవంలో



పొందలేరు. ఇది నా అభిప్రాయం"

కాంతి చాలా సేపు ప్రకాశం మాటలు వింది.

"సరే! అదలా ఉండనీండి. మరి నా మనసులో మాట చెప్పనా?'' అంది నెమ్మదిగా.

"చెప్పండి..."

కాంతి ప్రకాశం కళ్ళలోకి చూసి ఏదేదో చెప్పింది...

ప్రకాశం మొదట ఆశ్చర్యపోయాడు.

"ఇది కల్చరల్ రివల్యూషన్ అను

ఆశ్రిత పక్షపాతం, కులాలు, కట్నాల సమస్య, నిరుద్యోగ సమస్య యివి పోవాలంటే మనిషి పెంపకంలో మార్పురావాలి. సామాజిక స్పృహ చిన్నతనంనుంచే నేర్పాలి. సంకుచితత్వం పోనినాడు, నిజమైన దేశభక్తి లేనినాడు ఎన్ని ఉద్యమాలు

కోండి. మోసానికి మోసం. ఒప్పు కుంటారా...?"

"నీకు నష్టం ఏదైనా జరిగితే.."

"నాకా భయం లేదు''

ప్రకాశం చుట్టూ చూశాడు, బాగా చీకటి పడింది.

''మీరు లేవండి ఇంటికి వెళ్ళాలి..."

కాంతి లేస్తూ అంది "మా నాన్నతో గట్టిగానే మాట్లాడండి. భయంలేదు.."

"సరే..."

"మరి ప్లాను మర్చిపోయారేమిటి... ఉత్తరం మొదలు పెట్టండి.."

ప్రకాశం కాగితం తీసుకుని "మీరే చెప్పండి, ఏం రాయమంటారో ?"

''ప్రేమలేఖకి చెప్పేదేముందండి. డియర్ కాంతీ'' అంటూ కాంతి చెప్పసాగింది.

''వచ్చే ఆదివారం సరిగ్గా 5 గంటల టైం వేళారు కదూ?''

''ఆ... ఉత్తరం పూర్తి అయినట్టే''

''ఇటివ్వండి"

ప్రకాశం కాంతిని సెక్రటేరియట్ దగ్గర క్రాస్‌రోడ్స్ బస్ ఎక్కించి రాణి గంజ్ బస్‌కోసం ఎదురు చూస్తూ నుంచున్నాడు.

అతని ఆలోచనలనిండా కాంతే వుంది ! ఎంత తెగింపు. కాలేజీలో చదువుతూ తన కలలు, భవిషత్ మీద మమకారం, పెళ్ళి అయిన తర్వాత రాబోయే భర్తా, వైవాహికజీవితం...వీటిగురించిఆలోచించకుండా మనుషుల్ని ఉద్ధరించాలనే తపన ఆమెకి ఎవరు నేర్పారు? ఉన్నవాళ్ళిళ్ళల్లో పుట్టిన పిల్లలు గాజుబొమ్మల్లా పెరుగుతారంటారు ! కానీ కాంతి అందుకు భిన్నంగా కన్పిస్తోంది. ఏ స్వలాభాపేక్షా లేకుండా తనకి ఉపకారం చేయాలనుకుంటోన్న కాంతికీ, తనని ఓ మెట్టు దిగజార్చి స్వార్థంతో రోజు గడిపే మిత్రుడు చలమయ్యకూ ఎంత తేడా ! చలమయ్యని కల్సుకోవాలి ! చలమయ్య సహాయం చేస్తే కాంతిని ఈ రొంపిలోకి తను దింప నవసరం లేదు.

ఇంతలో రాణిగంజ్ బస్ వచ్చింది. ప్రకాశం బస్ ఎక్కి రాణిగంజ్‌లో దిగి ఐ.డి.పి. ఎల్. స్టాపులో నుంచున్నాడు. అది బస్‌స్టాప్ కాదు. పేవ్‌మెంట్. జనం రాళ్ళమీద కూర్చుని ఎంతకీ రాని ఆర్.టి.సి. బస్‌ని తిట్టుకుంటున్నారు.




ప్రకాశం బి. హెచ్. ఇ.యల్. కి వెళ్ళే సరికి చలమయ్య ఇల్లు పెళ్ళివారిల్లులా వుంది. ఇంటి నిండా బంధువులు. ఓగంట గుమ్మం ముందు నిల్చున్న తర్వాత చలమయ్య బయటకు వచ్చాడు.

''మా చిన్నమ్మాయి పుట్టిన రోజు. అదీ హడావిడి" అన్నాడు ప్రకాశాన్ని చూసి నసుగుతూ.

''సంతోషం" అన్నాడు ప్రకాశం..

''మా స్నేహితులందరికీ పార్టీ ఇస్తుండా"

కాసేపు ఆగి చలమయ్య అన్నాడు.

''ప్రకాశం నాకు ప్రమోషన్‌మీద భోపాల్ ట్రాన్స్‌ఫర్ వచ్చింది. వారం రోజుల్లో, వెళ్ళి అక్కడ జాయిన్ కావాలి."

"కంగ్రాట్యులేషన్స్ అందుకో"

''థాంక్స్''

ప్రకాశం నెమ్మదిగా అడిగాడు, "వేణు బాబుగారు ఏమన్నారు?"

చలమయ్య ''చేస్తానన్నాడు. కొద్ది రోజులు ఆగాలి. నేను భోపాల్ వెళ్లి శెలవు పెట్టి వస్తాను. అప్పుడు చూద్దాం'' అన్నాడు.

ఇంతలో చలమయ్య అన్న భూషణం గారు అటువచ్చి "బావున్నావా ప్రకాశం" అని పలకరించి పెద్దవాళ్లలో కలిసి పోయాడు.

ప్రకాశానికి అక్కడేం చేయాలో తోచలేదు. చాలామంది వస్తున్నారు. పోతున్నారు. అప్పుడే వచ్చిన వేణుబాబు గారిని ప్రకాశం గుర్తు పట్టాడు.

"నమస్కారం సార్" అన్నాడు.

వేణుబాబు ప్రకాశాన్ని ఎవరన్నట్టు చూశాడు. ప్రకాశం తనని తను పరిచయం చేసుకున్నాడు.

''ఓహో!'' అన్నాడు.

''మీరు సహాయం చేస్తే...''

వేణుబాబు క్షణం అటూ ఇటూ చూసి "నా మీద నమ్మకం పెట్టుకోకు. నీ అదృష్టం వుంటే వస్తుంది. పోనీ ఏదైనా సెల్ఫ్ ఎంప్లాయిమెంట్ స్కీమ్ చూసుకో లేకపోయావా? ఏ బాంక్‌లోనో తీసుకుని చిన్న ఇండస్ట్రి స్టార్ట్ చేస్తే పోలా" అంటూ ప్రేమ ఒలకబోస్తూ ఏవేవో చెప్పాడు.

ప్రకాశానికి వేణుబాబుగారి హితవులో 'అదృష్టం' అనే మాట ఒకటే అర్థ మయింది. అదృష్టం అంటే? ?

వేణుబాబుగారి వైపు చూశాడు. అయనకు పులి మొహం వున్నట్టుగా కన్పించింది. చలమయ్య వైపు చూశాడు. నక్క మొహంతో నవ్వుతోన్నట్టుగా వుంది.

"నే వెడతాను'' అన్నాడు చలమయ్యతో.

"అన్నం తిని పో" అన్నాడు.

"వద్దులే"

ప్రకాశం తిరుగు మొహం పట్టాడు.

చలమయ్య ద్వారా తనకి ఉద్యోగం దొరకడం అసంభవం అని ప్రకాశానికి తెలిసిపోయింది. ఒక ఆశ అడుగంటింది. తిరిగి ఆశలు పేర్చుకుంటూ అవి కళ్ల ముందే కూలిపోతుంటే చూస్తూ తిరగాలి. ఇంటికి వచ్చేసరికి రాణి బయటకు వెడుతూ కన్పించింది.

"మావారు ఆఫీసు నుంచి వచ్చే టైం అయ్యింది బయలుదేరుతున్నా'' నవ్వుతూ చెప్పింది.

"ఆఫీసు ఫైల్స్ ఏమన్నా తయారు చేసుకున్నావా?''

"ఇంకా ఆ అనుమానం రాలేదు" నవ్వుతూ అంది విశాల వదిన.

"మొదటి నెల జీతం ఎవరికిస్తావే? మీ ఆయనకా, వదినగారికా?" రాఘవ అడుగు తున్నాడు.

"ఆయన చేతుల్లో పెడతాను. తరువాత అది ఎక్కడికిపోతే నాకేం?''

''మీ బావగారూ, తోడికోడలూ నిన్ను చూసి గర్వపడుతున్నారను కుంటా" ప్రకాశం అడిగాడు.

"గర్వం ఏమిటన్నయ్యా. నేను వాళ్ల దృష్టిలో బంగారు గుడ్లుపెట్టే బాతుని.''

"రేపు నువ్వు నిరుద్యోగివని తెలిస్తే? ఆ విషయం ఆలోచించావా?"

"ఆలోచించానన్నయ్యా. అందుకే ఈ లోపునే ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నాను.

 

నా అదృష్టం ఎలా వుంటుందో?"

"మీ ఆయన ఆఫీసుకు ఫోన్ చేస్తే ఎలానే? నువ్వక్కడ పనిచేయడం లేదని ఎవరైనా చెప్తే."

"ఫర్వాలేదు అమ్మా! రాణి కంపెనీలో బయట నుంచి వచ్చే ఫోన్ కాల్స్‌కి మనుష్ల్ని పిలవరు. కావాలంటే కబురు చెపారు. పైగా ఆ కంపెనీ ప్రొప్రయిటర్‌కి నేను ముందుగానే చెప్పి వుంచాను."

ప్రకాశానికి కొంత ఆశ్చర్యంగానూ, మరికొంత భయంగానూ వుంది.

రాణి లేచి "నేను వెడతానమ్మా" అంది. ప్రకాశం రాణీని బస్‌స్టాప్ వరకూ తీసుకువెళ్ళాడు.

"మీ ఆయన శ్రీకాంత్ స్వతహాగా ఎటువంటి మనిషి రాణీ?"

"చాలా మంచివారు"

ప్రకాశం ఏం మాట్లాడలేదు.

"అన్నయ్యా! ఓ మంచి రోజు చూసి కనీసం ఆయనకైనా నిజం చెప్పాలని అనుకుంటున్నాను. ఎందుకంటే ఈ లోపున నాకు ఉద్యోగం దొరక్కా, ఆయనకు నిజం తెలిస్తే..."

"అదే మంచిది"

"అన్నయ్యా! ఒకవేళ ఆయన తప్పుగా అర్థంచేసుకుని ఈ విషయాన్ని సీరియస్‌గా తీసుకుంటే..."

ప్రకాశం ఏం చెప్పలేకపోయాడు.

నాలుగు వందలు సంపాదించే భార్య, పెళ్ళికోసం అబద్ధం ఆడి ఉద్యోగినిని చెప్పి తాళి కట్టించుకుంటే భర్త ఎలా రియాక్ట్ అవుతాడు? శ్రీకాంత్ ఈ విషయాన్ని తార్కిక దృష్టితో ఆలోచించి రాణిని క్షమిస్తాడా? లేక రాణిని అన్నగారూ, వదినల మాటలు విని అపార్థం చేసుకుంటే?

"నాకు ఉద్యోగం దొరికితే బాధలు తప్పుతాయి లేకపోతే ఏమన్నా జరగొచ్చు"

ఉద్యోగం...రాణి-బతుకు నిలపడానికి ఉద్యోగం కావాలి! అలాగే తనకి కడుపు నింపుకోవడానికి ఉద్యోగం కావాలి! ఎవరిస్తారు ఉద్యోగం? ఎక్కడ దొరుకుతాయి ఉద్యోగాలు??

ప్రకాశం రాణిని బస్ ఎక్కించి ఇంటికి వచ్చేసరికి పోస్ట్‌మన్ ఉత్తరాలు యిచ్చాడు. అందులో ఒకటి సీత రాసింది.

ఉద్యోగ ప్రయత్నాలు ఎంత వరకూ వచ్చిందీ తెలియజేయమని రాసి ఆఖర్ని-

"మా నాన్న నాకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నాడు. ఇక విసుగేసి నిన్ను తప్ప మరెవర్నీ చేసుకోనని చెప్పేశాను. అప్పటి నుంచీ ఆయన నిప్పులు కురిపిస్తున్నాడు. నాకేం చేయాలో తోచడం లేదు" అని రాసింది.

ప్రకాశానికి మనసంతా దేవినట్టయ్యింది. సీతని తను పోగొట్టుకోబోతున్నట్టుగా అన్పించసాగింది. సీత తండ్రి దశరథంగారు తనింటికి వెళ్ళి తల్లినీ తండ్రినీ దుర్భాషలు ఆడుతున్నట్టు అనిపించింది. సీతకి మరో వ్యక్తితో పెళ్ళి కాకుండా ఆపాలి. కానీ సీతకి తను భర్తకావాలంటే ముందు తను ఉద్యోగస్తుడవ్వాలి!

ప్రకాశం ఆలోచిస్తున్నాడు. మరునాడు ఆదివారం. కాంతి చెప్పిన ప్రకారం తను పబ్లిక్ గార్డెన్‌కి వెళ్ళాలి. శ్రీనివాసరావుగారు వస్తాడు! శ్రీనివాసరావుగారు కాంతి ఊహించినట్టు తనతో కాళ్ళ బేరానికి దిగుతాడా? తన హోదానీ, శక్తినీ మర్చిపోయి తనని ప్రాధేయపడతాడా?

ప్రకాశానికి మరునాడు జరగబోయే తతంగం కళ్ళముందు కన్పిస్తోంది.

* * *

ప్రకాశం పబ్లిక్‌గార్డెన్‌లో కూర్చు న్నాడు. గ్రౌండ్‌లో నలుగురైదుగురు పిల్లలు కేరింతలు కొడుతూ ఆడుకుంటు న్నారు. ప్రకాశం అక్కడికి వచ్చి అర గంట అయ్యింది. అతని దృష్టి రోడ్ వెపే వుంది. పది నిముషాలకో కారు వస్తోంది. కార్లోంచి పిల్లలతో దిగిన పెద్దలు పిల్లల మాదిరే ఆటలాడుతు న్నారు. మరో పది నిమిషాలు గడిచాయి. నల్ల ఎంబాసిడర్ కార్లోంచి శ్రీనివాస రావుగారు దిగారు. దిగి కారు దగ్గరనుంచే చుట్టూ చూశాడు. ప్రకాశానికి అర్థమ య్యింది. ఆయన తనవైపే చూసు న్నాడు. కాదు వస్తున్నాడు దగ్గరగా. ప్రకాశానికి దగ్గరగా వచ్చి పరకాయించి చూశాడు.

ప్రకాశం "నమస్తే" అన్నాడు.

శ్రీనివాసరావు "నువ్వు..." అన్నాడు.

"మీ ఇంటికి ఓసారి వచ్చాను"

"అవును గుర్తుంది"

ప్రకాశం ఏం మాట్లాడలేదు. తల పంచుకున్నాడు.

"నీతో మాట్లాడాలని వచ్చాను" నెమ్మదిగా అన్నాడు శ్రీనివాసరావు.

"నాతోనాండీ"

"అవును" శ్రీనివాసరావుగారు గడ్డిలో చతికిల పడ్డాడు.

ప్రకాశం ఆయనవైపు చూశాడు.

"నువ్వు బాగా చదువుకున్నవాడివి"

"బాగా చదవలేదు. ఏదో చదివి యం. ఏ. చేశాను"

శ్రీనివాసరావు మరోసారి ప్రకాశాన్ని అతని తల్లిదండ్రుల గురించీ, వంశం గురించీ అడిగి తనకు తనుగా తన వంశం గురించీ, తన కుటుంబం గురించీ చెప్పాడు.

"ఈ రోజుల్లో చాలామంది ప్రేమించా మనీ, ప్రేమ కోసం జీవిస్తున్నామనీ అనుకుంటున్నారు. నీ అభిప్రాయం?"

"మీరన్నట్లు చాలామంది ప్రేమిస్తూ ఆ ప్రేమకోసమే జీవించడం జరిగితే అది సంఘానికి మంచి మలుపే. ప్రేమ మనిషిని ప్రక్షాళనం చేసి కాలిన ఇనుములా స్వచ్ఛంగా తయారుచేస్తుంది"

"స్వార్థానికీ, ప్రేమకీ తేడా చాలా వుంటుందనుకుంటాను"

"ప్రేమ అనే భావనతో మనిషి స్వార్థ పరుడవుతాడు. అదో అవస్థ. కానీ దోషం కాదనుకుంటాను"

"ప్రేమించడానికి కూడా అర్హత వుండాలి"

"బావుంది సార్ మీరు చెప్పేది. ఓ కారు కొనుక్కున్న తర్వాతో, ఓ పెద్ద బిల్డింగ్ కట్టుకున్న తర్వాతో తీరిగ్గా ప్రేమిద్దామని ఎవరూ ఊహించరను కుంటాను. ప్రేమలో పడ్డం, ప్రేమించడం వారికే తెలియకుండా జరిగే ప్రక్రియ. అదో అందమైన అలజడి. ఎలా జరిగిందో ఏం జరిగిందో తెలియకుండా ఏదో జరగడం అంతే!"

"ప్రేమికుల్లో నయవంచకులూ చాలా మందే కన్పిస్తున్నారు ఈ రోజుల్లో! మరి వాళ్ళ మాటేమిటి?"

"ప్రేమ వ్యాపారం అనుకున్నవాళ్ళూ వుంటారు. అలాగే జీవితం కూడా వ్యాపారం అంటూ లెఖ్ఖలు కట్టుకునేవాళ్ళూ వుంటారు"





శ్రీనివాసరావు చిరాగ్గా చూసి-

"నువ్వే కోపల్లోకి వస్తావ్ ?" అన్నాడు సూటిగా.

"అంటే..."

"మా కాంతిని ప్రేమిస్తున్నావను కుంటాను. ఆ ప్రేమకి హేతువేమిటని అడుగుతున్నాను"

ప్రకాశం మాట్లాడలేదు.

"మంచి జవాబు వెదుకుతున్నావా ?"

"ఆమె నా మంచి స్నేహితురాలు. అందుకే ప్రేమించాను"

"కాదు. అబద్ధం"

"మీకెలా తెలుసు?"

"నీ మొహం చూస్తే తెలుస్తోంది"

"సారీ! మీ మొహం చూస్తే కూడా నాకు ఏదేదో అన్పిస్తోంది. అయినా మర్యాద కోసం ఆ మాటని ఉపయోగించడం లేదు"

"షటప్" అరిచాడు శ్రీనివాసరావు.

ప్రకాశం నవ్వు ఆపుకుంటూ అడిగాడు, "ఇంతకీ మీరెందుకు వచ్చారిక్కడికి. జగడం కోసమా?"

"నీ సంగతి కనుక్కుందామని"

ప్రకాశం నవ్వేశాడు.

"చెప్పు. మా కాంతిని వదిలిపెట్టు. అది చదువుకుంటోంది. బాగా తెలివైంది. దాన్ని ఎందుకీ రొంపిలోకి లాగావ్. నీకేం కావాలి? డబ్బా ? అయితే ఎంత కావాలి?"

"డబ్బుతో నన్ను కొనగలననా మీ అభిప్రాయం ?"

"చాలామంది సంగతి నాకు తెలుసు. ఇదో ఎత్తు. పరువుల్లో వున్నవాళ్ళని, పరువుగా బ్రతుకుతున్నవాళ్ళని బజారు పాలు చేయడం ట్రిక్‌గా నేర్చారులే..."

"మనుషుల మీద మీకు చాలా కోపం ఉన్నట్టుందే"

"ఆఁ!బాధ్యతల్లేని కుర్రకారుని చూస్తే అసహ్యం. లైఫ్ అంటే మీకేం తెలియదు. మీరంతా చీడ పురుగుల్లాంటి వాళ్ళు"

ప్రకాశం కోపంగా చూశాడు. శ్రీనివాసరావుగారిని అరగంట గుక్క తిప్పుకోకుండా తిట్టాడు. బాధ్యతలేని పౌరుల తండ్రులుగా తలలు వంచుకోమని హెచ్చరించాడు. అద్దాల మేడలో తలుపులు మూసుకుని బ్రతుకుతున్న పింగాణీ బొమ్మలన్నాడు. ఆవేశంతో నిప్పులు కురిపించాడు. శ్రీనివాసరావు మాత్రం తొణకలేదు. వ్యాపారిలానే అన్నాడు-

"చెప్పు నీకేం కావాలి?"

"కాంతి"

"నువ్వు కాంతిని ప్రేమించలేదు. నిజం. నీకు కావల్సింది డబ్బు"

"డబ్బు కాదు" అని ప్రకాశం మండే కళ్ళతో, ఎగసి పడే హృదయంతో "ఉద్యోగం కావాలి" అన్నాడు.

"అంటే?"

"మీ కంపెనీలో ఉద్యోగాలు ఉన్నాయని తెలిసింది. నాకు తగ్గ ఉద్యోగం ఇవ్వండి చాలు"

"అంటే...ఉద్యోగం ఇస్తే కాంతిని వదిలేస్తావా?"

"తప్పకుండా"

"ప్రోమిస్?"

"ప్రోమిస్!"

"అయితే రేపు నా కంపెనీకి రా"

"చాలా థెంక్స్"

"నో మెన్షన్. కానీ ఓ షరతు, కాంతిని నువ్వు ఏ పరిస్థితుల్లోనూ కలవకూడదు. దానికి పెళ్ళి నిశ్చయం చేస్తు



న్నాను. విన్నావా?"

"మీ ఇష్టం"

శ్రీనివాసరావుగారు మరో మాట మాట్లాడకుండా
లేచి కారెక్కి వెళ్లిపోయాడు.

ప్రకాశం చీకట్లో మిగిలిపోయాడు. అతని ఆలోచనలు ఎటో పోతున్నాయి.

ఒక వ్యక్తిగా, నిరుద్యోగిగా తను శ్రీనివాసరావుగారి హృదయంలో ఎటువంటి పరివర్తనా తేలేకపోయాడు. కానీ



కాంతి ప్రేమికుడిగా శ్రీనివాసరావుగారి మనసులో గాయాన్ని రేపగల్గాడు, లొంగ దీయ గలిగాడు.

ఈ సంఘం ఎటుపోయినా శ్రీనివాస రావు లాంటి వాళ్ళకు పట్టదు. కానీ తన ఉనికిని భంగం ఏర్పడే సమయాల్లోనే ఆయన కళ్ళు తెరుస్తాడా? నిజానికి ఇది కళ్ళు తెరవడమా?

సీతగనుక తన మనసులో లేకపోతే, తను శ్రీనివాసరావుగారికి పాఠంనేర్పడం చాలా తేలిక!

నేటి సమాజాన్ని శ్రీనివాసరావుగారి లాంటి వాళ్ళు తునాతునకలు చేస్తూంటే ఏ మూలనో కాంతి లాంటి వాళ్ళుండి, ఆ చిన్నాభిన్నం అయిన ముక్కల్ని అతికి పగిలిన అద్దంలాంటి సమాజం దుమ్మూ ధూళీ పాలు కాకుండా చేస్తున్నారు.

ప్రకాశం కాలనీకి వెళ్లాక పద్మావతికి కాంతిని పరిచయం చేస్తూ ఉత్తరం

రాశాడు.

...నేను రెండోసారి కూడా బోలా పడ్డాను. డిగ్రీని కాల్చి మసి చేసేవాణ్ణే! కానీ కాంతి ఆ డిగ్రీకి ఆయుష్షు పోసింది.

చీకటి సమాజం, కాదు - అంధకార బంధురం అయిన మన సంఘంలో చిరు దీపాల్ని ఎందరు కాంతులు ముందుకు వచ్చి వెలిగిస్తే వెలుగురాజ్యం అవుతుందో??

దీన్ని చీకటి సమాజం అనటం కూడా తప్పేనేమో! చెడునడతకు అలవాటుపడ్డ పిల్లవాణ్ణి మొదట్లో చిన్న తిట్లు తిడతాం. వినకపోతే కొడతాం. ఇంకా వినకపోతే బూతులూ, దెబ్బలూ కలుస్తాయి. ఆఖరికి ఏం చేస్తారో అర్థంకాదు.

అది విసుగేసిన, విరక్తి కల్గిన మనిషి ఆవేశం బట్టి వుంటుంది.

మనదేశం చీకటి సమాజం అనే పేరు పోగొట్టుకుని జనారణ్యం అనే బిరుదుకు కూడా అందకుండా తిరోగమనంలో ముందంజ వేస్తోంది.

మనిషికీ మనిషికీ మధ్య ప్రేమ తగ్గి నమ్మకం పోయిన్నాడు వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటే అనురక్తి పుట్టదు.ఆవేశం పుడుతుంది. ఆ ఆవేశం కావేశం అవుతుంది. అప్పుడే మనిషికీ మనిషికీ మధ్య మంటలు రాజుకుంటాయ్. ఏమంటావ్? జవాబు రాయి" అని ఆవేశంగా రాసుకు పోయాడు ప్రకాశం.

* * *

ప్రకాశం ఉద్యోగంలో చేరి నెలరోజు లయ్యింది. హైదరాబాద్ వచ్చిన ఆర్నెల్లకి ఉద్యోగం దొరికింది-అదీ ఓ స్నేహితురాలి ద్వారా. ఉద్యోగంలో చేరేముందు కూడా చలమయ్యని కల్సుకున్నాడు. చలమయ్య నాలుగు కడవల కన్నీళ్ళు వదిలి ప్రకాశానికి ధైర్యంచెప్పి, తన అసహాయస్థితికి క్షమాపణలు చెప్పుకున్నాడు. చలమయ్య బి.ఏ. పాసయ్యాడు కూడా.

"నాకు ప్రమోషన్ వచ్చింది. నీ దయవల్లే" అన్నాడు చలమయ్య. అంత వరకే.

ప్రకాశం చలమయ్య దగ్గర సెలవు తీసుకున్నాడు. బతుకు 'శ్రీనివాసా ఇండస్ట్రీస్'కు అంకితం అయ్యింది. శ్రీనివాసా ఇండస్ట్రీస్‌లో చాలా రకాల ఎలక్ట్రానిక్ పరికరాలు తయారవుతాయి.

బిజినెస్ కూడా లక్షల్లో వుంటుంది. ఉద్యోగస్తులు ఐదారు వందలుంటారు.

ఉద్యోగంలో జేరేముందు కాంతి వచ్చి పలకరించింది.

"ఇదేమిటి. మీ నాన్నగారికి మళ్ళీ మిమ్మల్ని కలవనని వాగ్దానం చేశానే" అన్నాడు ప్రకాశం.

"మీరు కాదుగా కలిసింది. నేను"కాంతి నవ్వేసింది.

ప్రకాశం కూడా నవ్వేశాడు.

"ఇప్పుడు మీ మొహంలో కళ వచ్చింది."

"ఉద్యోగపు కళ అనుకుంటాను."

"మకాం ఎక్కడ?"

"విఠల్‌వాడిలో. ఏం?"

"నేను రాను. కానీ నా పెళ్ళి శుభలేఖ ఒకటి మీకివ్వాలిగా."

"పెళ్ళా?"

"అవును. మా నాన్న చాలా భయపడి పోయాడు. నా ప్రేమకి విరుగుడు పెళ్ళి అనుకుని పది సంబంధాలు తెచ్చాడు. అందరూ హోదా మనుషులే!"

"పెళ్ళికొడుకుల్ని చూశారన్న మాట"

 

"వాళ్లు పెళ్లికొడుకుల్లా లేరు. వాళ్ళకి కట్నం డబ్బూ, స్టేటస్ ఇవే తప్ప మరేం తెలియదు."

"షురీ అన్యాయం."

"ఒకళ్లిద్దర్ని పెర్సనల్‌గా ఇంటర్వ్యూ చేశాను."

"చాలా తెగించారన్న మాట"

"డేంజర్ అనిపించిన వాళ్ళని మాత్రం ఇంటర్వ్యూ చేశాను."

"ఏమంటారు?"

"నాకయితే ఏడుపొచ్చింది వాళ్ల విజ్ఞానం చూసి"

కాంతి వెళ్లిపోయింది.

ప్రకాశానికి ఆ ఉద్యోగం, వాతావరణం అంతా కొత్తగా వుంది. ఏదీ కూడా నిబంధనల ప్రకారం జరగదు. ఎక్కడ చూసినా జనాన్ని 'తన', 'పరాయి'గా విడదీసి చూడ్డం కన్పించింది. కంపెనీకి వచ్చే లాభాలు దాచిపెట్టి నష్టాలు చూపించే ప్రయత్నానికి మహారథులు కష్టపడుతూ వుంటారు.

ఉద్యోగం చేసే మనిషి బానిసగా బతకడానికీ, పైవాళ్ళకి ఊడిగం చేయడానికే ఇష్టపడతాడని అర్థమయ్యింది. తన క్రిందవాడు మేధావి అయితే పైవాడు ఏడ్చి చస్తాడు. వాణ్ని అణగదొక్కాలని చూస్తాడు. తన పైవాడు చవటయినా భజన చేస్తాడు. కాళ్ళు పడతాడు. ఉద్యోగస్తులకు బతుకు భయం తప్ప మరో మాట తెలియదనిపించింది.

ప్రకాశం మరో తరహా మనుషుల్ని కూడా చూశాడు. చాలామంది ఆఫీసును తమ స్వంతానికి ఉపయోగించుకుంటారు. కొందరు బట్టలు దగ్గర నుంచి ట్రాన్సిస్టర్స్ వరకూ ప్రతీ వస్తువూ తోటి వర్కర్స్‌కి అమ్ముతారు. మరికొందరు ఇళ్ల దగ్గర నుంచి డబ్బుతెచ్చి ఆ డబ్బుని వడ్డీకి తిప్పుతారు. ఉద్యోగాలు చేస్తున్న ఆడవాళ్ళ గురించి కూడా ప్రకాశం చాలా విన్నాడు.

ఎందుకిలా జరుగుతోంది? జనం ఎక్కడికి పోతున్నారు? వీళ్లందరూ సంఘాన్ని తమ పాదాలతో ఎవరూ లేపలేనంత లోతుకు ఎందుకు తొక్కిపారేస్తున్నారు.

ప్రకాశానికి తను నిరుద్యోగిగా వున్న రోజులు గుర్తుకు వచ్చాయి. ఎంత అశాంతిగా వున్నా మానసిక క్షోభ, మనుషుల గురించి తపనా వుండేది కాదు అప్పుడు.

ప్రకాశం ఇంటికి వచ్చేసరికి రాఘవ వచ్చి వున్నాడు.

"ఏరా ఎలా వున్నావ్?"

"ఏం చెప్పనన్నయ్యా?"

"శ్రీకాంత్‌కి రాణి గురించి చెప్తానన్నావట."

"ఏం వద్దంటావా?"

"లేదురా చెప్పేద్దాం. ఎందుకంటే దానికి ఉద్యోగం ఎప్పుడు దొరుకుతుందో తెలియదు. రోజూ అది బయట తిరగడం బావుండలేదు. పైగా దానికి ఇప్పుడు నాల్గో నెల."

"అలానా?"

"అందుకే వచ్చాను."

"సరే వెడదాం."

ప్రకాశం, రాఘవా బయలు దేరబోతూంటే కాంతి వచ్చింది. ప్రకాశం కాంతిని రాఘవకి పరిచయం చేశాడు.

"మీరెక్కడికో వెడుతున్నట్టున్నారు."

"పనిమీద బయలుదేరాం."

రాఘవ కాంతిని చూసి "ప్రకాశం! నువ్వు ముషీరాబాద్ వచ్చెయ్. నీ కోసం నేను ఎదురు చూస్తూంటాను" అన్నాడు.

ప్రకాశం సరేనన్నాడు. రాఘవ వెళ్ళడం చూసి కాంతి తన బేగ్‌లోంచి శుభలేఖ యిచ్చింది. పకాశం శుభలేఖ చదివి కాంతిని చూస్తూ—

"పెళ్ళికొడుకు నచ్చాడా?" అనడిగాడు.

"పర్వాలేదు."

"అంటే ఇంటర్వ్యూ చేశారా?"

"లేదు. ఆయన గురించి లోగడే విన్నాను. అందుకని కొంచెం ధైర్యం వచ్చింది. ఒప్పుకున్నాను."

"బావుంది."

"ఇంకేం చెప్పేది లేదా?"

"మనం చాలాసార్లుమాట్లాడుకున్నాం. చర్విత చర్వణం అయితే బోర్ కొడుతుంది"

"నేను మీకో కానుక ఇవ్వాలని వచ్చాను."

"కానుకా!? దేనికీ"

"దేనికని అడగకండి. మా కంపెనీ బాగు పడ్డాలనీ, అది బాగుపడాలంటే మీ లాంటి వ్యక్తులు దాంట్లో పనిచేయాలనే ఉద్దేశంతో. ఇదిగో" అంటూ ఓ కట్ట అతని ముందు పడవేసింది.

ప్రకాశం ఆ కట్టలోంచి ఓ వుత్తరం తీసి చదివాడు.

"ఇదేమిటి! నాకేం అర్థంకావడంలేదు"

"నాకు పెళ్ళి అయిందంటే నేనీ ఊరు నుంచి వెళ్ళిపోవల్సి వుంటుంది. నేను వెళ్ళానంటే మా నాన్న మళ్ళీ విశ్వరూప సందర్శనం చేయచ్చు. ఆయన మిమ్మల్ని పొమ్మన్న రోజు ఈ రామబాణాల్ని వదలండి చాలు."

"మీకు...?"

"నాకు..."

"చాలా సాహసం చేస్తున్నారు. అందులో గృహిణి కాబోతూ."

"మంచివాళ్ళ కోసం ప్రాణాలు అర్పించే వాళ్ళు పుట్టిన దేశంట ఇది. ఆ మాట అటుంచండి. ఓ స్నేహితుడి కోసం చేసే ఈ తెగింపు గొప్పదేం అవదు. చాలా మామూలు పని"

"నేనేమనాలో తెలియడంలా."

"మీరు ఎప్పటికీ ఇప్పటిలానే వుండండి. మన చుట్టూ జనం మంచి వాళ్ళకి బంగారు పంజరాలూ, బంగారు బోనులూ తయారుచేసి పెట్టారు. హృదయం విప్పి మాట్లాడేవాళ్ళు, హృదయం నిండుగా ప్రేమించేవాళ్ళు, నిష్కల్మషంగా బతికే వాళ్లు, నిటారుగా చూసేవాళ్ళు అరుదై పోతున్నారు. అరవై కోట్ల అసమర్థుల్లో కనీసం ఆరుకోట్ల సమర్థులున్నా చాలు ఈ దేశం బాగు పడుతుంది.

"ఆవేశం... కాంతీ...ఆవేశం ..." ప్రకాశం నవ్వుతూ అన్నాడు.

"నా పేరే కాంతి..."

"హేట్సాఫ్"

కాంతి గుమ్మం దిగింది.

* * *

ప్రకాశం తనకి ఉద్యోగం వచ్చినట్టు ఇంటికీ, సీతకీ, పద్మావతికి రాశాడు సీతకి రాస్తూంటే ఎందుకో మనసంతా ఆవేశంతో నిండిపోయింది. పరిచయస్తురాలు ఆత్మీయురాలిగా మారి నాలుగేళ్ళయ్యింది. ఆ ఆత్మీయత అనుబంధం కావాలంటే ఏం చెయ్యాలో రాశాడు.

"నిరుద్యోగికి పిల్లనివ్వనన్న మీ నాన్నగారు ఈ దెబ్బతో మెట్టు దిగి

 

వసారు. నువ్వు నాదానివి అవ్వాలంటే ధైర్యం చెయ్యి. మీ నాన్నతో చెప్పు. భుజం మీద పెద్దాపురం సిల్కు కండువా కప్పి, చేతికి కర్రయిచ్చి మా ఇంటికి తోలు. ఈ సంబంధం కాక వేరే సంబంధం చూస్తే ఇంట్లోంచి పారిపోతానను, నూతులో దూకుతానను. ఎండ్రిన్ తాగిన వాళ్ళ కథలు చెప్పు. నీ నుంచి శుభవార్త అందుకుంటానని ఆశిస్తున్నాను" అంటూ ఉత్తరం పూర్తిచేశాడు. ప్రకాశం పద్మావతికి రాసిన ఉత్తరంలో నిరుద్యోగ పర్వం దాటిన బ్రతుకు గురించి గర్వంగా కవిత్వం అల్లాడు. "నా పెళ్ళికి నువ్వు రావాలిసుమా! నువ్వు రాకుండా నా పెళ్ళి జరిగితే అది చప్పగా వుంటుంది" అంటూ.

వెంట వెంటనే జవాబులూ వచ్చాయి. తండ్రి ఉద్యోగం దొరికినందుకు తల్లీ, తనూ ఎంతగా సంతోషించిందీ రాసి 'ఓ సారి తిరుపతి వెళ్లిరా' అంటూ హెచ్చరించాడు. ఆఖర్న మరో నాలుగు మాటలు కూడా రాసాడు.. "నీకు పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. దశరథంగారు మొన్న మనింటికి భార్యతో కలిసి వచ్చాడు. వాళ్ళమ్మాయి సీతని పెళ్ళి చూపులకు చూసుకుందుకు ఆహ్వానించారు. దశరథంగారి సంబంధం అన్ని విధాలా మంచిదే! ఆయన కట్నం కూడా బాగానే యివ్వొచ్చు! నీకు వీలైతే ఓ వారం రోజులు శెలవు పెట్టిరా. అమ్మ నీ కోసం బెంగ పెట్టుకుంది..."

ప్రకాశానికి తండ్రి ఉత్తరం నవ్వు తెప్పించింది. నిజమే! శెలవు పెట్టి ఇంటికి వెళ్ళాల్సిందే! కానీ చేరిన నెలలోనే శెలవు పెట్టాలంటే ఎలా కుదురుతుంది. పైగా సీత దగ్గర నుంచి జవాబు రావాలి. అదొక్కటే కాదు.. కాంతి పెళ్ళి మరో పదిహేను రోజుల్లో జరుగుతుంది. తనకి అన్నివిధాల సహాయపడిన స్నేహితురాలు...

ఆమె సంతోషం కళ్ళారా చూడాలి. అది కూడా కాదు. రాణి గురించి శ్రీకాంత్‌తో చెప్పాలి. రాణి పెళ్ళికాదన్న భయంతో రాఘవ అన్నయ్యా, విశాల వదినా తీసుకున్న నిర్ణయం గురించి శ్రీకాంత్ మనసు చిట్లకుండా నచ్చజెప్పాలి. ఈ విషయంలో సరోజ సహాయం తీసుకోవాలి. ప్రకాశం ఆలోచనలు ఆపి బట్టలు వేసుకుని శ్రీకాంత్ ఇంటికి సనత్‌నగర్ వెళ్ళాడు. ప్రకాశం వెళ్ళేటప్పటికి ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళి "శ్రీకాంత్" అంటూ పిల్చాడు.

"ఎవరూ?" అంటూ లోపలి నుంచి సరోజ వచ్చింది. టేబిల్ దగ్గర నుంచున్న ప్రకాశాన్ని చూసి "మీరా" అంది ఆశ్చర్యంగా.

"ఏమిటి అలా ఆశ్చర్యపోతున్నారు?" అన్నాడు.

"అలా కూర్చోండి.. ఇప్పుడే వస్తాను" లోపలికి వెళ్ళబోయింది సరోజ

"నా గురించేం చేయకండి"

"కలిపిన కాఫీ వుంది... శ్రమ అల్లా గ్లాసులో పోయడమే" లోపలికి వెళ్ళింది సరోజ. ప్రకాశం ఫేము కుర్చీలో కూచ్చున్నాడు.

సరోజ కాఫీ తీసుకు వచ్చి ప్రకాశానికి ఇచ్చింది.

"శ్రీకాంత్ ఇంట్లో లేడా? మీ పెద్దన్నయ్యా, వదినగారూ కనబడరేం?"



"అందరూ యుద్ధానికి వెళ్ళారు!"

"యుద్ధానికా ? ఎవరి మీద.."

"మీ ఇంటి మీదే యుద్ధం.."

"ఎందుకూ?" ఆశ్చర్యపోయాడు.

సరోజ ప్రకాశాన్ని సూటిగా చూస్తూ అంది. "రాణి ఉద్యోగం చేయడంలేదనీ మీరంతా కలిసి అబద్ధం చెప్పి ఆ అమ్మాయికి పెళ్ళి చేశారనీ తెలిసింది.."

"అయితే..."

"అయితే ఏమిటండీ! అందుకే యుద్ధం"

ప్రకాశం క్షణం మాట్లాడలేదు. ఆ పైన నెమ్మదిగా అన్నాడు "నేనెందుకు వచ్చానో తెలుసా" అని.

"మీరయితే చెప్పలేదు. నా కయితే మనసుల్ని చదవడం తెలియదు.."

"రాణి ఉద్యోగం చేయడం లేదనీ, మా చెల్లాయికి పెళ్ళికావడం కోసం అబద్ధం ఆడామనీ, అ ద ం తా చెప్పడానికే వచ్చాను.."

"అలానా"

"ఏం మీరు నమ్మడం లేదా ?"

"నా నమ్మకంతో పని ఎవరికిలెండి"

"నేను నిజం చెప్తున్నాను.రాణికి పెళ్ళి కాదని భయపడి మా శారద ఈ సలహా యిచ్చింది. ఆ రోజు నుంచి పాపం దాని ఉద్యోగం కోసం తిప్పలు పడుతూనే వున్నాం. దొరకలా"

"నా బాధ అదికాదండీ! రాణి ఎంత బాధ పడుతూ ఇక్కడి నుంచి వెళ్ళిందో మీకు తెలియదు. ఉద్యోగం పోవడంకాదు నిరుద్యోగి వదిన్ని చెడిన మనిషిలా మా వదిన తిట్టడం ఛా ఛా..."

"ఏం చేద్దాం అంటారు ?" ప్రకాశం ఆతృతగా అడిగాడు.

"మీరూ కాలనీకి బయలుదేరండి. మిమ్మల్ని చూస్తైనా మా అన్నయ్యా, వదిన శాంతిస్తారేమో"

"మీరు..."

"మీరు రమ్మంటే వస్తాను."

"అయితే బయలుదేరండి."

ఇద్దరూ ఐ. డి.పి.యల్ కాలనీకి వెళ్ళేసరికి ఇంట్లో యుద్ధ వాతావరణం కన్పిస్తూనే వుంది. టేబిల్ మీద ప్లేటుల్లో టిఫిన్లు, గ్లాసుల్లో కాఫీలూ నిరాశగా కన్పిస్తున్నాయి. మనుషులు మాట్లాడుకోకుండా, ఒకళ్ళనొకళ్ళు చూసుకోకుండా మౌన ముద్రలో వున్నారు. వాళ్ళకి మూడో కన్ను లేదుగానీ లేకపోతే ఒకళ్ళ నొకళ్ళు దహించేసుకునే వారే!

"అదిగో అసలు మనిషి వచ్చాడు" అంది రమణిగారు కోపంగా.

"ఏం పెద్ద మనిషివయ్యా! వీళ్ళతో కలిసి నువ్వు అబద్ధం చెబుతావా ? పిల్ల పెళ్ళికోసం ఇలా అబద్ధాలాడి ఉద్యోగం వుందని ఆ పిల్లని పొద్దున్నుంచి సాయంకాలం వరకూ రోడ్ల మీద తిప్పుతారా?"

ప్రకాశం నెమ్మదిగా అన్నాడు.

"మేం చేసిన మోసంతో పాటు మీకు కొన్ని నిజాలు కూడా తెలుసుండాలి. మరీ దారుణంగా మాట్లాడి మీ ఇంటి కోడల్ని అవమానించుకోకండి."

"మీరే మమ్మల్ని వంచించారు. దగా చేశారు."

"అవునండీ! మా రాణికి ఇరవై ఏళ్ళు దాటాయి. డిగ్రీవుంది. సుమారు అందం వుంది. ఈ అర్హతలతో దాని పెళ్ళి... కావడం లేదు. లక్షలు కట్నం ప్రతీ ఆడ పిల్ల తండ్రి యివ్వలేడు. మీ శ్రీమతి గారు కూడా లక్షల ఆస్తీ, గెజిటెడ్ ఆఫీసరు ఉద్యోగంతో మీ ఇంటికి వచ్చారనుకోను. వెతికిన ప్రతీ పెళ్ళికొడుకు




వేల వరాలు వంచల అగ్ని పరీక్షలు పెడుతూంటే మేం ఏం చెయ్యాలి?

ఆడపిల్లకి ఉద్యోగం అన్నది ప్రభుత్వం చూపించవల్సిన ఉపాధి ... ఇదో సాంఘిక సమస్య. దీంతో మీరు ఆడపిల్ల పెళ్ళిళ్ళకు ముడిపెడితే ఎలా చెప్పండి. న్యాయమేనా? రేపు మీ అమ్మాయికి కూడా పెళ్ళి చెయ్యాలి గదా. ఉద్యోగం ఒక్కటే కాదు, జీతం వెయ్యిరూపాయలకు తక్కువ అయితే పెళ్ళి మాట ఎత్తద్దంటే మీరేమవుతారు? మీకు మనసు వుంటే అది అంటుకుని యిల్లంతా మంటలు రేపితే మీరేమవుతారు? రాణి గురించి మీకు నిజం చెప్పాలని ఈ మధ్యే అనుకున్నాం"

"మాకు తెలిసిన తర్వాతా?"

"మీరలా అనుకోవటం సహజం. ఈ నాటకం ఆడ్డంలో సాధక బాధకాలు మాకూ తెలిసొచ్చాయి. పైగా రాణి గర్భవతి... శ్రీకాంత్ లాంటి వాడితో నిజం చెప్పడం మంచిదని మాకూ అన్పించింది''

ప్రకాశం అలా ఓ గంట షణ్ముఖరావునీ, రమణినీ గుక్క తిప్పుకోనివ్వకుండా మాట్లాడి ఆఖర్న అన్నాడు-

"రాణి పిల్లని ఎతుకునీ, ఆ పైన ఉద్యోగం సంపాదించీ మీ ఇంటికి వస్తుంది."

రమణి కోపంగా అంది...

"మా యింటికి రానఖ్ఖరలేదు... మీ ఇంట్లోనే వుంచుకోండి. ఇలాంటి వాళ్ళు కాపరాలకు పనికిరారు."

''తప్పమ్మా'' లలితమ్మ గారు వారించారు."

"విడాకులు తీసుకుంటాడు మా మరిది."

"వదినా" సరోజ అరిచింది.

"నువ్వేమిటి మధ్య." రమణి విసుగ్గా అంది.

"ఇది శ్రీకాంత్ అన్నయ్యకూ, రాణికీ సంబంధించిన సమస్య. వాళ్ళనే ఓ నిర్ణయానికి రమ్మనడం మంచిది. మన అభిప్రాయాలను వాళ్ళమీద రుద్దద్దు."

"నువ్వు నోర్మూయ్." షణ్ముఖరావు అన్నాడు.

"ప్రకాశం గారు చెప్పింది న్యాయం అన్నయ్యా! మనం మొండి పట్టుదల పడితే వాళ్ళు గత్యంతరం లేక చిన్న నాటకం ఆడారు. ఇందులో కొంపలు మునిగే దారుణం ఏం లేదు - మనం కక్షలు కావాలని పెంచుకుంటే తప్పు."

"నీ కెందుకూ?" రమణి అరిచింది.

"చిన్నపిల్ల అయినా సరోజ చెప్పింది బావుంది" అన్నారు విశాల, లలితమ్మ గారు కూడా.

ప్రకాశం లోపలికి వెళ్ళి శ్రీకాంత్ దగ్గర కూర్చున్నాడు.

సరోజ లోపలికి వెళ్ళి కన్నీళ్ళతో మొహం వాచివున్న రాణిని అక్కడికి తీసుకు వచ్చింది. ఆపైన సరోజ అంది-

"చిన్నన్నయ్యా! నువ్వూ చిన్న వదినా మాట్లాడుకోండి. ఆ పైన మీ కేమనిపిస్తే అలా చెయ్యండి. ఒకళ్ళని ఉద్ధరించడం కోసం మీరేం చెయ్యానవసరం లేదు. వదిన నేరం చేసింది. అంతవరకే, కానీ అది ఘోరం కాదు. రాణిని క్షమించి మంచి భరగా కీర్తి తెచ్చుకుంటే ఆ గొప్ప నీకే మిగులుతుంది. ఛకు మగవాడిలా భార్యని శిక్షించి మీజాతి గౌరవాన్ని నిలబెడతావో నీ ఇష్టం. పదండి.. వెడదాం."

రాఘవ విశాల షణ్ముఖరావు రమణి మెట్లు దిగి క్రిందికి వచ్చారు. లలితమ్మ

బాల్కనీలో కూర్చుని కళ్ళు వత్తుకుంటోంది.

"మేం వెడతాం." అంది సరోజ.

ప్రకాశం గుర్తుగా అన్నాడు.

"వచ్చే ఆదివారం కాంతి పెళ్ళి.



అక్కడ కలుద్దాం"

సరోజ సంతోషంగా అంది. "అష్ట సందోయ్! ఆదివారం కాంతి పప్పన్నం పెడతానంది" ప్రకాశం నవ్వేశాడు.

* * *

కాంతి పెళ్ళి ఘనంగా జరిగింది.

శ్రీనివాసరావుగారి హోదా, పలుకుబడి ఆ పెళ్ళికి పెద్ద హంగుగా నిలిచాయి. నగరంలో వున్న ప్రముఖులెందరో పెళ్ళికి వచ్చారు. శ్రీనివాసరావు ఫ్యాక్టరీ వర్కర్లందరికీ డిన్నర్ ఇచ్చి ఊళ్ళో పెద్దలకు వేరే బ్రహ్మాండమైన రిసెప్షన్ ఏర్పాటు చేశాడు. బహుమతులతో వేదిక నిండిపోయింది.



ఫ్యాక్టరీలో పనిచేసే పెద్ద ఉద్యోగస్తు లంతా శ్రీనివాసరావుగారి వెనక వుండి సహాయ పడ్డారు.

ప్రకాశం మాత్రం చొరవగా తిరగ లేకపోయాడు. నిజానికి శ్రీనివాసరావు గారు కూడా ప్రకాశానికి ఏ పనీ చెప్ప లేదు. తన కింది వాళ్ళతో ఆప్యాయంగా మాట్లాడే శ్రీనివాసరావుగారు తనతో ముభావంగా వుండడం ప్రకాశానికి ఆశ్చర్యం కల్గించలేదు.

ప్రకాశం పెళ్ళికి మాత్రం వెళ్ళాడు.

పెళ్ళిలో సరోజ ప్రకాశాన్ని చూసి పలకరించింది.

"కాంతి మీరు పెళ్లికి వచ్చారో లేదో చూడమంది."

"వచ్చానని చెప్పండి" అన్నాడు ప్రకాశం.

"నాలుగు రోజుల్లో కాంతి అత్తవారి వూరు బొంబాయి వెళ్ళిపోతుందట."

"న్యాయమే కదా!" అన్నాడు నవ్వుతూ ప్రకాశం.

కాంతి అత్తవారి వూరు వెళ్ళే రోజు ప్రకాశం స్టేషన్‌కి వెళ్ళి వీడ్కోలు చెప్పా లనుకున్నాడు. కానీ ఎందుకో ఆ పనీ చేయలేకపోయాడు. ఓ మంచి స్నేహి తురాలు, అన్నం పెట్టిన ఆత్మీయురాల్ని కూడా తను కల్సుకోలేదు. యజమాని శ్రీనివాసరావుగారి మనసు నొప్పించడం మంచిదికాదు. పైగా శ్రీనివాసరావుకు యిచ్చిన మాట ప్రకాశానికి గుర్తుంది.

కాంతి అత్తవారింటికి వెళ్ళిన పది పన్నెండు రోజులకు ప్రకాశానికి సీత దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

"నీ ఉత్తరం అందించిన సలహా ప్రకారం నేను మా నాన్నతో నా వుద్దేశం చెప్పాను. మీ నాన్నగారితో నాన్నా, అమ్మా వెళ్ళి మాట్లాడారు. నీ రాకకోసం ఎదురుచూస్తున్నా" అనేది దాని సారాంశం.

ప్రకాశానికి వెర్రి ఆనందం కల్గింది. జీవితంలో కోరుకున్నవి రెండే రెండు. ఉద్యోగం సంపాదించి స్వంత కాళ్ళమీద నిలబడ్డం, నచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకోవడం. ఆ మర్నాడు తండ్రి దగ్గర నుంచి ప్రకాశానికి పెళ్ళి చూపులకు రమ్మనమని ఉత్తరం వచ్చింది ఐ.డి. పి. యల్. కాలనీకి వెళ్లి అన్నగారితో, పిన్నితో చెప్పాడు. రాఘవ, విశాలా సంతోషం వ్యక్తం చేశారు.

"అసలు నేనొచ్చింది మరో పనిమీద ఇంతకీ శ్రీకాంత్ ఏమన్నాడు?" అనడిగాడు ప్రకాశం.

"పది రోజుల తర్వాత ఈవేళే ఇటు వచ్చాడు. లోపల రాణితో మాట్లాడు తున్నాడు"

ప్రకాశం "బావగారూ" అంటూ ఒక్క కేక పెట్టాడు.

శ్రీకాంత్ లోపలినుంచి "నమస్తే" అంటూ వచ్చాడు.

"మిమ్మల్ని మళ్ళీ కలవలేకపోయాను. క్షమించాలి" అన్నాడు ప్రకాశం.

"అదేంలేదు. నేనే మీ రూమ్‌కి వద్దా మనుకున్నాను"

"ఇంతకీ రాణిని క్షమించారా?" ప్రకాశం నెమ్మదిగా అడిగాడు.

"నేను ఆలోచించాను. పెళ్ళికిముందు మేం ఇలాంటి షరతులు పెట్టిన మూలం గానే ఈ రభస జరిగింది. ఒక విధంగా రాణీ, మీరూ చేసిన పని మంచిదే"

"రాణీ!" అంటూ లలితమ్మగారు కేక వేసింది.

"బావున్నావా అన్నయ్యా?"




"నేను బాగానే వున్నాను. మీ సంగతి చెప్పు"

"మేం రాజీ పడ్డాం"

ప్రకాశం శ్రీకాంత్‌తో అన్నాడు. "ఇలాంటివి ఎక్కడా, ఎవరింట్లోనూ జర గవు. కాలం, పరిస్థితులూ మారుతూంటే మనుషులు కొత్తదారులువెదుక్కుంటారు. విషానికి విరుగుడు వుందంటారు. మనం కావాలని మన ఆదర్శాలకు సంకెళ్ళు వేసుకుని, కళ్ళకు గంతలు కట్టుకుంటే వాటివల్ల నష్టపడేవాళ్ళు ఎల్ల కాలం సహించలేరు. కష్టపడే వాళ్ళు కన్నీళ్లు కారుస్తూ వున్నప్పుడే రొటీన్‌గా కన్నీటి సముద్రాలు పుడతాయి. ఏ నేరం లేకుండా శిక్ష అనుభవించమన్న ప్పుడు ఈ తిరుగుబాటు తప్పదు. అది ఆడవాళ్ళు కానియ్యండి, మగవాళ్ళు కాని య్యండి ఎవరు చేసినా అది మంచి మార్పే అవుతుంది. అవునా శ్రీకాంత్!?"

"మీరు చెప్పింది నిజం."

"మేం తొందరపాటుతో రాణి భవిష్య త్‌ను అంధకారమయం చేయలేదని నువ్వు గ్రహించావు చాలు."

ప్రకాశం ఓ గంట కబుర్లు చెప్పి ఐతల్‌వాడీకి వెళ్ళేసరికి పద్మ వుత్తరం గదిలో పడివుంది.

"ప్రకాశం"

నువ్వు చేస్తూన్న ఎడ్వెంచర్స్ చూస్తూంటే నువ్వు మామూలు మనిషిగా కాకుండా ఎదిగే మనిషిగా కన్పిస్తున్నావ్ నాకు. అయితే పెళ్లి ఎప్పుడు. నీ చిన్ననాటి స్నేహితురాలు సీతని మర్చి పోలేదంటే నాకు చాలా ఆనందంగా వుంది. చిన్నప్పుడు కలిసి తిరిగిన మనుషులూ, ఆ వాతావరణం మనసుమీద పెద్ద ముద్రే వేస్తాయి. చిన్నప్పటి స్నేహితుల్లాంటి మనుషులు మనం ఎంత దూరం వెళ్లి వెదికినా కనబడరు. ఎదిగిన తర్వాత ఎదురయ్యే మనుషులందరూ పరిచయస్తులుగానే వుంటారుట. నిజం. మరోమాట. నేనువచ్చే నెలలో హైదరాబాద్ వస్తున్నాను. ఉస్మానియా యూనివర్శిటీలో మా కేంప్ వుంది. పదిహేను రోజులు అక్కడే వుంటాను. అక్కడకు వచ్చిన తర్వాత నీకో మంచి వార్త చెబుతాను.

—పద్మావతి."

ప్రకాశం ఒకటికి పదిసార్లు ఆ ఉత్తరం చదువుకున్నాడు. పెట్టె తెరిచి సీత ఉత్తరం చదివాడు.

నిజమే! పద్మావతి రాసింది అక్షరాలా నిజం. సీతని మించిన అందగత్తెల్ని తను ఎంతోమందిని చూశాడు హైదరాబాద్‌లో! కానీ వాళ్ళెవరూ కూడా సీతకన్నా అంద గత్తెలుగా కనబడలేదు. ఆప్తులుగా అని పించలేదు.




ప్రకాశం హోటల్‌కి వెళ్ళి భోజనం చేసి వచ్చేసరికి ఆఫీసు ప్యూన్ రాములు గుమ్మం ముందు కూర్చుని కనిపించాడు.

"ఏం రాములూ ఇట్లా వచ్చావ్?" గది తాళం తెరుస్తూ అడిగాడు.

"మీ గురించేనయ్యా"

"నా గురించా?"

"అవునండీ! పెద్ద అయ్యగారు మిమ్మల్ని కూడా తీసుకురమ్మన్నారండి"

"నన్నా! ఎందుకు?"

"నాకు తెలవదయ్యా"

ప్రకాశం ఆలోచన కాంతి మీదకి పోయింది.

"అమ్మాయిగారు బొంబాయి నుంచి వచ్చారా"

"లేదయ్యా!"

"సరే పద" అంటూ ప్రకాశం రూంకి తాళం వేసి అశోక్‌నగర్‌కి బయలు దేరాడు. ప్రకాశం శ్రీనివాసరావుగారి ఇంట్లోకి వెళ్ళాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. డ్రాయింగ్ రూమ్‌లో డిమ్‌లైట్ వెలుగుతోంది. సోఫాలన్నీ సిల్కుబట్టలు కట్టుకుని కబుర్లాడుకుంటూన్న వయసు కాని ఆడవాళ్ళలా కన్పించాయి. అయిదు నిమిషాల్లో శ్రీనివాసరావుగారు లోపలి నుండి వచ్చారు.

"నమస్తే" అన్నాడు ప్రకాశం నమ్రతగా లేచి.

"కూర్చో"

ప్రకాశం కూర్చున్నాడు.

శ్రీనివాసరావుగారు రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చుని పేపర్ వెయిట్ చేతిలోకి తీసుకున్నాడు. తర్వాత దాన్ని టేబిల్ మీద పెట్టి బాల్ పెన్ స్టాండ్‌లోంచి తీసి పెన్ను తిప్పి టేబిల్ క్లాత్ మీద రాశాడు.

"ఏం లేదు" అన్నాడు.

ప్రకాశానికి ఆ ఉపోద్ఘాతం అర్థం కాలేదు.

"ఏం లేకపోతే కబురు చేసేవారు కాదేమో ?"

"కరెక్ట్‌గానే ఊహించావ్"

"అయితే చెప్పండి"

"నువ్వు కాంతిని మధ్యపెట్టి తద్వారా నా కంపెనీలో ఉద్యోగం సంపాదించావ్. కాంతి పెళ్ళి ఆదుర్దాలో నీకు ఉద్యోగం యిచ్చాను."

"అవన్నీ ఎందుకు లెండి."

"గతం మర్చి పోవడం మంచి లక్షణం కాదు. పైగా నా కంపెనీ సరిగా నడవాలంటే నాకు దాని భవిష్యత్‌తో పాటు గతం కూడా చాలా అవసరం."

"చెప్పండి."

"నేను నాకుగా ఎంతోమంది అనాథలకు ఉద్యోగం ఇచ్చాను. స్నేహితుల మొహమాటంతో మరికొంత మందికి ఆశ్రయమిచ్చాను. కానీ భయపడి ఉద్యోగం యిచ్చింది నీకు ఒక్కడికే"

"నేనా విషయం అప్పుడే మర్చి పోయాను సార్! మీరు నన్ను చూసి భయపడవల్సినంత గొప్పవాణ్ణి కాదు నేను"

"అదిగో నీ 'ఎగో' తో నన్ను రెచ్చగొట్టకు. అలా మాట్లాడితే కోపం" శ్రీనివాసవురావుగారు విసుగ్గా అన్నారు.

ప్రకాశానికి శ్రీనివాసరావుగారి ధోరణి అర్థం కాలేదు.

"నేను వేరే ఉద్దేశంతో అనలేదు."

"నీ ఉద్దేశాలు నాకు అనవసరం. నేను నిన్ను పిల్చింది...నిన్ను రేపటి నుంచి ఉద్యోగంలోంచి తీసేస్తున్నానని చెప్ప డానికి. తెలిసిందా?"

ప్రకాశం ఆశ్చర్యపోయాడు. ప్రకాశానికి ఆయన రింగ్ మేస్టర్‌లా కన్పించాడు. పులులతో, సింహాలతో, సాధు జంతువులతో సర్కస్‌లో వాటితో పాటు తనూ ఆడతాడు రింగు మేస్టర్. ఆట

 

అయిన తర్వాత తను వేరే మనిషిగా మారి ఆటాడిన జంతువులను బోనులోకి తోసాడు.

"నా మాట వినండి. ఉద్యోగాలు రకరకాలుగా సంపాదించేవాళ్ళు ఉన్నారు. కానీ నేను కాంతి ద్వారా ఓ స్నేహితుడిగా మిమ్మల్ని ఉద్యోగం అడగొచ్చు అనుకున్నాను గానీ పరిస్థితులు అలా మారతాయని అనుకోలేదు. మీ అమ్మాయి నన్ను మంచి స్నేహితుడను కుని మీతో కూడా నా గురించి ఘర్షణ పడింది. కాంతిని మోసగించి - ఆపైన మిమ్మల్ని బెదిరించి నేను ఉద్యోగం సంపాదించలేదు"

"అదంతా నాకనవసరం. మర్యాదగా నీ అంతట నువ్వు రిజైన్ చెయ్యి, లేక పోతే...."

"మీరు డిస్మిస్ చేస్తారు. అలా గాకుండా నాకో అవకాశం ఇస్తున్నారన్న మాట."

శ్రీనివాసరావుగారు మాట్లాడలేదు.

"నేను వెడతాను" ప్రకాశం లేచాడు.

"వెళ్లు. కానీ నాకు జవాబు చెప్పి వెళ్ళు."

ప్రకాశం ఓ క్షణం ఆలోచించి అన్నాడు.

"రేపు ఉదయం మిమ్మల్ని కలుస్తాను అప్పుడు చెబుతాను."

శ్రీనివాసరావుగారు కోపంగా అన్నాడు "నువ్వు నాకేం చెప్పద్దు. నేను వినదల్చు కోలేదు."

"మీరు త్వరపడి నన్ను ఉద్యోగం లోంచి తీసేస్తే తరువాత అందుకు బాధ పడవల్సి వుంటుంది. నాకున్న... అదే నా దగ్గర వున్న, తురఫాసు విషయం మీకు తెలియదు."

"తురఫాసు ఏమిటి ?"

"ఈ కంపెనీ ఉన్నంతకాలం, దీనికి మీరు ప్రొప్రయిటర్ అయినంత కాలం మీరు నన్ను ఉద్యోగంలోంచి తీయలేరు."

"నన్ను బెదిరిస్తున్నావా?"

ప్రకాశం పేలవంగా నవ్వేశాడు.

"బెదిరింపు కాదండీ. ఒక విధంగా బ్లాక్‌మెయిల్. మీ పరువునీ, ప్రతిష్ఠనీ ఎల్ల కాలం నా గుప్పెట్లో పెట్టింది కాంతి. ఆరోజు కాంతి ఆ పని చేస్తూంటే నేను వారించాను. 'ఇప్పుడు నాకు అన్పిస్తోంది- నాకన్నా, మీకన్నా కూడా ఎక్కువగా కాంతికి మీ నైజం తెలుసు. ఆ చిన్న మనసులో తండ్రి మీద ఎంత దారుణ మైన అభిప్రాయాలు వుండకపోతే ఆ అమ్మాయి అలాంటి పనిచేస్తుంది?"

శ్రీనివాసరావుగారు విసుగ్గా ప్రకాశాన్ని చూశాడు.

"మీకు అభ్యంతరం లేకపోతే నాతో నా రూమ్‌కి రండి. లేకపోతే మీకు బాగా నమ్మకమున్న మనిషిని పంపండి. మీకు కొన్ని ఉత్తరాలు చూపిస్తాను. అవి కాంతి అప్పుడప్పుడు నాకు రాసిన ప్రేమలేఖలు. వాటిని భద్రంగా నాదగ్గర వుంచమంది. మీరు విశ్వరూప సందర్శనం చూపించిన రోజు వాటిని మీకు చూపించమంది! నిజం శ్రీనివాసరావు గారూ. మీరిలా ప్రవర్తిస్తారని వెనక తారీఖులు వేసి ఆ అమ్మాయి అవన్నీ కల్పించి రాసింది.

తన జీవితానికి నేను అడ్డురానని కాంతికి బాగా తెలుసు. కానీ మీరు నా బతుకు మీద గొడ్డలి పెట్టులు పెట్టకుండా కాంతి ఆ పని చేసింది. అవన్నీ కల్పితాలు. కానీ అవి మీ పరువుకు ప్రతిరూపాలు.

"నో, నో నేను నమ్మను"

"మీ ఇష్టం" ప్రకాశం గది దాటి బయట అడుగు పెట్టబోయాడు.

"ఆగు"

ప్రకాశం ఆగాడు.

"పద నేనూ వస్తాను"

శ్రీనివాసరావుగారు కారు గేరేజ్ లోంచి బయటకు తీసి ప్రకాశాన్ని ఎక్కమన్నట్టు సౌంజ్ఞ చేశాడు.

ప్రకాశం విఠల్‌వాడిలో సందులోకి కారు పోనివ్వమని చెప్పాడు. ఓ మేడ పైభాగంలో ప్రకాశం వుంటున్నాడు. అక్కడ కారు ఆగింది.

ప్రకాశం వెనకే శ్రీనివాసరావు లోపలికి వెళ్లాడు. ప్రకాశం మాట్లాడకుండా అల్మైరా దగ్గరకు వెళ్ళి నాలుగైదు ఉత్తరాలుతీసి శ్రీనివాసరావుగారికి యిచ్చాడు.

శ్రీనివాసరావు లైటు వెలుగులో ఆ ఉత్తరాలు చదివాడు. ఆయన కళ్ళలో అలజడి...ఏదో అవమానం.

మౌనంగా మెట్లుదిగి కారు దగ్గరకు నడిచాడు. ప్రకాశం మేడ మీద నుంచి కారు స్టార్ట్ అయి వెళ్ళడం చూశాడు.




ప్రకాశం కళ్ళు తెరిచి చుట్టూ చూశాడు.

కళ్ళు బైర్లు కమ్ముతోన్నట్టయ్యింది. తెల్లటి బట్టల్లో నర్సు వచ్చి-

"ఏమన్నా కావాలా" అంది మృదువుగా.

"నేను..." ఆగిపోయాడు ప్రకాశం.

"మీరేనండి. మీ పేరు ప్రకాశరావు. సరేనా."

"ఇక్కడికి ఎలా వచ్చాను"

"మీ స్నేహితులు గాయాలతో వున్న మిమ్మల్ని తీసుకువచ్చి యిక్కడ జేర్పించారు. మిమ్మల్ని ఎవరు కొట్టారు? చూస్తే మర్యాదస్తుల్లా వున్నారు...."

ప్రకాశానికి లీలగా ఏదో గుర్తుకు వస్తోంది..."

శ్రీనివాసరావుగారితో మాట్లాడి ఉత్తరాలు యిచ్చిన మర్నాడు సాయంకాలం నలుగురైదుగురు వ్యక్తులు వచ్చారు.

తను 'ఎవరు కావాలని' అడిగాడు. వాళ్ళు మాట్లాడలేదు. ఒకడు నీచంగా తిట్టాడు. మరొకడు బూతు మాటలు వాడాడు. తను ఏదో అనబోయాడు.

ఇద్దరు మీదకు దుమికారు. మొహం మీద, పొట్టలో బలమైన గుద్దులు.... అంత వరకూ తెలుసు. కానీ భగ్గున మంట గుండెల్లో పుట్టినట్టు, పదునైన వస్తువు ఛాతి పక్కన దిగడం, చేతికి రక్తం కావడం...అంత వరకే గుర్తు.

ప్రకాశం గుర్తు చేసుకుంటున్నాడు.

"లేవండి. ఇంజక్షన్ యిస్తాను"

"ఈవేళ తారీఖు"

నర్సు చెప్పింది

అంటే...వారం రోజులు అయిందన్నమాట.

"నా గురించి ఎవరూ రాలేదా సిస్టర్!?"

"నాకు తెలుసున్నంతవరకూ రాలేదు."

ప్రకాశానికి కళ్ళవెంట ఎందుకో నీరు తిరిగింది. దిక్కుమాలిన మనిషిలా పలకరింపు కరువై తను చనిపోయేవాడన్న




మాట! తన గురించి ఎవరికైనా ఎలా తెలుస్తుంది? రాఘవ అన్నయ్యా, వదినా ఊళ్ళోలేరు. ఇంటిదగ్గర నుంచి తండ్రి ఉత్తరం రాసి వుండవచ్చు. సీత కూడా రాస్తుంది. వాళ్లకి తన అవస్థ తెలియదు.

"నేనో నెంబర్ ఇస్తాను. కొంచెం ఫోన్‌చేస్తారా—మా బ్రదర్‌కి."

"తప్పకుండా" అంది నర్స్.

ప్రకాశం రాఘవ ఫోన్ నెంబరు చెప్పాడు.

"మీరు రెస్ట్ తీసుకోండి."

"నేనింకా ఎంతకాలం వుండాలిక్కడ?"

"ఒక వారం పడుతుంది."

ప్రకాశం కళ్ళు మూసుకున్నాడు. ఏదో జరిగింది! కాదు అనుకున్నదే జరిగింది! శ్రీనివాసరావుగారు తన మనుషుల ద్వారా తనని కొట్టించారు. ఈ విధంగా పగ చల్లార్చుకున్నారు. కాంతి రాసిన ఉత్తరాలు ఆయనలో వణుకు పుట్టించి వుండాలి. ప్రకాశానికి తన ఉద్యోగం గుర్తొచ్చింది. కొనఊపిరితో వేళ్లాడే ఉద్యోగం ఈపాటికి ఆఖరిదశలో వుండి వుంటుంది తనలాగే! శ్రీనివాస రావుగారు తను బతికినందుకు బాధ పడుతున్నాడో—తనదగ్గర కాంతి రాసిన ఉత్తరాలు కాజేసినందుకు సంతోషిస్తున్నాడో చూడాలనిపించింది.

శ్రీనివాసా ఇండస్ట్రీస్‌కి, తనకీ ఋణం తీరింది.

ప్రకాశానికి మగతతోపాటు నిద్ర ముంచుకొచ్చింది. సాయంకాలం కళ్లు తెరిచేసరికి రాఘవా, విశాలా వచ్చారు.

"ఎలా జరిగింది ప్రకాశం!? నీగురించి కంపెనీకి ఫోన్ చేస్తే డ్యూటీకి రావడం లేదన్నారు. పాలెం వెళ్ళావనుకున్నాం"

ప్రకాశం నవ్వి ఊరుకున్నాడు.

"ప్రకాశాన్ని ఇంటికి తీసుకు వెడదామండీ! మీరు డాక్టరుతో మాట్లాడండి" విశాల అంది.

"అలానే!" అన్నాడు రాఘవ.

"అన్నయ్యా! నా రూమ్‌కి వెళ్ళి ఏమన్నా ఉత్తరాలు వచ్చాయేమో చూడాలి. నాన్నకీ, అమ్మకీ ఈ విషయాలేం రాయద్దు"

"అసలేం జరిగింది?"

"నాకూ తెలియదు అన్నయ్యా!"

రాఘవ డాక్టర్‌తో మాట్లాడాడు.

"ఓ వారం ఇక్కడే వుండనివ్వండి. ఆ తర్వాత డిస్చార్జి చేస్తాం" అన్నాడు.

"అవునురా! కొంచెం దెబ్బలు తగ్గనీ. ఉద్యోగానికేం పరవాలేదు. సెలవు పడేస్తే పోతుంది" రాఘవ నచ్చచెబుతూ అన్నాడు.

"రాణికి కూడా ఫోన్ చేస్తాను. శ్రీకాంత్ వస్తాడు నీకు తోడుగా. కొంచెం కాలక్షేపం అవుతుంది" విశాల అంది.

"సరే" అన్నాడు ప్రకాశం.

రాఘవా, విశాలా వెళ్ళిపోయారు.

* * *

ప్రకాశాన్ని హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ చేశారు రాఘవ బలవంతంగా ప్రకాశాన్ని తనతో పాటు కాలనీకి తీసుకు వెళ్ళాడు.

ప్రకాశానికి విఠల్‌వాడీ వెళ్ళి ఓ సారి ఉత్తరాలేమన్నా వచ్చాయేమో చూసుకోవాలనిపించింది. ఆటోలో రూమ్‌కి వెళ్ళాడు సాయంత్రానికి తిరిగి వస్తానని చెప్పి.

ప్రకాశం రూమ్ తెరిచి చూశాడు. మంచంమీద వేసిన దుప్పటి రక్తపు మరకలతో వుంది. గదంతా చిందర



వందరగా వుంది. ఫ్లాస్క్ పగిలి నేలమీద పడివుంది. సూట్‌కేస్ తెరిచి వుంది. పుస్తకాలన్నీ విరజిమ్మి వున్నాయి.

వాటి మధ్య రెండు ఉత్తరాలు పడి వున్నాయి.

ప్రకాశం ఉత్తరం విప్పాడు.

పది రోజుల్లో పెళ్ళి చూపులు జరుగుతాయి రమ్మని రాశాడు తండ్రి. ప్రకాశం ఉత్తరంలో తారీఖు చూశాడు. ఫరవాలేదు యింకా వారం వుంది. ప్రకాశం రెండో ఉత్తరం విప్పాడు. అది శ్రీనివాసా ఇండస్ట్రీస్ నుంచి వచ్చింది. ప్రకాశం ఆత్రుతగా చదివాడు. ఏవేవో ఆరోపణలు చేసి ఉద్యోగంలోంచి తొలగిస్తూ రాసిన ఉత్తరం. ప్రకాశానికి ఏ బాధా కలగలేదు. శ్రీనివాసరావు గారు చాకచక్యంగా చేసిన ఆఖరి పని తన కడుపు కొట్టి కసి తీర్చుకోవటం. తనీరోజు శ్రీనివాసరావుగారింటికి వెళ్ళలేదు. ఉద్యోగం అర్థించే అవకాశం అంతకన్నా లేదు. ఆ ఇంటి ఛాయలకు గానీ, కంపెనీ ఆవరణ వైపు గానీ వెళ్ళలేదు !

కాంతి ఎంతో దూరదృష్టితో చేసిన ఉపకారం వక్రించింది. కాదు తనే నిజం చెప్పిన మూలంగా బ్రతుకు ఓ అనుకోని మలుపు తీసుకుంది !!

బయట నుంచి ఇంటి యజమాని వచ్చాడు.

"నమస్తే" అన్నాడు ప్రకాశం.

"మీకు..."

"ఆస్పటల్లో పడ్డాను"

"విన్నాను బాబూ"

"ఇప్పుడు కొంచెం ఫరవాలేదు"

"అదికాదు బాబూ! ఈ గది అవసరం పడింది. మా అల్లుడు వస్తున్నాడు..." ఆయన ఆగిపోయాడు.

ప్రకాశం ఇంటాయన మొహం చూశాడు. ఆయన అబద్ధం ఆడుతున్నాడు. ఆయన మాటల వెనక శ్రీనివాసరావుకంఠం,శ్రీనివాసరావు చూపులూ కన్పిస్తున్నాయి.

"ఖాళీ చేస్తానండీ! ఓ నెల టైం ఇవ్వండి చాలు"

''అబ్బే కుదరదు నాయనా"

''నాకు ఉద్యోగం పోయిందని భయ పడకండి. మీ అద్దెకేం లోటు చెయ్యను. నా రూమ్‌లో డబ్బు మీ దయవల్ల జాగ్రత్తగానే వుంది''

''అదికాదు''

''నెల తరువాత నేను కాదంటే చూడండి''

ఇంటి యజమాని విసుక్కుంటూ వెళ్ళిపోయాడు. ప్రకాశం గదంతా సర్దాడు, అంతకు మించి పని కనబడలేదు. ఇల్లు ఊడ్వడం, భోజనం చేయడం, చదవడం యివన్నీ కూడా పనులే!! కానీ ప్రతిఫలం దొరకని పన్లు! మనిషి తన స్వంతానికి ఉపయోగపడే పన్లు చేసే లాభంలేదు. ఎదటి మనిషికి ఉపయోగపడాలి. పరోక్షంగా ఆ పని సంఘానికి, ప్రభుత్వానికి సహాయ పడాలి. అప్పుడే ఆకలి తీరుతుంది! మనిషికి విలువ పెరుగుతుంది.

నిరుద్యోగులందరూ సంఘ బహిష్కృతులు! అంటరాని వాళ్ళు. ప్రజాహిత కార్యక్రమాలు ఎన్ని చెయ్యి- ప్రభుత్వం మనిషి కాలేదు.

ఎంత ఆశ్చర్యం!

ప్రకాశం తిరిగి కాలనీకి వచ్చాడు. అతని కెందుకో ఉద్యోగం పోయిన విషయం రాఘవకి చెప్పాలనిపించలేదు.

"ఇల్లు మారుతున్నాను. ఇంటి యజమాని గది ఖాళీ చెయ్యమన్నాడు."

"అలానా! అయితే కొత్త అడ్రసుతో ఓ లోకల్ కార్డ్ రాసి పడెయ్యి."

"ఓసారి ఇంటికి వెళ్ళి వద్దామనుకుంటున్నాను" చిన్న అబద్ధం చెప్పాడు.

''సరే."

ప్రకాశం రెండు రోజులు రాఘవ ఇంట్లో వుండి విఠల్‌వాడి తిరిగి వచ్చాడు.

సీతకి ఉత్తరం రాయాలి! ఉద్యోగం పోయిన విషయం కూడా రాయాలి! తండ్రికి రాయాలి! సీత తన గురించి ఏమనుకుంటుంది? నిరుత్సాహ పడుతుందా? నిరాశ పడుతుందా? కన్నీరు కారుస్తుందా? ఏమో-సీత ఏం చేసినా, సీతలో ఏ అలజడి రేగినా తనకి తెలిసే అవకాశం లేదు.

ప్రకాశం రెండు ఉత్తరాలూ పూర్తి చేశాడు. ఏదో చెప్పలేని నీర్సం. జేబులు చూసుకున్నాడు. యాభై రూపాయలు. తల్లి గాజులు అమ్మిన డబ్బులో మిగిలినవవి.

ఆ మధ్యాహ్నం శ్రీనివాసా ఇండస్ట్రీస్ వాళ్ళు ఆ నెలలో పనిచేసిన నాలు రోజులకూ జీతం లెక్కకట్టి మనిఆర్డర్ చేశారు.

ప్రకాశానికి ఆ డబ్బు ముట్టుకోబుద్ధి వేయలేదు. న్యాయంగా ఆ డబ్బు తనదని కంపెనీ వాళ్ళ అభిప్రాయం....కాదు అయిష్టంగా తనని ఉద్యోగంలో వుంచిన శ్రీనివాసరావుగారి డబ్బు. రక్తంతో తడిసి చాకుల్లా మెరిసే నోట్లవి.

అందుకే తిప్పి కొట్టాడు.




ప్రకాశం డాబా మీద పడుకున్నాడు. తనలాగే వేలాది నక్షత్రాలు పనిలేక నిద్రరాక జోగడం కన్పించింది. చీకటి! మనసులోలాగే చుట్టూ చీకటి!




ప్రకాశానికి చెప్పుకోదగ్గ పనిలేదు ఉద్యోగం అల్లా ఊరి మీద పడి తిరగడం.

తండ్రికీ, సీతకీ ఉద్యోగం పోయిన విషయం రాసి నాలుగైదు రోజులయ్యింది. ఇంకా జవాబు లేదు. ఉద్యోగం తనకు ఎండమావి అవడం కాకుండా సీతను కూడా ఎడం చేస్తోంది.

ప్రకాశానికి ఓ పక్క విసుగూ, ఉండుండి విరక్తీ కలుగుతోంది. చిన్న చిన్న ప్రయివేటు కంపెనీలకు వెళ్లి ఉద్యోగం కోసం ప్రాథేయపడ్డాడు. ఆఖరికి తార్నాకాలో ఓ కంపెనీకి వెళ్లాడు.

"రోజుకు ఏడు రూపాయలు ఇస్తాం. ఆదివారం పనుండదు. జీతం దొరకదు. ఇష్టమా?"

ప్రకాశం తల ఊపాడు.

"రేపు పనిలో ప్రవేశించండి"

"అలాగే" అన్నాడు.

ప్రకాశం రూమ్‌కి వచ్చేశాడు. తండ్రి ఓదారుస్తూ ఉత్తరం రాస్తాడని ఊహించాడు కవపు చింపుతూ. కానీ తండ్రి నిప్పులు చెరుగుతూ రాశాడు.

ప్రకాశం చదువుకయిన ఖర్చూ, వివరాలూ రాసి "ఉద్యోగం పోయినకాడికి హైదరాబాద్‌లో దేనికి? వెంటనే వచ్చెయ్" అని తీర్పు చెప్పేశాడాయన.

ప్రకాశం మరునాడు రాయల్ ఇండస్ట్రీస్‌లో చేరాడు. వాళ్లు రకరకాల డ్రగ్స్ తయారు చేస్తారు. రోజుకు రెండు వందల కేజీలు తయారవుతుంది. అవి తయారవడానికి ఉపయోగపడే కెమికల్స్ రామెటీరియల్స్ పోగు చేయడం, వాటి లెఖ్ఖలు, ఇతర కంపెనీలతో కరెస్పాండెన్స్, ఎకౌంట్స్ అన్నీ చూడాలి. కంపెనీ యజమాని తెలుగువాడే. పేరు స్వామినాథన్.

ప్రకాశం వారం తరువాత తనచేతి కొచ్చిన జీతం చూసుకున్నాడు. ముప్ఫై లోపు. వారంగా కంపెనీకి రావడానికి, రూమ్‌కు వెళ్ళడానికి, టిఫిన్ ఖర్చులూ లెఖ్ఖ చూశాడు. జీతం రెట్టింపు అయితే వాటిని తట్టుకోవచ్చు. స్వామినాథన్‌తో అదేమాట అన్నాడు.

"నీకు సరిపడా జీతం యివ్వడం నా తరంకాదు" అని తేల్చేశాడాయన. ప్రకాశానికి స్వామినాథన్‌తో వాదన వేసుకో బుద్ధి కాలేదు.

"నీ చదువుకుతగ్గ జీతం కాదని నాకూ తెలుసు. ఓ ఆర్నెల్లు పోనీ చూద్దాం."

ప్రకాశం సరే అన్నాడు. బయటకు వచ్చేసరికి ఓ కార్మికుడు "నమస్తే సార్" అన్నాడు. ప్రకాశం అతన్ని గుర్తు పట్టాడు. వేరే షిఫ్ట్‌లో పనిచేస్తాడు. పేరు వినోద్.

"మీరు కొత్తగా ఉద్యోగంలో చేరారు కదూ?" అన్నాడు వినోద్.

"అవును."

"నేనిక్కడ రెండేళ్లబట్టి పని

చేస్తున్నాను. బి.యస్సీ పాసయ్యాను.''

వినోద్ ప్రకాశాన్ని బలవంతంగా టీస్టాల్‌లోకి తీసుకు వెళ్లాడు. టీ తాగుతోన్నంతసేపు స్వామినాధన్ గురించి చెప్పాడు. స్వామినాధన్ తెలుగువాట్ట. ఆ చుట్టుపక్కల రెండు మూడు ఇండస్ట్రీస్ అతనివేట. ఇన్‌కంటాక్స్ ఎగవేయడం కోసం రకరకాల పేర్లమీద ఒకే రకం కంపెనీలు నడుపుతున్నాట్ట. జీతాలు తగ్గించి యివ్వడం – స్వామినాధన్‌లో వున్న నేర్పుట!

''ఆయన్నని ప్రయోజనం ఏముంది. నిరుద్యోగుల్ని దోచుకోవటం ఆధునిక కళ''

"అలా అని ఊరుకుంటే ఎలా? చాలీ చాలని జీతాలు మనకిచ్చి పీకలోతు వరకూ ఆయన భోంచేస్తున్నాడు.''

ప్రకాశం నవ్వేశాడు. ఎవడైనా ఎంతని తింటాడు. అదంతా వ్యాపార సూత్రం, అంతే.

''రేపు సాయంకాలం రైలుకట్టదగ్గర ఈ చుట్టుపక్కల ఇండస్ట్రీస్‌లో పనిచేసే వాళ్లం మీటింగ్ పెడుతున్నాం. మీరూ రండి''

"అలానే'' అన్నాడు. వినోద్ సంచిలో టిఫిన్ కేరియర్ సర్దుకుని యూనివర్సిటీ రోడ్‌వైపు వెళ్లిపోయాడు.

ప్రకాశం ఇంటికి వెళ్ళేసరికి సీత ఉత్తరం కళ్ల బడింది.

"ప్రకాశం–

ఏం రాయను. ఏం రాస్తే ఈ కన్నీళ్ళకి ఆనకట్ట పడుతుంది? నువ్వు నిరుద్యోగి వయ్యావని తెలిసింది. మనం ఎవ్వరం చదువుకోకుండా ఎలిమెంటరీ స్కూల్‌తో చదువుకు స్వస్తి చెబితే ఎంత బావుండేది. మానాన్న నాకు వేరే సంబంధాలు చూడమని హైదరాబాద్‌లో వున్నవాళ్ల పినతండ్రి కొడుక్కి రాస్తున్నాడు. నువ్వు నిరుద్యోగివవనీ – నువ్వు భార్యని పోషించలేని వాడివవనీ – నాకు భయంలేదు. ఐదు వందలమైళ్ళు దూరం వుంది మనమధ్య! ఈ ఏడాదిలో నేను చూసిన ఎదురు చూపులు, కట్టిన గాలిమేడలు–ఎన్నో!

నేను నీ జవాబు కోసం ఎదురు చూస్తున్నాను. నువ్వు గ్రీన్ సిగ్నల్ యివ్వు. హైదరాబాద్ వచ్చేస్తాను. నాకు నీతులూ, సూక్తులూ రాయకు. ఒంటరిగావున్న నిన్ను అలా హైదరాబాద్‌లో నిరుద్యోగిగా వదిలేయడంనా కిష్టంలేదు. వచ్చే ఆదివారం అంటే పదిరోజుల తర్వాత అదే నాంపల్లి స్టేషనట... అక్కడ నన్ను కల్సుకో. గోదావరిలో వస్తాను. సూర్యుడు పశ్చిమాన ఉదయించనీ, సప్త సముద్రాలు పొంగనీ సీత ఇక ఇక్కడ ఆగేదిలేదు. చూస్తాను. ఈ లోకం నిన్నింకా ఎంత కాలం పీడిస్తుందో! నా డిగ్రీ కూడా తీసుకు వస్తాను. నేను వచ్చిన నెలలో నీకు ఉద్యోగం దొరక్కపోతే దాన్ని నీ డిగ్రీతో జతచేసి ముక్కలు చేసి హుస్సేన్ సాగర్‌లో పారేసి బడ్డీకొట్టు పెట్టుకుందాం. నాకు రకరకాల పిండి వంటలు చేయడం వచ్చు. ఏ కాలేజీ ముందు కొట్టు పెట్టినా మనం చవులూరించే టిఫిన్లతో జనాన్ని వెర్రెత్తించచ్చు. కాఫీ హోటలు పెట్టిన చాలామంది బడ్డీకొట్టుతోనే పైకి ఎదిగారుట! ఆదివారం గుర్తు పెట్టుకో.

—సీత"

ప్రకాశానికి సీత ఉత్తరం ముందు





భయాన్నీ, ఆ తరువాత ఆలోచననీ, ఆఖరిగా ఆనందాన్నీ ఇచ్చింది. అనుకున్నవి ఏవీ జరగలేదు. కానీ ఇప్పుడు అనుకోనిది జరగబోతోంది. జీవితానికి జయపడ్డం అసమర్థుల పని. సీత రావాలి. నీరసించిపోయిన హృదయంలో ధైర్యం నింపుకోవాలంటే తన ఒక్కడివల్లాకాదు. ఏదో తోడు ఉండి తీరాలి. కిరోసిన్ స్టౌవ్ వెలిగించి స్టీలు గ్లాసుడు బియ్యం కడిగి దానిమీద పడేశాడు. తనకి వంట రాదు. అది కూడా బాధాకరంగానే వుంది. వచ్చినవల్లా వేపుడు. నూనెలో వేగిస ముక్కలమీద కారం చల్లితే చాలు తేలిగ్గా కూర రెడీ అయిపోతుంది. ఈ మధ్య ఆమ్లెట్ వేయడం నేర్చుకున్నాడు. కోడి గుడ్డులో దాక్కున్న జీవిని హత్య చేయడం. నిజమే. భ్రూణ హత్యలాంటి దిట! అయినా తప్పదు. తెల్లసొన కడుపులో దాక్కుని ఆపైన పెంకుతో కవచం కప్పుకుని ఈ విశ్వ ప్రవేశం చేయాలని అనుకుంటూ నిద్రపోయే ఆ జీవికి తను ఎవరికో ఆహారం అవుతాననీ, తన బ్రతుకు ఇంతేననీ తెలియదు.

ప్రకాశం భోజనం చేస్తుండగానే వినోద్ తలుపు తట్టాడు.

"లోపలికి రావచ్చు"

వినోద్‌తోపాటు మరో ముగ్గురు వ్యక్తులు వచ్చారు.

"సారీ" అన్నాడు వినోద్.

"ఫరవాలేదు. చెప్పండి ఏమిటి విశేషం"

వినోద్ తన స్నేహితుల్ని పరిచయం చేశాడు.

వాళ్ళు ప్రకాశానికి నమస్కారాలు చేశారు. వినోద్ మాట్లాడ్డానికి ముందు స్నేహితుల మొహాల్లోకీ, ప్రకాశం మొహంలోకీ, ఇంటి పై భాగాన్నీ చూసి మొదలు పెట్టాడు-

"మేం పెద్దగా చదువుకోలేదు. కానీ ఐదారు సంవత్సరాల ఎక్స్‌పీరియన్స్ ఉంది మా అందరికీ"

ప్రకాశం నవ్వేశాడు

వినోద్ మళ్ళీ మొదలు పెట్టాడు-

"మా బ్రతుకులు రోజుకు నాలుగు రూపాయల కూలీతో మొదలయ్యాయి. గొప్ప చెప్పుకోకూడదు గానీ మేం పని చేసేకంపెనీల్లో సూపర్‌వైజర్స్ లేకుండా మేం పని నెట్టుకు పోగలం. కానీ వాళ్ళ జీతాలతో కొలిస్తే మావి చాలా తక్కువ. ఈ కాస్త ఉద్యోగం పోతుందని మేమూ, వీళ్ళెక్కడికిపోతారులేఅని యజమానులూ అనుకోవడంతో ఇంతకాలం గడిచింది. తెగించకపోతే లాభం లేదనిపించింది. ఉద్యోగం పోతే గొడవేం లేదు. ఎందుకంటే ఈ ఆరేడు రూపాయలు ఈ ఊళ్ళో ఎవరైనా యిస్తారు, మా అనుభవాన్ని చూసి. కానీ మేం కిమనకుండా ఉద్యోగం మానేస్తే స్వామినాధన్‌కి చీమ కుట్టినట్టు వుండదు. రోజుకుఏడురూపాయలుఇవ్వవలసిన బాధ తప్పుతుంది. ఐదు రూపాయలు ఇచ్చి కొత్త వాళ్ళని తీసుకుంటాడు. కానీ అలా జరగకూడదండీ! కష్టానికి తగ్గ ప్రతిఫలం కాకపోయినా, కడుపయినా నిండాలికదా! నిజానికి ఆయన స్వంత ఆస్తి అమ్మి ఈ కంపెనీ పెట్టలేదు. గవర్నమెంటు లోన్ ఇచ్చింది."

"అలాగా!?"

"అందుకే రేపు మీటింగ్‌లో సమ్మె ప్రతిపాదన తీసుకువస్తున్నాం. మీరు మాకు అండగా ఉండాలి."

"అంటే..."

"అంటే...మీ సలహా సంప్రదింపులు ఒక్కటే కాదు, మీరు మా యూనియన్‌కి ప్రెసిడెంట్‌గా ఉండాలి. మీరు యం.ఏ. చదువుకున్నారు. మాకు లేబర్ లాస్ అంతగా తెలియవు. మేం బోల్తా పడకుండా కనిపెట్టుకుని వుండండి."

"మీ యూనియన్ ప్రెసిడెంట్‌గా... నేనా?"

"అవును."

"బాగా అనుభవం వున్న వాళ్ళే ఈపని చేయగలరు."

వినోద్ నవ్వేశాడు. "వాళ్ళు ఆ అనుభవంతో మమ్మల్ని మోసం కూడా చెయ్యగలరు కదండీ" ప్రకాశం నవ్వేశాడు.

"ఏమంటారు ?"

"నాకు చేతనయిన సహాయం చేస్తాను. కానీ ఓ విషయం...ఈ పదవి నాకు కట్టబెట్టిన తర్వాత మీరు పొరబాటు చేశామని బాధ పడకూడదు. నా వల్ల నూటికి నూరు పాళ్ళూ మీకు మేలు జరగవచ్చు. జరగక పోవచ్చు. మీకు ఇష్టం లేనప్పుడు నాతో చెప్పెయ్యండి. దూరంగా తప్పుకుంటాను- సరేనా..."

"అలాగేనండీ.. వస్తాం.. రేపు కలుద్దాం.."

ప్రకాశం ఆలోచిస్తున్నాడు...

మనిషి మనిషిని దోచుకుందుకు ఎన్ని కుయుక్తులు, ఎన్ని పన్నాగాలు పన్నుతాడు! అఖండమైన తెలివితేటల్ని జాతి జన అభ్యుదయానికి వినియోగించకుండా, స్వంతాన్ని పెంచుకుందుకు మాత్రమే ఆరాట పడతాడు. ఆ తత్వం మనిషిని మార్చి, రాక్షసుణ్ణి చేస్తుంది. పనిషికీ మనిషికి మధ్య దూరం పెంచి అగాధాల్నీ, అగడ్తల్నీ సృష్టిస్తుంది.

ప్రకాశం ఆలోచనల నుంచి నిద్రలోకి జారిపోయాడు.




వారం రోజులు గడిచాయి.

రాయల్ ఇండస్ట్రీస్‌లో పనిలోకి వెళ్లేముందూ, పనిలోంచి దిగేముందూ 'స్లోగన్స్' విన్పిస్తున్నాయి. ప్రకాశం సామినాధన్ గదిలోకి వెళ్లి వర్కర్స్ యూనియన్ పేర తయారు చేసిన డిమాండ్స్ పత్రాన్ని టేబిల్ మీద పెట్టాడు.

స్వామినాధన్ ప్రకాశాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. కళ్లజోడు ఓసారి తీసి,

"ఏమిటిది" అన్నాడు.

"ఇది డిమాండ్ నోటీస్! దీనికి మీ సమాధానం కావాలి. ఆ సమాధానం నచ్చని పక్షంలో...మీకూ మాకూ రాజీ కుదరని పక్షంలో జరగబోయే తంతు మీకు తెలుసు"

స్వామినాధన్ ఏం మాట్లాడలేదు.

"వస్తాను" ప్రకాశం నాలుగడుగులు వేశాడు.

"మిస్టర్!"

ప్రకాశం వెనక్కి తిరిగాడు.

"ఇలా కూర్చో"

ప్రకాశం కూర్చున్నాడు.

"నువ్వు చదువుకున్న వాడివి. నీ క్వాలిఫికేషన్ చూసి ఉద్యోగం యిచ్చాను"

ప్రకాశం మాట్లాడలేదు.

"నిజాయితీకి ఎక్కడా చోటు లేదు. అన్నం పెట్టిన చేతిని నరకాలని చూడటం మంచిదికాదు..''

''ఈ మాట ఎవరైనా అనొచ్చు. కష్టపడ్డవాడు మట్టికొట్టుకుపోతే నష్ట పడేది అందరూనూ !"

"ఉద్యోగంలో చేరి నెల కాకుండానే ప్రెసిడెంట్ వయ్యావే"

ప్రకాశం నవ్వేశాడు. ''నాకు లేబర్ లాస్ గురించి కొద్దిగా తెలుసు. అదీ పుస్తక విజ్ఞానం. మీరన్నట్టు నేను లీడర్‌ని కాను. వర్కర్లకి, మీకూ మధ్య సామరస్యం చేయడానికి వచ్చానను కోండి"

"కానీ నీ పద్ధతి అలా లేదుగా! ఒక వైపు జనం అలజడి మొదలు పెట్టారు. ఆ తర్వాత నువ్వేమో తీరిగ్గా రాయ బారానికి వచ్చావ్ ? అంటే ఒకరకంగా బెదరించి లొంగదీయాలనే గదా"

"క్షమించండి స్వామినాధన్‌గారూ! అదేంలేదు. మీరూ చదువుకున్నవారు. ప్రస్తుతం లోకరీతి మీకు తెలుసు. 'కొద్ది పాటి చదువు చదివావు కాబట్టి ఈ కొద్ది పాటి జీతంతో చావు, బతుకు–నీ ఇష్టం' అనడానికి ఇది సమయం కాదు. చిన్న కష్టాన్నీ, చిన్న ఇబ్బందినీ యిప్పుడు మనిషి సహేతుకంగా ఆలోచించి కార ణాల్ని వెదికి పట్టుకుంటున్నాడు."

"మధ్యవర్తులు బాగు పడ్డానికే ఈ గొడవలన్నీ ? ఈ పదిహేనేళ్ళలో ఒక్క నిజాయితీ పరుడయిన లేబర్ లీడర్‌ని చూడలేదు. ఎందుకు చెప్తావ్?"

"మీరన్నట్టు లీడర్స్ చెడిపోవడానికి వాళ్ళొకళ్ళే కారణం కాదు. వాళ్ళని జేబులో వేసుకుంటారనీ. లీడర్స్ ద్వారానే కార్మికుల కళ్ళు పొడుస్తారనీ విన్నాను"

"నీకు అన్నీ తెలుసన్న మాట..."

"ఆలోచించండి. మీరూ, మీ వర్కర్స్ రాజీ చేసుకుంటేనే మంచిది.. మీరన్నట్టు లీడర్స్ వద్దు. యూనియన్స్ వద్దు. మధ్య వర్తులు–మీ మధ్య అగాథం సృష్టి జరగ డం, రెచ్చిపోయి ఎందుకూ పనికిరాకుండా పోవడం మీరూ కోరుకోరుగదా !"

"అంటే ఏం చేయమంటావ్?''

"కార్మికుల కోరికలు ఈ వినతి పత్రంలో ఉన్నాయి. అవి ఎంతవరకూ న్యాయ సమ్మతమైనవో ఆలోచించండి''

"ఒకవేళ ఈ ప్రొపోజల్స్‌కి నేను ఒప్పుకోకపోతే?''

"మీరు సద్భావంతో ఆలోచిస్తే ఆ పైన మీరూ, మేమూ కలిసి కూర్చుంటే ఈ ఘర్షణకి మంగళహారతి పాడేయొచ్చు. నా ఆఖరి విన్నపం కూడా ఇదే ! మీరు యజమానిలాగాక మధ్యవర్తులుగా ఆలో చించండి. ఈ కంపెనీ మీది. ఇది బాగు పడేది మీ చాకచక్యం వల్లే. లేబర్ కమీ షన్ ఆఫీసులూ, ఆర్బిట్రేషన్స్, లేబర్ కోర్టులూ యివన్నీ రణభూములని నేను చెప్పనక్కర్లేదు.''

స్వామినాధన్ ఆలోచనలో పడ్డాడు.

"నన్ను మళ్ళీ ఎప్పుడు కలవమం టారు."

"వచ్చే వారం"

"చాలా దూరం పెట్టారు."

"నేనొక్కణ్ణేకాదు, నా భాగస్వాము లున్నారు. వాళ్ళతో మాట్లాడాలిగా మరి''

"వెళ్ళొస్తానండీ"

"యస్!"

ప్రకాశం బయటకు రాగానే వినోద్, తదితరులు చుట్టు ముట్టారు.

*　*　*

రెండు రోజులు గడిచాయి. ప్రకాశానికి తను చేపట్టిన పదవి చాలా పెద్దదనిపించింది. తనకు రాజకీయాలు తెలియవు. జనాన్ని మెస్మరిజం చేయడం తెలియదు. తెల్సిందల్లా నిజం! ఈ ఇండస్ట్రీలో పని చేసేది మొత్తం రెండు వందల మందే. కానీ వాళ్ళిప్పుడు ఆకలి గొన్న పులుల్లా వున్నారు. స్ట్రయిక్ నోటీస్ జారీ చేయడం మంచిది కాదని తను వర్కర్లని ఆపుతున్నాడు. స్నేహ పూర్వకమైన వాతావరణంలో సమస్యలు పరిష్కారం అవుతాయని తన ఆశ. బట్టలు వేసుకుని రూమ్‌కి తాళం వేసి తార్‌నాకా బయలుదేరుతూంటే పోస్ట్‌మన్ వచ్చి రెండు ఉత్తరాలు ఇచ్చాడు. నాల్గురోజుల్లో వస్తున్నాననీ, తండ్రి హైదరాబాద్ బయలుదేరాడనీ, ఆయన రెండు రోజుల్లో తిరిగి ఇంటికి రావచ్చనీ సీత రాసింది. మరొకటి వారణాసి నుంచి పద్మావతి రాసింది. రెండు రోజుల్లో హైదరాబాద్ వస్తున్నాననీ, స్టేషన్‌లో కల్సుకోమనీ.

ప్రకాశం రెండు ఉత్తరాలూ జేబులో పెట్టుకుని అప్పుడే వచ్చిన సిటీ బస్ ఎక్కాడు. గంట తర్వాత తార్‌నాకా చేరు



కున్నాడు. ఆ రోజు ప్రకాశానికి వీక్లీ ఆఫ్. కానీ స్వామినాధన్‌తో మాట్లాడానికి బయలుదేరాడు. సీతా పద్మావతీ వచ్చేలోపున ఈ సమస్య ఓ పరిష్కారానికి వస్తే మంచిదే కాకపోతే మరింత ఆలస్యం అవచ్చు. వినోద్ వల్లనే కాక సీతా, పద్మావతిల వలన కూడా తన బాధ్యతలు పెరుగుతున్నాయి. సీతా, తను ఏకంకావడం వల్ల ఊళ్ళో కొన్ని సమస్యలు ఉత్పన్నమవుతాయి. సీతా వాళ్ళింట్లో గొడవలు జరుగుతాయి. దశరధంగారు కోపాగ్ని జ్వాలలురగుల్చు కుంటూ తనింటి మీద యుద్ధం ప్రకటిసాడు. తన తండ్రి అతన్ని ఎదుర్కోలేడు గనుక రాజీ పడతాడు.

ఆ తరువాత రంగస్థలం తమ ఊరి నుండి హైదరాబాద్‌కు మారుతుంది.

అప్పుడు తను అపరాధి. ఈ జీవిత సమస్యలకు ఎవరు పరిష్కార మార్గం చూపెడతారు? ఏ పెద్దమనిషి రాజీ ప్రయత్నాలు చేసాడు? ఏ లీడర్ మధ్యవర్తిత్వం నెరపుతాడు? ఎవరి సంస్కారం బట్టి, ఎవరి సతువ బట్టి వాళ్ళ వాళ్ళ తీర్పులు వింటూ జీవితాన్ని ఒరుసుకుంటూ జీవించాలి!

ప్రకాశం ఆఫీసుకు వెళ్ళాడు. నత డ్రాయర్ తెరిచి యూనియన్‌కు సంబంధించిన ఫైలు తీసుకుని స్వామినాధన్ గదిలోకి వెళ్ళాడు. స్వామినాధన్ పక్కన దశరధంగారు!

ప్రకాశం ఆశ్చర్యపోయాడు. దశరధం గారి వైపు మళ్ళీ చూశాడు. ఆయన ప్రకాశాన్ని కొత్తగా చూశాడు.

"కూర్చో." అన్నాడు స్వామినాధన్ ప్రకాశం కూర్చున్నాడు.

స్వామినాధన్ ప్రకాశానికీ, దశరధం గారికీ కాఫీ తెప్పించాడు. తన సమస్యల్నీ, ఇబ్బందుల్నీ వివరించి ఆఖరిగా అన్నాడు-

"ఇవిగో నా ప్రపోజల్స్. వీటికి మీ వాళ్ళని ఒప్పించండి."

ప్రకాశం స్వామినాధన్ నుంచి కాగితం అందుకుని చూశాడు. అతని కళ్ళు మండినట్టయ్యింది.

వర్కర్లు నెలమొత్తం మీద పనిచేస్తే మరో ఇరవై రూపాయలు పెరిగేటట్టు ప్రతిపాదనలు చేశాడు. కంపెనీ ఏడాదికి ఒక జత బట్టలు ఇస్తుంది. అంతే!

"మీరిచ్చే ఇరవైలో మా చేతికి దొరికేవి పదిహేనే! ఆలోచించండి."

"ప్రకాశంగారూ! ఇది చిన్న కంపెనీ. ఇది నా స్తోమత" ప్రకాశం ఏం మాట్లాడ లేదు.

"ఏమంటారు? మీ వాళ్ళని ఒప్పించండి. నాకు తెలుసు. మీరు ఆ పని చేయగలరు?"

"మీకెలా తెలుసు?" ఎదురు ప్రశ్న వేశాడు.

"ఆఫ్ కోర్స్. మీరు ఎక్కడ వుంటున్నాం అన్నారు?"

"విఠల్‌వాడిలో"

"ఇతను..." దశరధంగారు ఏదో అడుగుతున్నారు.

ప్రకాశానికి ఆ మాటలు గుమ్మం దాటుతూంటే సగం సగం చెవినపడ్డాయి.

* * *

రెండు రోజుల్లో ప్రకాశం స్ట్రయిక్ నోటీసు ఇచ్చాడు. లేబర్ కమీషనర్‌కు కాపీ పంపాడు. రణరంగం సిద్ధమవుతోంది. ప్రకాశం డ్యూటీలో వున్నా,




ఇంటి దగ్గర వున్నా ఎవరో ఒకరు వస్తున్నారు. ఇండస్ట్రియల్ డిస్ప్యూట్ ఏక్ట్, లేబర్‌లాస్ గురించిన పుస్తకాలు తిరగ వేస్తున్నాడు. తను లోతుకు వెడుతున్నట్టుగా వుంది. నిద్రపోతున్నా, మెలుకువగా వున్నా రెండు వందల మంది కార్మికుల భవిష్యత్ ఒకపక్క, పద్మావతీ, సీతా మరొకపక్క గుర్తొస్తున్నారు.

పద్మావతి మరునాడు రాబోతోంది. రాత్రికి ఐ.డి.పి.యల్. కాలనీకి రమ్మని రాఘవ ఫోన్ చేశాడు.

ప్రకాశం మాట్లాడలేదు.

"నువ్వు మీ కంపెనీ వర్కర్స్‌కి ప్రెసిడెంట్ వయ్యావట. స్ట్రయిక్ నోటీస్ ఇచ్చావుట. నిన్ననే పేపర్లో చదివాను."

"అవును. అనుకోకుండా జరిగాయి ఇవన్నీ."

"మనకెందుకురా ఈ గొడవలన్నీ."

ప్రకాశానికి ఏం జవాబు చెప్పాలో తెలియలేదు.

"నాలు రోజుల తర్వాత కాలనీకి వస్తానులే."

"గొడవలేం పడకు" అంటూ రాఘవ సలహా చెప్పాడు.

ప్రకాశం ఆలోచిస్తున్నాడు. ఒక్క నెలలో ఎన్ని మార్పులు వచ్చాయి. ఏదీ ఊహించలేదు. ఆశ్చర్యం. అతనికి వింతగా కూడా వుంది.

ఇంతలో తలుపు చప్పుడయింది. ప్రకాశం లేచి తలుపు తెరిచాడు. దశరథం గారు!

"రండి" అన్నాడు.

"నన్ను గుర్తుపట్టావా?"

ప్రకాశం తలూపాడు.

"మీనాన్న నువ్వు మరేదో కంపెనీలో పనిచేస్తూండే వాడివనీ, ఉద్యోగం పోయిందనీ అన్నాడు...."

దశరథంగారు ఆగిపోయాడు.

"అక్కడా ఇటువంటి గొడవపలేనా కారణం."

"కాదండీ."

దశరథంగారు స్వగతంగా అన్నాడు. "స్వామినాథన్ నా మేనల్లుడు. నువ్వీ మధ్యే టెంపరరీగా జేవాపుటగా కంపెనీలో."

"అవును."

"మంచి కంపెనీ అది. నీ భవిష్యత్ బావుండవచ్చులే."

"మనం ఏం చెప్పగలమండీ."

"అదిసరే, అసలే ఉద్యోగాలు దొరకడంలా. మధ్యలో స్ట్రయిక్‌లూ అవీ నీకెందుకు చెప్పు?"

"ఉద్యోగం చేసి నన్నాళ్ళయినా బ్రతకాలిగదండీ."

"నీకు రెగ్యులర్ పోస్ట్ వచ్చేటట్టు చూసే బాధ్యత నాది. ఈ గొడవల నుంచి బయటపడు."

ప్రకాశం దశరథంగారి మొహంలోకి చూశాడు.

"ఇదేం గొడవ కాదండీ! వ్యక్తిగత సమస్య అంతకన్నా కాదు."

"నీ ఉద్దేశం ఏమిటి చెప్పు?"

"నా ఉద్దేశం స్వామినాథన్‌గారికి బాగా తెలుసు."

"నాతో చెప్పు. నీకేం కావాలి?"

ప్రకాశం దృఢంగా అన్నాడు "నాకేమీ వద్దండీ!"

దశరథంగారు జేబులోంచి రెండు వంద రూపాయల కట్టలు తీసి, "ఇవి వుంచు. నేను నిన్ను రేపు కలుస్తాను"

అంటూ ప్రకాశం జేబులో బలవంతంగా పెట్టాడు.

ప్రకాశం నిశ్చేష్టుడయ్యాడు.

"క్షమించండి! డబ్బు తీసుకు వెళ్ళండి'' ఆవేశంగా అని జేబులో కట్టలు తీసి దశరథంగారి మీదకు విసిరాడు.

"నా మాట విను. పెద్దవాణ్ణి చెబుతున్నాను."

"పెద్దవాళ్ళు పెద్ద మనుషల్లా ప్రవర్తించాలి..." కోపంగా అంటున్నాడు ప్రకాశం.

దశరథంగారు మరో దారి లేక వంద రూపాయల కట్టలు తీసుకుంటూంటే వాటితో పాటు ఓ ఉత్తరం చేతికి వచ్చింది. దశరథంగారు గుమ్మందాటి బయటకు వచ్చి ఉత్తరం విప్పాడు. అది సీత ప్రకాశానికి రాసిన ఉత్తరం! దశరథం గారి తలలో పులులు, సింహాలు, స్వైర విహారం చేయడం మొదలు పెట్టాయి. తనో మనిషినని మర్చిపోయాడు.

* * *

సికిందరాబాద్ స్టేషన్‌లో ప్రకాశం దక్షిణ ఎక్స్‌ప్రెస్ కోసం ఎదురు చూస్తున్నాడు. రాత్రంతా పద్మావతితో మాట్లాడుతోన్నట్టు, పద్మావతి వారణాసి కబుర్లు చెబుతూ తనని సవాలక్ష ప్రశ్నలు వేస్తోన్నట్టు ఏవేవో ఊహించుకున్నాడు.

ఏడాదినాడు విడిపోయిన స్నేహితురాలు విజ్ఞాన సర్వస్వంలా, జ్ఞాన సరస్వతిలా మారి వస్తోందేమో! దారీ తెన్నూ లేకుండా కొట్టుకుంటూన్న తనకు ఉత్తమోత్తమ సలహాలు ఇవ్వగలదేమో! రైలు వచ్చి ఫ్లాట్‌ఫారం మీద ఆగింది.

"ప్రకాశం!" కంపార్ట్‌మెంట్‌లోంచే ఒక్క అరుపు అరిచింది పద్మావతి.

ప్రకాశం నాలుగు అడుగుల్లో పద్మావతి వున్న కంపార్ట్‌మెంట్ దగ్గరకు వెళ్ళాడు.

ప్రకాశం పద్మావతిని పరకాయించి చూస్తున్నాడు.

నిద్రలేమి చేత, ప్రయాణ బడలిక చేత సలిగినట్టు కన్పిస్తోంది. ఒళ్ళు చేసింది.

''కులాసానా?''

''నీ దయవల్ల''

"అదేమిటి చిక్కిపోయావ్''

''నిరుద్యోగిని కదా"

''ఏదో ఉద్యోగం చేస్తున్నానని రాశావ్''

"అది కంఠం వరకే నింపుతుంది''

పద్మావతి నవ్వేసింది.

''నువ్వు కొంచెం బలిశావ్"

''గంగానది విస్తీర్ణం నాకూ వచ్చేస్తోంది. కర్మ.''

''ఇంకా లేదులే''

ఇద్దరూ స్టేషన్ బయటకు వచ్చారు.

''ప్రోగ్రాం ఏమిటి''

"మా అన్నయ్య సుధాకరం తెలుసుగా పోలీస్ ఇనస్పెక్టర్ అయ్యాడు. ఈ ఊళ్ళోనే వుంటున్నాడు. వాడింట్లో మకాం. ఇదీ అడ్రసు'' అంటూ సుధాకరం అడ్రసు ఇచ్చింది.

''నేను రేపు యూనివర్సిటీకి వెడతాను. సాయంత్రం నీకు ఫోన్ చేస్తాను. మా ఇంటికి వద్దువుగాని.''

''అలానే''

''నువ్వెక్కడ వుంటున్నా''

''విశల్‌వాడీ అనే ప్రదేశంలో''

''ఆఫీసు ఫోన్ నెంబర్ యివ్వు''

ప్రకాశం తన ఫోన్ నెంబర్, ఇంటి అడ్రసూ యిచ్చాడు.




పద్మాపతిని ఆటో ఎక్కించి సీతాఫల్ మండి పంపించాడు.

టైం చూసుకున్నాడు.

ఏడు గంటలయింది. డ్యూటీకి ఓ గంట టైం వుంది.

ఇంతలో రాయల్ ఇండస్ట్రీస్‌లో పనిచేసే ఒకళ్లిద్దరు 'ఏ' షిఫ్ట్‌చేసి వచ్చి బస్ దిగుతూ దూరాన్నుంచి ప్రకాశాన్ని చూసి–

"సార్!" అంటూ పరుగెత్తుకొచ్చారు.

"ఏమిటి?" అన్నాడు.

"నైట్‌షిఫ్ట్‌లో మన వర్కర్స్‌ని ఎవరో తాగొచ్చి కొట్టారు సార్. ఫ్యాక్టరీ దగ్గర జనం నిలబడిపోయారు. మీగురించి వినోద్ మీరూంకి బయలుదేరి వెళ్ళాడు" అన్నాడు.

"అరెరే"

"మేమూ వస్తాం సార్. ఇటునుంచి యిటే తార్నాకా వెడదాం."

ప్రకాశం బస్ స్టాప్ వైపు త్వర త్వరగా అడుగులు వేయడం మొదలు పెట్టాడు.

* * *

రాయల్ ఇండస్ట్రీస్ దగ్గర వర్కర్స్‌తో సమానంగా పోలీసులు ఉన్నారు. వర్కర్స్ ఆవేశంతో స్లోగన్స్ ఇస్తున్నారు. ప్రకాశాన్ని చూసి మరింత ఉత్సాహంగా అరవడం మొదలు పెట్టారు. ప్రకాశం అందర్నీ సముదాయించి ఫ్యాక్టరీలోకి వెళ్ళబోయాడు. సెక్యూరిటీ ఇన్స్‌పెక్టర్ ప్రకాశాన్ని అడ్డుకున్నాడు.

"నేను వర్కర్‌గా లోపలికి వెడుతున్నాను. మీరు ఆపడం అన్యాయం"

"మీ పేరు ప్రకాశం గదా. మిమ్మల్ని ఉద్యోగంలోంచి టెర్మినేట్ చేశామనీ, మిమ్మల్ని లోపలికి రానివ్వద్దనీ ఆర్డర్స్" అన్నాడు సెక్యూరిటీ ఆఫీసర్.

ఆ మాట వెంటనే చిచ్చులా వ్యాపించింది. కార్మికులు మరింత రెచ్చిపోయారు.

"మీ వర్కర్స్‌ని కంట్రోల్ చేసుకోండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకరం, ప్రకాశం దగ్గరగా వచ్చి.

"నేను స్వామినాధన్‌గారితో మాట్లాడాలి. వాతావరణం పాడుచేసింది ఆయనే. పైగా మీ పోలీసులు వర్కర్స్‌కు రెట్టింపు వచ్చి ఇక్కడ ఆవేశాన్ని పెంచుతున్నారు"

"బావుంది. మీ ప్రవర్తనబట్టే మావాళ్ల చర్య తీసుకుంటారు"

"సరే! నన్ను యూనియన్ ప్రెసిడెంట్‌గా లోపలికి వెళ్ళనివ్వండి"

"స్వామినాధన్‌గారి అనుమతికావాలి"

"మీరు వెళ్ళి చెప్పండి నేను వచ్చానని"

సెక్యూరిటీ ఆఫీసర్ లోపలికి వెళ్లి పావుగంట తర్వాత బయటకు వచ్చాడు.

వాతావరణం అంతా క్షణంలో నిశ్శబ్దం అయిపోయింది.

"వారిప్పుడు కొత్తగా చెప్పేదేమీ లేదట"

ప్రకాశం ఆశ్చర్యపోయాడు.

"మీరు వెళ్ళొచ్చు"

"ఇక్కడ కొట్లాట జరిపించి–దెబ్బలు తిన్నవాళ్ళని వాళ్ళ మానాన వాళ్ళని వదిలేయడం అన్యాయం"

"మీరు కంప్లయింట్ ఇవ్వండి. కేసు రిజిస్టర్ చేసుకుంటాం" ఇన్‌స్పెక్టర్ అన్నాడు.

ప్రకాశం టెంట్‌లోకి వెళ్ళాడు. ఇంతలో వినోద్ మరో నలుగురితో వచ్చాడు. అందరూ కూర్చుని భవిష్యత్ కార్యక్రమం గురించి ఆలోచించారు.

అందరూ తలోసలహా యిచ్చారు. ప్రకాశం తను నిరాహారదీక్ష సాగిస్తానని చెప్పాడు. ఆవేశంతో ఉపన్యసించాడు. అరగంటలో వాతావరణం మారింది. ప్రకాశం గురించి టెంట్‌లోకి అదనంగా ఓ చాపా, ఓ పరుపూ వచ్చాయి. వినోద్ ప్రకాశం మెళ్ళో గులాబీ దండ వేశాడు. బొట్టు పెట్టాడు. ప్రకాశం వారించి మెడలో దండ తీసేశాడు. నిరహార దీక్ష మొదలయ్యింది.




పద్మావతి ఒకటికి రెండుసార్లు ప్రకాశం గురించి రాయల్ ఇండస్ట్రీస్‌కు ఫోన్ చేసింది. ప్రకాశం ఉద్యోగానికి రిజైన్ చేశాడనీ, ఫ్యాక్టరీ స్ట్రయిక్‌లో వుందనీ ఎవరో జవాబు చెప్పారు. పద్మావతి మరీ వివరాలు అడిగితే అవతలి నుంచి ఫోన్ పెట్టేయడం జరిగింది.

హడావిడిగా డ్యూటీకి వెడుతూన్న అన్నగార్ని అడిగింది-

"నా స్నేహితుడు ఒకతను ఈ వూళ్ళో వున్నాడన్నయ్యా! అతనిది మన వూరే" అంటూ ప్రకాశం గురించి చెప్పింది.

సుధాకరం అనుమానంగా పద్మావతిని చూశాడు. "మన వూరి కరణంగారి అబ్బాయి....యం. ఏ చేశాడు. ఉద్యోగం గురించి ఈ ఊరు వచ్చాడు"

సుధాకరానికి ఏం చెప్పాలో తెలియలేదు. రాయల్ ఇండస్ట్రీస్ దగ్గర నిరాహార దీక్ష చేస్తున్న వ్యక్తి పేరు ప్రకాశం అని అతనికి గుర్తు వచ్చింది.

"ఎక్కడ పని చేస్తున్నాడు?"

"రాయల్ ఇండస్ట్రీస్ అని చెప్పాడు"

"అలానా!"

"నేను ఫోన్ చేస్తే ఎవరూ సరిగ్గా చెప్పలేదు. నువ్వు వాకబు చెయ్యి"

"సరే" అంటూ సుధాకరం బులెట్ ఎక్కి వెళ్ళిపోయాడు.

పద్మావతికి ఆ రోజు ఆదివారం మూలంగా యూనివర్సిటీకి వెళ్ళాల్సిన అవసరం లేదు. ప్రకాశం వస్తాడనీ అతనితో కాలక్షేపం చేద్దామనీ అనుకుంది. ఒంటరిగా ఎక్కడకూ వెళ్ళబుద్ధికాలేదు. అలానే నవల చదువుతూ కూర్చుంది.

అరగంట తర్వాత వీధి తలుపు చప్పుడయితే కుర్చీలోంచి లేచి తలుపు తెరిచింది. అపరిచిత వ్యక్తి.

"ప్రకాశం గారివ్వమన్నారు" అంటూ ఓ చీటీ చేతికి ఇచ్చాడు.

మర్నాడు ఉదయం సీత గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వస్తోందనీ తను నిరాహార దీక్షలో వున్నాననీ, స్టేషన్‌కు వెళ్ళి సీతను రిసీవ్ చేసుకోమని రాశాడు.

పద్మావతి ఉత్తరం తెచ్చినతన్ని అడిగింది-

"ఏం జరిగింది. ఎందుకు నిరాహార దీక్ష?" అని. అవతలి మనిషి తనకు తోచింది చెప్పాడు.

"గొడవలేమన్నా అయితే...?"

"మావాళ్లు వున్నారు. తేలిగ్గా వదిలి పెట్టరు."

పద్మావతికి అతనితో అంతకన్నా ఏం




మాట్లాడాలో తెలియలేదు.

"నేను వెడతానమ్మా" అన్నాడు.

పద్మావతి క్షణం ఆలోచించి "ఉండు ఉత్తరం రాసిస్తాను. ప్రకాశంగారికివ్వు" అని చిన్న చీటి మీద తను మర్నాడు ఫ్యాక్టరీకి వస్తానని రాసింది.

"ఆయ మీవారాండి" అన్నాడు ఉత్తరం తీసుకుంటూ.

పద్మావతికి ఏం చెప్పాలో తెలియలేదు. చిన్నగా నవ్వి "మా వాడే మీ నాయకుడు" అంది.

ప్రకాశం ఒట్టి ఆవేశం మనిషి! జనం బాగు కోసం ఈ నిర్ణయం తీసుకుని వుంటాడు. దేశోద్ధారణ కాబోలు అనుకుంది.

లేచి వంటపని చూసింది. తను తింది. అయినా పది దాటలేదు టైము.

ఎంత కాదనుకున్నా మనసు ప్రకాశం మీదకు పోతోంది. ఏ వైనా గొడవలయితే? కొట్లాటలయితే??

వెంటనే రాయల్ ఇండస్ట్రీస్‌కు ఫోన్ చేసింది.

"ఇక్కడ కొట్లాటలు జరిగాయి. వర్కర్స్, ఫ్యాక్టరీ యజమాన్ని కొట్టారు. అంతా గొడవగా వుంది" అంటూ ఎవరో చెప్పారు.

"అక్కడ సుధాకరంగారని ఇనస్పెక్టర్ వుండాలి. ఆయనతో మాట్లాడాలి. అయన చెల్లెల్ని నేను" కొంచెం ఆథారిటీతో అంది.

అవతలి మనిషి ఏమనుకున్నాడో, "వారిప్పుడే యూనియన్ లీడర్లని అరెస్ట్ చేసి వేన్ ఎక్కించుకుని వెళ్లారమ్మా" అన్నాడు.

"లీడర్స్ అంటే ప్రకాశం అనే అతన్ని కూడానా?"

"అవునమ్మా!"

పద్మావతికి ఏంచెయ్యాలో తోచలేదు. గబగబా స్టేషన్‌కి ఫోన్ చేసింది.

"నేను పద్మని."

"ఏమిటే?" అన్నాడు సుధాకరం.

"మన ప్రకాశాన్ని అరెస్ట్ చేశారటగా"

"ఆఁ"

"ఎందుకూ?"

"బావుంది. నీకూ రీజన్ కావాలా ?"

"అదికాదురా! అతను చాలా మంచివాడు."

"నీకు తెలియదు పద్మా! అతన్ని పోలీస్ కంట్రోల్ రూమ్‌కు తీసుకువెళ్లారు. నా అధీనంలో లేడు."

"ఏం చేస్తారంటావ్?"

"ఏం చెయ్యరుగానీ నువ్వు ఫోన్ పెట్టెయ్. నేను వచ్చి అన్నీ చెప్తాను."

పద్మావతి ఫోన్ పెట్టేసింది. ప్రకాశం అరెస్ట్ అయిన వార్త ఆమెకెందుకో అయిష్టంగా వుంది. భయంగా వుంది. ప్రకాశం ఇచ్చిన అడ్రసుకు ఫోన్ చేసి ప్రకాశం అరెస్ట్ గురించి చెప్పింది.

"ఎవరూ మాట్లాడుతుంటా?" అన్నాడు అవతలి నుంచి రాఘవ.

"నేను ప్రకాశం స్నేహితురాల్ని. కాశీ నుంచి వచ్చాను."

"ఏం చేద్దామంటావ్?" రాఘవ కంగారుగా అడిగాడు.

"మీరు మా ఇంటికి వెంటనే రండి. ఆపైన ఆలోచిద్దాం" అంది అడ్రసు ఇస్తూ.

"సరే" అన్నాడు రాఘవ.

పద్మావతికి నిప్పులమీద నిల్చున్నట్టుగావుంది.

అరగంటలో రాఘవ సీతాఫల్‌మండి



వచ్చాడు.

పద్మావతి రాఘవకు కాఫీ ఇచ్చింది.

"ఏం చేయాలంటారు?"

"అతన్ని మనం బెయిల్ మీద విడు



దల చేయించాలి. అవసరం అయితే ష్యూరిటీస్ ఇవ్వాల్సి వుంటుంది."

"ఎలా? వాళ్ళు ఏ వెయ్యో రెండు వేలకో బాండ్ ఇమ్మంటారు."

పద్మావతి ఆలోచించి "మా కూడా కాశీనుంచి మా హెడ్ఆఫ్ సెక్షన్ వచ్చారు. ఆయన లాలో దిట్ట. నల్లకుంటలో ఉంటారు. ఆయన దగ్గరకు వెడదాం."

రాఘవ "సరే" అన్నాడు.

పద్మావతి ఇంటికి తాళం వేసింది.

"ఇంట్లో మరెవ్వరూ లేరా!"

"మా అన్నయ్య పోలీస్ ఇనస్పెక్టర్. అతగాడే ప్రకాశాన్ని అరెస్ట్ చేశాడు."

రాఘవ మరేం మాట్లాడలేదు.

ఇద్దరూ బస్‌స్టాప్‌కి వెళ్ళారు.

*   *   *

పద్మావతీ, రాఘవా, పద్మావతి లా ప్రొఫెసర్ కమల్ మెహరోత్రా కలిసి

పోలీస్ కంట్రోల్ రూమ్‌కు వెళ్ళి అక్కడి డి. ఐ. జితో మాట్లాడారు. డి. ఐ. జి. చాలారకాల యక్ష ప్రశ్నలు వేశాడు మెహరోత్రాని.

"చదువుకున్న కుర్రకారు ఇలా విధ్వంసాన్ని ప్రోత్సహిస్తూంటే మీలాంటి ప్రొఫెసర్స్ వాళ్ళకి వంత పాడతారు దేనికి? వాళ్ళని మీరు మౌల్డ్ చేయరు - మమ్మల్ని లొంగదీయనివ్వరు?''

''అసలు నేరం ఏం చేశాడని ఇతను?"

''ఇప్పటి కుర్రకారు చాపకింద నీరులా తయారయ్యారు. విప్లవ భావాలు అమాయకుల మెదళ్ళో నాటుతున్నారు. లా అండ్ ఆర్డర్‌ని భంగం చేస్తున్నారు.''

మెహరోత్రాకి డి. ఐ. జి. వాదనలో న్యాయపరమైన ఆరోపణ కనబడలా.

''జరిగింది మీకూ తెలుసు. అతని మీద కేసు పెట్టుకోవచ్చు. కోర్టు లున్నాయి. ముందు బెయిల్ మీద విడుదల చేయండి.''

డి. ఐ. జి. అరగంట తర్జన భర్జన చేసి మెహరోత్రా దగ్గర బాండ్ తీసుకుని ప్రకాశాన్ని బెయిల్ మీద విడుదల చేశాడు.

"నువ్వు కాలనీ వచ్చెయ్'' అన్నాడు రాఘవ.

ప్రకాశం మాట్లాడలేదు.

మెహరోత్రా ప్రకాశానికి హితవుగా చెప్పాడు.

"మనం యుగసంధిలో వున్నాం. న్యాయం గురించి మాట్లాడ్డం కాక - అన్యాయం జరిగిందని అరవడానికి కూడా హక్కులేని సమాజంలో బతుకుతున్నాం. మనకున్న న్యాయచట్టాలు, భద్రతలు, గత సంస్కృతి యివేవి కూడా సామాన్య మానవుడి కన్నీళ్లు తుడవలేని అసహాయతలో, పుస్తకాల్లో అక్షర రూపంలో మిగిలాయి. ఇలా మరో ఏభై ఏళ్లుగడిస్తే మనకి నిజాయితీ ఈ దేశంలో కంచు కాగడా వేసినా కనబడకుండా పోతుంది"

"ఎవరూ ముందుకు రాకపోతే ఎలా అండీ?" పద్మావతి అంది.

"ముందుకు వచ్చినవాళ్ళు బలి అవడం తప్పించి - అదృశ్యం అవడం తప్పించి మరేం జరగడం లేదు. ఈవేళ సమాజం నయవంచకులది. కుటిలులది. సాహితీపరంగా, సాంస్కృతిపరంగా ఓనమాలు తెలియనివాళ్ళది. వెన్నుపోటు పొడవడం, జేబులు నింపుకోవడం, డబ్బు కోసం బతకడం మాత్రం తెలిసిన వాళ్ళది. ఏ న్యాయశాస్త్రం, ఒకరూ అరా చెప్పే సూక్తులు వినేదశ మనవాళ్ళు ఏనాడో దాటిపోయారు. కాలం ఎంతోకాలం వీళ్ల బరువు మొయ్యదు. సముద్రం పొంగి నట్టు, అగ్ని పర్వతం పగిలినట్టు, ఝంఝా మారుతం వీచినట్టు ఓ పెద్ద మార్పు ఎవరూ ఊహించని రీతిలో వస్తుంది. అందుకే నే చెప్తున్నా - ఈ తరం వాళ్ళు నిరాశ పడద్దు. అలాగని రణ రంగంలో దుమకనూవద్దు. అభిమన్యుడిలా దారి తెన్ను లేని ఈ మహా భారత సంగ్రామంలో బలి కావద్దు. వేచివుండండి. మనసును కన్నీటితోనో, ధైర్యంతోనో నిలబెట్టి వుంచండి. మీకు యాభై ఏళ్లు వచ్చే నాటికి మీరు ఊహించని మార్పుని మీరే చూసారు.."

పద్మావతీ, ప్రకాశం మాట్లాడలేదు.

"నేను వెడతాను" అన్నాడు మెహరోత్రా.

"మీరూ మాకాలనీకి రండి" అన్నాడు

రాఘవ పద్మావతితో.

"లేదండీ ఇంటికి వెళ్లాలి. తిరిగి కలుస్తాను" అని, ప్రకాశంతో తిరిగి అంది -

"రేపు స్టేషన్‌కి నువ్వు వెడతావా నన్నూ రమ్మంటావా?"

"నువ్వెళ్ళురా, నేనిటు వస్తాను"

"నేను వెడతాను పద్మా!" అంటూ మెహరోత్ర టాక్సీ ఎక్కి వెళ్లిపోయాడు.

పద్మావతి ఆటో ఎక్కింది.

రాఘవ ప్రకాశంతో అన్నాడు-

"ఇన్ని గొడవలు జరుగుతూంటే నాకెందుకు ఫోన్ చెయ్యలేదు. అమ్మా, వదినా ఒకటే బాధ పడ్డారు."

"ఇన్ని మార్పులు ఇంత త్వరగా వస్తాయని నేనూ అనుకోలేదు"

"ఇంటికి ఏమన్నా ఉత్తరం రాశావా?''

"లేదు.."

ప్రకాశం, రాఘవా ఆటో ఎక్కారు.

"రేపు స్టేషన్‌కి వెడతానంటున్నావ్? ఎవరు వస్తూంటా ?"

"మా ఊరి నుంచి సీత అని నా క్లాస్‌మేటే వస్తోంది.."

"అంటే..."

ప్రకాశం సీత గురించి రాఘవకు చెప్పడం మొదలు పెట్టాడు.




సికింద్రాబాద్ స్టేషన్‌లో ప్రకాశం, పద్మావతి గోదావరి ఎక్స్‌ప్రెస్ గురించి ఎదురుచూస్తూ ఓ బెంచీ మీద కూర్చున్నారు.

ప్రకాశం సీతతో తన పరిచయం, స్నేహం, అవి ప్రేమగా మారిన క్షణాలూ అన్నీ చెప్పాడు.

"నువ్వు ఆశ్చర్యపోతావ్. సీతని నేను పెళ్ళి చేసుకోవడం గురించి ఎన్ని గాలిమేడలు కట్టుకునేవాణ్నో చెప్తే! ఒకే క్లాసులో మనం అందరం కలిసి చదివాం. కానీ సీత నన్ను ఆకర్షించలేదు. ఆనందపరిచింది. ఈనా ఉద్యోగ ప్రయత్నం వెనక సీత ఉందనుకోవాలి. ఆమె మీద మమకారం లేకపోతే నేనీనాడో ఈ ఊరు వదిలిపెట్టి వెళ్లిపోయేవాణ్ణి."

"నాకర్థమయింది. ఆశ్చర్యం... నీ కన్నా, సీతే నిన్ను ఎక్కువగా కోరుకుందేమో. అందుకే అంత చొరవచేసి నీ దగ్గరకు రాగల్గుతోంది. నువ్వు నిరుద్యోగివని తెలిసీ - నిన్ను ఎవరైనా తనకి కాకుండా చేస్తారని కంగారుతో."

పది నిమిషాల్లో గోదావరి ఎక్స్‌ప్రెస్ వచ్చింది. ప్రకాశం, పద్మావతి కంపార్ట్‌మెంట్లు వెదకడం మొదలు పెట్టారు. జనం దిగుతున్నారు. దిగేవాళ్ళ కోసం వచ్చిన జనంతో ఒకటే హడావిడిగా ఉంది. ప్రకాశం, పద్మావతి చెరోవైపూ వెళ్లి తిరిగి సీత గురించి వెదికారు. సీత వాళ్ళకి కనబడలేదు.

"వచ్చినట్టు లేదు" అంది పద్మావతి.

ప్రకాశం మాట్లాడలేదు.

ఇద్దరూ స్టేషన్ ఎంట్రన్స్ దగ్గరకు వచ్చారు.

"చూడు."

ప్రకాశం వెనక్కి తిరిగి చూశాడు. దశరథంగారు. ప్రకాశం దశరథంగార్ని

చూసి ఆశ్చర్యపోయాడు.

"ఇదిగో సీత నీకు రాసిన ఉత్తరం. మొన్న నీ రూమ్‌కు వచ్చినప్పుడు నే ఇచ్చిన డబ్బుతోపాటు విసిరికొట్టావ్" దశరథంగారు ప్రకాశం చేతిలో సీత ఉత్తరం పెట్టాడు.

పద్మావతికి ఏం అర్థంకాలేదు.

"పాపం, సీత వస్తుందనుకున్నావ్ కాబోలు. అదిక్కడకు రాకుండా నేను ఏర్పాట్లు చేశానులే. అయినా నువ్వేం పెద్ద మనిషివి? పెళ్ళికాని పిల్లని లేచి రమ్మని ప్రోత్సహిస్తావా? నీకే తిండానికి తిండిలేదు. దాన్నెలా పోషించాలను కున్నావ్? వెనక ఎకరం నేల, చేతిలో వంద రూపాయలు ఇవ్వగల ఉద్యోగం లేని నీకు ప్రేమేమిటి? మీనాన్న మొహం చూసి ఊరుకున్నాను గానీ నీ మీద కోర్టులో కేసుపెట్టేవాణ్ణి" అంటూ పక్కనే ఉన్న పద్మావతిని చూశాడు.

"ఏం అమ్మడూ నువ్వెవరవు?"

పద్మావతి అసహ్యంగా దశరథం గారిని చూసింది.

"ఆ గుర్తొస్తోంది. మా ఊరిపిల్లవే. ఆ తాపీ పని చేసే వాడు... వాడి పేరు... వాడి కూతిరివిగా. ఇప్పుడు ఇక్కడ వుంటున్నావా...? ఇతగాడి దగ్గరేనా? బాగానే వుంది. ఇంకా ఇతగాడికి పెళ్ళాం, సంసారం ఎందుకట?"

పద్మావతి ఖిన్నురాలయిపోయింది.

"మీరు అనసర విషయాలు మాట్లాడు తున్నారు" ప్రకాశం కటువుగా అన్నాడు.

"అవును! అనవసర విషయాలే. కానీ ప్రపంచానికి తెలియ వల్సిన విషయాలు. ముఖ్యంగా నీకు పిల్లనిద్దామనుకునే వాళ్ళకి తెలియవలసిన విషయాలు".

"వెళ్లండి. మీరు"

"వెడతాను. వెడతాను పిల్లా!" దశర థంగారు విసవిస స్టేషన్ బయటకు వెళ్లి పోయారు.

"క్షమించు పద్మా"

"ఫూల్‌లా వున్నాడు. పోనీయ్."

"ఎలా జరిగిందో చూడు."

"బాధపడకు ప్రకాశం"

"నువ్వు బాధ పడకు."

"ఆఖరికి మనల్ని మనం ఓదార్చు కోవాలి కాబోలు."

ఇద్దరూ స్టేషన్ బయటకు వచ్చారు.

"నువ్వు మా ఇంటికి రా" అంది పద్మావతి.

"నిన్ను మా ఇంటికి పిలవాలను కున్నాను. ఇలా జరిగింది."

"రాక పోతానేమిటి! అది సరేగాని.."

పద్మావతి ఆగిపోయింది.

"ఏమిటి"

"మళ్ళీ కలుస్తాంగా అప్పుడు మాట్లాడు కుందాం."

"సరే"

ప్రకాశం ఐ. డి. పి. యల్. కాలనీకి వెళ్ళే బస్ స్టాప్‌కు వెళ్ళాడు. పద్మావతి నెంబర్ త్రీ బస్ స్టాప్ దగ్గరకు వెళ్లింది.

బస్ వచ్చింది. పద్మావతి బస్‌లో కూర్చుంది. మనసంతా చెదిరినట్టయిందిం ఆమెకు ఎంత కాదనుకున్నా దశరధ, గారి పేలవ గుర్తుకొస్తోంది. ఏ శక్తి. ఏ దేవుడు, ఏ ధైర్యం ద శ ర ధ ం గారిని అహంకారిగా మార్చింది. ఎదుటి మనిషిని హీనంగా, గడ్డి పరకగా చూడ గల ప్రహస్వదృష్టిఎవరు నేర్పారు?మతమా, కులమా, పెంపకమా??

ఏనుగుని చూసి కుక్కలు మొరుగుతా యంటారు. తను ఏనుగు కాదు. మామూలు

 

అధమ జాతిలోపుట్టిన ఆడపిల్ల. అయితే దశరథంగారు కుక్కకాదే? ఎందుకలా అరిచాడు?

స్టేషన్‌లో కొన్న పేపరు తెరిచింది. మధ్య పేజీలో ఎవరో సెంట్రల్ లీడర్ గారి ఉపన్యాసం... కింద ప్రభుత్వం నిర్ణయం. తక్కువ జాతి ఆడపిల్లను. అదే హరిజనుల అమ్మాయిని పెళ్ళిచేసుకునే అగ్ర వర్ణాల వారికి ప్రభుత్వం ఆర్థిక సహాయం చేస్తుందిట. ఆర్థిక సహాయం ఒకటే కాదు, ఉపాధి కల్పన కల్గజేస్తుందిట. ఉద్యోగాలు చూపిస్తుందిట.

పద్మావతికి నవ్వొచ్చింది. ఆర్థిక సహాయం కోసం అగ్ర వర్ణాలవాళ్ళు హరిజనుల్ని పెళ్ళాడ్డం జరుగుతుందా? అగ్ర వర్ణాల్లో వారికే కష్టం ముందు ఈ ప్రభుత్వం సహాయం ఎంతటిది? ఇక మిగిలింది ఉపాధి కల్పన.

గవర్నమెంటు ఇచ్చే ఈ ఉద్యోగం గురించి ఎంతమంది అగ్ర వర్ణాల వాళ్ళు ముందుకు వస్తారు? చెప్పలేం. వందలో ఒకరు ముందుకి వస్తే ఈ ప్రణాళిక సక్సెస్ అయినట్టే!

సీతాఫల్‌మండి స్టాప్ వచ్చిందని కండెక్టర్ గుర్తు చేయడంతో పద్మావతి బస్ దిగింది.




డాబా మీద రాఘవ, ప్రకాశం కూర్చున్నారు. దూరంగా సిటీలైట్స్ నక్షత్రాల్లా కన్పిస్తున్నాయి. ఏరోడ్రమ్‌లో ఆకుపచ్చ, ఎర్ర సిగ్నల్ లైట్స్ రౌండ్స్ కొడుతున్నాయి.

రాఘవ అన్నాడు– "ఇంత కాలం శారద బతుకు దారి తప్పినందుకు అన్నగారిగా నా బాధని, అమ్మకన్నీటిని భరించానురా. రాణి కూడా శారదలా పెళ్ళి కాకుండా ఉండిపోతుందనుకునేవాణ్ణి. మధ్య తరగతి కుటుంబంలో, ఇంటికి పెద్దగాపుట్టినవాడి అవసరాలన్నీ నేనూ రుచి చూశాను. నాన్న పోయేనాటికి మా ఆస్తి పెద్ద సున్నా! హైస్కూల్ చదువు పూర్తి అయింది నాకు. మనకు పెద్ద బలగం వుంది. కానీ ఎవరూ కన్నెత్తి సానుభూతిగా చూడలేదు. పెదవి విప్పి పలకరించలేదు. మా బాధ్యత ఎక్కడ మీద పడుతుందోనని అందరూ తప్పుకు తిరిగారు. నామాటగా చెప్పడంలేదు. మన కుటుంబాల సంగతి ఇది. మన చుట్టం, స్నేహితుడు ఓ మెట్టు జారి పడ్డాడంటే మనం తొంగి చూసి వంగివాలం! మన స్వార్థం మన చూసుకుంటాం. అందుకే మనలో దిగజారిన కుటుంబాలు ఇంకా దిగజారతాయి. ఇది చాలా దురదృష్టకరం.. మచ్చుగా సిక్కులను చూడు, సింధీ వారిని చూడు ప్రతీ సర్దార్జీ తను బాగుపడుతూ మరో సాటివాణ్ణి బాగు చేస్తాడు. అదే మనవాళ్ళయితే కష్టాలకు కృంగి, నీర్సపడి వీధి వాకిట్లో కూర్చుని కర్మనీ, దేవుణ్ణీ తిట్టుకుంటూ వ్యర్థ వేదాంతం మాట్లాడతారు – అందుకే డిగ్నిటీ ఆఫ్ లేబర్ అన్న మాటకి అర్థం మన వాళ్ళకు తెలియదనుకోవాలి.

"ఇవన్నీ ఎందుకు చెప్తున్నానంటే

నువ్వు కృంగిపోయి, డీలా పడి యుద్ధ భూమి నుంచి తిరోగమించిన వీరుడిలా అవకు. మా అమ్మ మమ్మల్ని పెంచి పోషించిన పద్ధతి నాకు బాగా గుర్తు. ఈ వేళ నేను అన్నం తింటున్నానంటే ఆవిడకు జీవితం మీద వున్న కమాండే కారణం. పొరుగువాళ్ల దగ్గర చెయ్యి జాప కుండా మమ్మల్ని పెంచింది. నువ్వు చదువుకున్నావ్. ఉద్యోగం అర్హత నీ కుంది. కానీ ఉద్యోగం దొరక నంత మాత్రాన నువ్వు జీవితానికి వెలి పడ్డ వాడివి కాదు"

ప్రకాశం చిన్నగా నవ్వాడు.

"నువ్వు చెప్పింది, ఒక వర్గం తలు పులు మూసుకుని స్వార్థంతో కుచించుకు పోయినందువల్ల వాళ్లకి జరిగిన కీడు. నిజమే! మన వాళ్లల్లో నిస్వార్థత తక్కువ. అందుకే మూడొంతుల మంది బీదరికం లోనే బతుకు తున్నారు... చదువూ, చదువు ద్వారా పెరిగిన రెక్కలు పుచ్చు కుని వీధిలో పడుతున్నారు. మనం కొన్ని కొన్ని ఉద్యోగాలు చేయం. ఆకలితో చచ్చినా ఫరవాలేదు. గౌరవం మాత్రం అంగుళం కూడా దిగ కూడదు. దీని వల్ల ఈ ముప్ఫై ఏళ్ళలో మన వాళ్ళు వీధిలో పడ్డారు. ఆకలి బాధ అర్థమయింది.. నిరాశా నిస్పృహలకు టీకా తాత్ప ర్యాలు తెలిసొచ్చాయి. సాటి మనిషి మీద ఇదివరకులా ఈర్ష్య కలగడం లేదు.నాలా ఆకలితో వున్న వాళ్ళని, నాలా నిరాశతో కళ్ళలో గూడు కట్టుకుని చూస్తే నాకి ప్పుడు జాలి కలుగుతోంది. కులం పట్టింపు హెచ్చుతగ్గులంటే మొహం మొత్తింది. 'సమానత్వం రావాలి. సమా నత్వం కావాలి, అనే తత్వం రక్తంలో పతకుత లాడుతోంది. కానీ అన్నయ్యా! సామాజికమైన ఇన్ని మార్పులు వచ్చి మనవాళ్ళ కళ్ళు తెరిచి – జరిగిన పొర బాట్లకి, చేసిన అవకతవకలకూ లెంపలు వాయించుకుంటూంటే జరిగింది వేరుగా వుంది. యాభై ఏళ్ళ నాడు మన వాళ్ళు చేసిన తప్పులు, మన వారికుండే అహం కారం, సంకుచితత్వం యివన్నీ, ఇప్పుడు తక్కినవాళ్ళు అనుకరిస్తున్నారు. అంతే! మనవాళ్ళప్పుడు తక్కిన కులాల వాళ్లని అధములుగా చూస్తే ఇప్పుడు ప్రతీ కులం వాడు తను తప్ప తక్కిన కులాల వాళ్ళని చూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటు న్నాడు. అహంకారం, ధన గర్వం అను కరణ జాడ్యంగా మారి మనిషిని పశువును చేస్తున్నాయి. ఇదంతా ఆలోచిస్తే నాకు అర్థమయిందొక్కటే అన్నయ్యా! నేను ఫలానా కులంవాడినని ఎవరూ గర్వ పడరు. లేక బాధపడరు. కులానికి ఎందు కైనా ఉన్నతాసనం మన సంఘంలో ఉందంటే వాళ్లకున్న ధన బలం మూలం గానే! ఇది ఎవరూ కాదనలేని సత్యం.

"డబ్బు – డబ్బుతోపాటు దర్పం, దర్పాన్ని అనుసరించి అహంకారం, అహం కారం పొరలతో కళ్లకు వచ్చే అంధకారం. ఇదో పరిభ్రమణ. మన సమాజంలోంచి కులాలు పోవాలన్నా, కుళ్ళు పోవాలన్నా, అసహనం తొలగాలన్నా ముందు వ్యక్తి మీద డబ్బు పలుకుబడి పోవాలి! ఇందాక నువ్వన్నావే....నిన్ను ఎవరూ చిన్న తనంలో ఆదరించకపోవడానికి కారణం ఆర్థిక అసమానత! అంతే! డబ్బు, పదవి మనుషులమధ్య దూరాన్ని పెంచితే, ఆకలి, ఆ తర్వాత మానవత్వం మనుషుల్ని ఏకం చేసాయి."

"నువ్వు రాజకీయాలు మాట్లాడు తున్నావ్"

"నీ వాగ్ధోరణి పరాకాష్ఠ చేరుకోవా లంటే – రాజకీయాలూ, కొన్ని కొన్ని ఇజాలు మాట్లాడక తప్పదు. ఏ ఇజం అను సమాజానికి పట్టిన రోగాన్ని నయంచేయ డానికే! పూర్వం దేవుడూ, పెద్దలూ చేసే యిప్పుడు ప్రజల్లో ఒక వర్గమే దేవ దూతలయి సంఘ ప్రక్షాళన మొదలు పెడతారు. కాండవ దహనం జరగడం అనివార్యం అయింది – మహాభారతంలో కూడా! ఆ తర్వాతే మహా యుద్ధం మొదలయింది."

"ఇంతకీ అసలు సంగతి చెప్పలేదు."

"నేను విఠల్‌వాడిలో వుంటాను. చూస్తాను...ఎన్ని అగ్ని పరీక్షలు ఎదు రవుతాయో."

"నాకు నిద్ర వస్తోంది."

"పిన్నిని పిలవనా జోల పాడు తుంది"

రాఘవ నవ్వేశాడు.

* * *

తెల్లవారేటప్పటికి గోపాలరావుగారు ఆటోలో ఇంటి ముందు దిగారు.

లలితమ్మగారు తలుపు తెరిచి బావ గారిని చూసి మర్యాదగా లోపలకు ఆహ్వా నించింది. గోపాలరావుగారు హైదరాబాద్ రావడం అదే ప్రథమం.

ఆయన తమ్ముడు పోయిన తర్వాత లలితమ్మగారిని చూడ్డం ఇది రెండవసారో, మూడవసారో!

"ఇంటి దగ్గర అంతా కులాసానాండి!" అంటూ పలకరించింది.

"ఆఁ" అని "ఇంట్లో ఎవరూ లేరా?" నెమ్మదిగా అడిగాడు.

"శారద డ్యూటీమీద మద్రాసు వెళ్ళింది. రాణి అత్తవారింట్లో వుంది"

వాకిట్లో మాటలు విని విశాల లోపలి మంచి లేచి వచ్చింది.

"మీ పెద మామగారు" అంది లలితమ్మ కోడలుతో.

విశాల క్షణంలో అర్థం చేసుకుని "నమస్కారమండీ" అంది.

"రాఘవ కనబడ్డేం"

"రాఘవా, ప్రకాశం డాబా మీద పడుకున్నారు."

"వాడూ ఇక్కడే ఉన్నాడన్నమాట" కటువుగా అన్నాడు.

లలితమ్మగారు గోపాలరావుకు మొహం కడుక్కుందుకు నీళ్ళిచ్చింది. విశాల కాఫీ చేయడం మొదలు పెట్టింది.

పది నిమిషాల్లో కాఫీ తయారయింది. విశాల గోపాలరావుగారికి కాఫీ ఇచ్చి డాబా మీదకు వెళ్ళి రాఘవనీ, ప్రకాశాన్నీ లేపి పెదమామగారొచ్చిన కబురు చెప్పింది.

"నాన్నా...!" అన్నాడు ఆశ్చర్యంగా ప్రకాశం.

ముగ్గురూ కిందకు వచ్చారు. రాఘవ గోపాలరావును పలకరించాడు–

"కులాసానా బాబాయ్" అంటూ.

"ఏం కులాసా. ఇంటి దగ్గర బ్రతక నివ్వకుండా పీడాకడు దొరికాడుగా ఘనుడు"

రాఘవకు ఏమనాలో తెలియలేదు.

"త్వరగా స్నానం చేసిరా నీతో మాట్లాడాలి" అని ప్రకాశంతో "ఏవోయ్ ఇంకా ఏం రాచకార్యాలు మిగిలాయని ఈ ఊళ్ళో ఉన్నావ్?" అన్నాడు. ప్రకాశం మాట్లాడకుండా లోపలకు వెళ్ళాడు.

* * *

ఉదయం పది గంటలయ్యింది.

లోపల గదిలో గోపాలరావుగారూ,





రాఘవా, ప్రకాశం కూర్చున్నారు.

"వీడి గురించి నాకు దశరథంగారు ఫోన్ చేసి చెప్పారు. వీడిలా తయారవుతాడనుకోలేదు"

"జరిగింది నేను చెప్తాను విను బాబాయ్" అన్నాడు రాఘవ.

"వాణ్ని సమర్థిస్తావ్ అంతేగా. జరిగిందేదో జరిగింది. ఈ తలవంపులు చాలు. ఉద్యోగం లేనప్పుడు ఇక్కడ పనేమిటి?



ఇంటికి రమ్మనమను."

"ఆ ఊళ్లో ఉద్యోగం దొరకదుగా. అటువంటప్పుడు నేను ఎక్కడ వున్నా ఒకటే."

"అంటే నీ ఉద్దేశం?"

"నా ఉద్దేశం ఒకటే. నా చదువుకూ, నాకూ ఆ ఊళ్లో పుట్టగతులు లేవు. ఉండవు. ఇక్కడే ఏదో ఉద్యోగం దొరికే వరకూ వుంటాను. అర్జంటుగా నన్ను ఇంటికి ఎందుకు రమ్మంటున్నారో నాకు తెలియడంలా."

"ఈ ఊళ్ళో జులాయిలా తిరగ డానికా?"

"తిరిగే వాళ్ల జులాయిలవరను కుంటాను."

"ఎదరించడం అలవాటయ్యింది."

"మీరు హీనంగా మాట్లాడుతూంటే"

"ఎదిరిస్తావన్న మాట."

"ఇది ఎదిరింపు కాదు. జవాబు చెప్పకపోతే మీరు వేసే అభాండాలన్నీ ఒప్పుకున్నట్లే"

"ఒరే! ఆ ఎదిరింపుచూడు" అన్నాడు ఊగిపోతూ గోపాలరావుగారు రాఘవతో.

"నువ్వూరుకో ప్రకాశం !"

"ఆ సీత గొడవ ఏమిటి?ఆ అమ్మాయి లేచి రావడానికి ప్రయత్నం ఏమిటి? ఇంకా ఇలాంటి గొడవలకేనా ఇక్కడ ఉంటాననేది."

"దశరథంగారు నా మీద కోపంతో, ఆ స్వామినాథన్‌కి నా మీద వున్న కక్షతో ఇది జరిగింది. అంతకు ముందు జరిగింది అందరికీ తెలుసు."

"అవన్నీ నా కనవసరం" గోపాలరావుగారన్నారు.

"నేను ఇంటికి ఇప్పట్లో రాను. మీరు ఏమీ అనుకోవద్దు" అంటూ ప్రకాశం మంచం మీదనుంచి లేచి, గది తలుపు తెరిచాడు.

"వాణ్ని చూడరా" అంటూ గోపాలరావు కోపంతో కుర్చీలోంచి లేచాడు.

సరిగ్గా అప్పుడే వీధి గుమ్మం దగ్గరకు వచ్చి ఆగిపోయిన పద్మావతిని చూసి ప్రకాశం, రాఘవా ఆశ్చర్యపోయారు. వంటింట్లోంచి వచ్చిన విశాల పద్మావతిని చూసి ఎవరైందీ తెలియక-

"లోపలికి రండి" అంది.

పద్మావతి ఒక అడుగు ముందుకు వేసింది.

"రా పద్మా !" అన్నాడు ప్రకాశం.

పద్మావతికి డ్రాయింగ్ రూమ్ చూపించింది విశాల.

రాఘవని చూసి "నమస్కారమండీ!" అంది.

"నమస్తే"

"ఆ అమ్మాయి ఎవర్రా?" అన్నాడు. గోపాలరావు కొడుకుని చూసి.

"నా క్లాస్ మేట్. ప్రస్తుతం బెనారస్‌లో వుంటోంది."

"మన ఊరి అమ్మాయే కదూ."

ప్రకాశం, పద్మావతి మొహాలు చూసుకున్నారు. ప్రకాశం మామూలుగా అన్నాడు-

"అవును. మన ఊరే."

"ఎవరి తాలూకు ?"

"హరిజనులమ్మాయి. వాళ్లకి అడ్రసు పెద్దగా వుండదు."

"అంటే..వీరయ్య కూతురా?"గోపాలరావు ముక్కు మీద వేలేసుకున్నాడు.

ఎవరూ మాట్లాడలేదు.

"అయితే ఇలాంటి స్నేహాలు కూడా పట్టావన్న మాట"

"చదువుకున్న వాళ్లలో పట్టింపులు వుండకూడదు బాబాయ్! ఆమె కాశీలో డాక్టరేట్ చేస్తోంది."

రాఘవ నెమ్మదిగా అన్నాడు.

"ఆ అమ్మాయి ఎందుకు వచ్చినట్టు?"

రాఘవ పద్మావతి ప్రకాశానికి ఎలా సహాయం చేసిందీ, ఆ విషయాలన్నీ చెప్పాడు.

"ఇంత బ్రతుకు బ్రతికి ఇంటి వెనక చచ్చినట్టయ్యింది."

"నేనని ముందుకు వచ్చి ఎవరూ కూడా సహాయం చేయడంలేదీ రోజుల్లో. ఆ అమ్మాయికిలా మనం చాలా ఋణం పడి వున్నాం."

"అయితే ఆ పిల్లని పెళ్లాడతానను. భ్రష్టుపడ్డ తర్వాత చెడిందేం వుంది"

"నాన్నా!"

"నువ్వు చెడ్డావ్ భ్రష్టుడా" అంటూ లోపలి గదిలోకి వెళ్లి తలుపులు వేసు




కున్నారు గోపాలరావుగారు.

"నన్ను క్షమించు పద్మా!"

"నేనీ సమయంలో రాకుండా వుంటవల్సింది. వెడతాను ప్రకాశం"

"నేనూ వస్తానుండు"

"వద్దు ప్రకాశం! ఆయన బాధ పడతారు."

"బాధేగా. మనం అందరం పుట్టింది బాధ పడ్డానికి! వాళ్లు పుట్టింది ఎదటి వాళ్ళను బాధ పెట్టడానికి. మానాన్న బాధపడే రకం కాదు. పద"

"త్వరగా వచ్చెయ్."

ప్రకాశం నెమ్మదిగా అన్నాడు "నాన్నతో చెప్పు నేను పాలెం వచ్చేది లేదని. ఆయన వెడితే వెడతాడు. అంతే!"




సీతాఫల్‌మండీ వెళ్లారు ప్రకాశం, పద్మావతి. వాకిట్లో సుధాకరం కూర్చుని వున్నాడు. అతను ఇద్దర్నీ కొరకొరా చూశాడు.

"నువ్వెళ్లింది ఇతగాడి దగ్గరకన్న మాట! బావుంది."

పద్మావతి ఏం మాట్లాడలేదు. లోపలికి వెడుతూ-

"కూర్చో" అంది ప్రకాశాన్ని చూసి. ప్రకాశం సోఫాలో కూర్చున్నాడు.

"పద్మావతీ,నువ్వూ మంచి స్నేహితులన్నమాట."

"అవును."

"మీరు ఏమీ అనుకోనంటే ఒకమాట. మా ఇంట్లో చదువుకున్నవాళ్లు తక్కువ. అందులో ఆడవాళ్లు చదువుకోవడం మరీ గొప్ప. అది పైకొచ్చి మంచి ఉద్యోగం సంపాదించుకోవాలి. పైగా పెళ్ళి కావాలి. ఇలా స్నేహాలు పడితే దాని భవిష్యత్ ఏమవుతుందో ఆలోచించారా?"

"నేనేం చెప్పాలో తెలియడం లేదు."

"పద్మావతి పరిస్థితిలో మీరు వుంటే ఏం చేస్తారు?"

"ఇంతకీ పద్మావతి చేసిన తప్పేమిటట"

"చిన్నప్పుడు మనవాళ్లు చెప్పే సూక్తి గుర్తుకు వస్తోంది. స్నేహానికయినా, దేనికయినా సమాన ఫాయిదా చూసుకోవడం మంచిది. మీకూ, మాకూ ఏ విషయంలోనూ పొత్తుకుదరదు. మీరు మమ్మల్ని అంటరానివాళ్లగా చూస్తే, మేం మిమ్మల్ని అందని వాళ్లగా చూస్తాం. 'అంతా ఒకటే, అందరిలోదీ ఒకే రక్తం' లాంటి మాటలు అన్నీ వేదిక మీద ఉపన్యాసాలు. నేనివన్నీ ఎందుకుచెప్తున్నానంటే పద్మావతి చిన్నపిల్ల కాదు. ఆమె కోరికలు తీరేవీ, అందేవిగా ఉండాలి. ఆకాశ హర్మ్యాలుగా మారకూడదు. నీలాంటి స్నేహితుణ్ణి పెళ్లి చేసుకుని సుఖపడాలని ఆమె ఆశ పడిందంటే...ఆమెలో ఆ ఊహ మొలకెత్తిందంటే చాలా ప్రమాదం. స్నేహాలు స్నేహాలుగా వుండవు. మొగ్గలేస్తాయి. కానీ చిగురించడానికే అవకాశం వుండదు. మొగ్గని త్రుంచి, ఆ పసి మొగ్గలోంచి రక్తం ఉరకలు వేసిందని బాధపడకూడదు. మొగ్గని మొగ్గగా వదిలేస్తే

ప్రకృతి సిద్ధంగా పువ్వు అవుతుంది. అత్యాసతో తుంచితే చెట్టుకే ద్రోహం చేసిన వాళ్ళం అవుతాం.''

ప్రకాశం ఏం మాట్లాడలేదు.

"మీరు స్నేహితులుగా విడిపోండి. ఈ ఉపకారం చెయ్యండి. నీ మీగకు ఏ కేసు రాకుండా చూస్తాను"

ప్రకాశం చిన్నగా నవ్వి అన్నాడు. "మీరు అనవసరంగా భయపడుతున్నారు. మేం చిన్నప్పటి నుంచీ స్నేహితులం. ఈవేళ మా మధ్య కొత్త అనుబంధాలు లేవు,కొత్త కోరికలు లేవు.."

పద్మావతి కాఫీ కలిపి తీసుకు వచ్చింది.

"మా అన్నయ్య ఏమిటి, శ్రీకృష్ణు డిలా భగవద్గీత నూరి పోస్తున్నాడా?"

"మామూలు హిత వాక్యాలు. అంతే!"

"అయితే ఏం చేద్దామని ప్రకాశం! ఊరు వెడుతున్నావా?"

"లేదు.."

"ఇక్కడే వుంటావా?"

"ఆఁ..."

"ఉద్యోగం సంపాదించేవరకూ హైదరాబాద్ వదలనని భీష్మ ప్రతిజ్ఞ చేశావన్న మాట."

"అనుకోవచ్చు"

"ప్రకాశం! ఈ రాత్రే మేం బెనారస్ వెళ్ళి పోతున్నాం. ఆ విషయం చెప్పా లనే మీ ఇంటికి వచ్చాను. మెహరోత్రా గారు నిన్ను మరీ మరీ అడిగారు. స్టేషన్ వస్తావుగా"

"తప్పకుండా కలుస్తా"

ఓ గంట సుధాకరం కబుర్లతో పద్మావతినీ, ప్రకాశాన్నీ ఎంగేజ్ చేశాడు.

"మా ఇంట్లో భోజనం చేయాలి. ఈ రోజు"

"మనింట్లోనా" అన్నాడు సుధాకరం!

"మనింట్లో భోజనం పెట్టకూడదా. అతగాడికి?"

"అతనికేమన్న అభ్యంతరం ఏమో నని."

"ప్రేమగా పేలాలు పెట్టినా తినాలి. అది నా మతం. కులం కన్నా బలమ యింది స్నేహం"

ప్రకాశం సుధాకరంతో పాటు భోజనం చేసి వీధిలో పడ్డాడు.

బయటకు వస్తే తను ఏకాకి నన్పిం చింది. ఏం చెయ్యాలి. విఠల్‌వాడీ వెళ్ళి నాల్గు రోజులయ్యింది. చీకటికొట్టు తన రాక కోసం ఎదురు చూస్తూవుంటుంది. ప్రకాశం బస్ స్టాప్ దగ్గరకు వెళ్ళాడు.

బస్‌లో కూర్చున్నాడు. బస్ కదులు తోంది. వేగం అందుకుంది. ఆలోచనలూ మొదలయ్యాయి. ఎంత కాదనుకున్నా ఉండుండి తండ్రీ, సుధాకరం గుర్తుకు వస్తున్నారు. తండ్రి అగ్రవర్ణానికీ, సుధా కరం హరిజనులకూ ప్రతినిధుల్లా మాట్లాడ్డం వింతగా అన్పించింది. ఇద్దరిదీ కూడా అనుభవంలేని బతుకులే. కానీ ఇద్దరూ భయాలకు ప్రతినిధులు. ఎవరి గూటిలో వాళ్ళు నుంచుని ఎదుటివాళ్ళ బతుకుమీద తమ నిర్ణయాల్ని ఆపాది స్తున్నారు. తక్కువ కులంలోకి కొడుకు దిగజారతాడని తండ్రి భయం. చెల్లెలు పై మెట్టుకు ఎక్కే ప్రయత్నంలో కాలు జారి పడుతుందని సుధాకరం అనుమానం. ఇద్దరూ చెరో కులంలో వున్న చెడుని ప్రేమించడం మాత్రమే నేర్చినవాళ్ళు.

పద్మావతిని తను ప్రేమించాడా? పద్మావతి తనని ఆశించిందా?

హిమాయత్ నగర్‌లో బస్ దిగాడు. అక్కడ నుంచి నడచి వెళ్ళాలి.

 

వందగజాలు నడవాలి. రూమ్ దగ్గ రవుతోంది.

గుమ్మం దగ్గర కూర్చున్న స్త్రీ రూపం కన్పిస్తోంది. కళ్ళు పెద్దవిచేసి చూశాడు. ఆరడుగుల దూరంలో సీత.

ప్రకాశం సీతని చూసి "నువ్వా?" అన్నాడు.

"నేనే! పొద్దున్నగా వచ్చాను."

"ఏమిటిది ఆశ్చర్యం"

"తాళం తీయి చెబుతాను"

ప్రకాశం రూమ్ తాళం తీశాడు. గదంతా చీకటిగా, చీదరగా వుంది.

"ఇదా నీ రూమ్? నరకానికి ప్రతి రూపంలా వుంది"

"నువ్వు నరకం అని తెలిస్తే వచ్చే దానివి కాదా?"

సీత కళ్ళు పెద్దవి చేసి ప్రకాశాన్ని చూసి–

"నేను నరకం నుంచి తప్పించుకు వచ్చాను. అందుకే ఆ భయంతో అనే శాను. క్షమించు"

"సీతా ఎలా వచ్చావ్?"

"నీకు తెలియదా" సీత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"చాచా... ఏడవకు"

"ప్రకాశం" అంటూ మోకాళ్ళ మధ్య తల పెట్టుకుని బావురుమంది సీత.

"సీతా!"

"వచ్చేశాను ప్రకాశం! గదిలో పడేసి అన్నం నీళ్ళు ఇవ్వడం మానేస్తే రెండు రోజులు భరించాను. మా పనిమనిషి సహాయంతో బయటపడి రైలెక్కాను. చెప్పు ప్రకాశం నేను తప్పు చేశానా? నన్ను తిరిగి ఇంటికి వెళ్లమంటావా?"

"వద్దు సీతా! నువ్వు వెళ్ళొద్దు. నువ్వు అనుకోకుండా వచ్చావ్. నా మూలంగా నీ భవిష్యత్ నాశనం అవుతుందని భయ పడ్డాను. ఫరవాలేదు. ధైర్యంగా చేయి అందించి ముందుకు నడిపించమంటే, నేను వెనకాడను. చదువు ముగిసిననాడే నాకు పోరాటం మొదలయింది. ఈ క్షణం వరకూ ఆ పోరాటం నా ఒక్కడిదవంతే అనుకున్నాను. నువ్వు తోడుగా వచ్చావ్! ఈ లోకం, ఈ మనుషులు నిప్పులు చెర గనీ, పిడుగులు విసరనీ భయపడను. ఆకలి, నిరాశ, నిస్పృహ పీడతో ఇద్దరం కలిసి యుద్ధం సాగిద్దాం. పిడికిలి బిగిద్దాం. సరేనా?"

"నీ ఇష్టం."

"స్టవ్ వుంది, సరుకులు ఉన్నాయి. అన్నం వండు. నేను గంటలో వచ్చే స్తాను"

"పద్మావతి కాశీ వెళ్ళిపోతూంది. స్టేషన్లో సెండాఫ్ ఇచ్చి వస్తాను"

"అలానే" అంది సీత.

మరి కాసేపటికి వీధి తలుపులు వేద్దా మని వెళ్లిన సీతకు దూరంలో తండ్రీ, మరో వ్యక్తి కన్పించారు. సీతకు చెమటలు పోశాయి. గబాగబా పక్క సందులోకి తప్పుకుంది. వెనక్కి తిరిగి చూడబుద్ధి కాలేదు. అక్కడే వున్న సిటీ బస్ ఎక్కింది. పమిట చెంగుతో మొహం తుడుచుకుంది.

"ఎక్కడికి వెడతారమ్మా"

"ఎందాకా వెళ్తుందది"

"ఈ బస్ స్టేషన్ వరకే వెడు తుంది."

సీత స్టేషన్ వరకూ టికెట్ తీసు కుని స్టేషన్ రాగానే దిగింది.

ఎటు వెళ్ళాలి? ఎటు వెడితే ప్రకాశం కన్పిస్తాడు?

సీత అటూ ఇటూ తిరుగుతూంటే వెనకే వచ్చి చెయ్యి పట్టుకున్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయింది. తండ్రి...... పక్కనే స్వామినాథన్.

"ఎలా వచ్చావే ఈ ఊరు" ఉక్రోషంతో గొణుక్కుంటూ చెవి దగ్గరగా వెళ్ళి అడుగుతున్నాడు దశరథంగారు. సీత స్థాణువయింది.

"నీకు బుద్ధి చెప్పాలి... పద సిగ్గు లేనిదానా" అంటూ స్వామినాథన్ కారు దగ్గరకు లాక్కుపోతోన్నట్టు తీసుకు వెళ్ళాడు దశరథంగారు సీతని.

* * *

"పద్మా" అన్నాడు ప్రకాశం.

"నాకో మాట యివ్వు. నువ్వు ఏ తొందరా పడనని, ఆవేశంతో నిర్ణయాలు తీసుకోనని."

"మనం ఊహించి ఇలా నడుద్దాం అనుకునేది ఒట్టిమాట. ఈ ప్రపంచంలో పడ్డ తర్వాత సుఖం దక్కక పోవచ్చు. దుఃఖం మిగలవచ్చు. అది వేరు. మన నడతకే మనం బాధ్యత వహించగలం గానీ మంది నడతకు కాదు. మందితో ముడి పడిన జీవితం ఒరుసుకుని ప్రవహించే నది. దాని నడక ఆపడం కష్టం."

"ఉత్తరాలు మాత్రం రాస్తూ వుండు"

"ఇదివరకు కన్నా ఎక్కువగా రాస్తాను. మెహరోత్రాగారితో కూడా చెప్పు."

"వెడతాను ప్రకాశం"

"వెళ్ళొస్తాను అను పద్మా! ఎంతో ఆనందంగా, ఎంతో ఉత్సాహంగా ఈ ఊరు వచ్చావ్. నిరుత్సాహంతో వెడుతున్నావ్."

"అదేంలేదు ప్రకాశం...ఇప్పుడు నేను పక్షభంచేసిన గాజుబొమ్మలా ఉన్నాను. సున్నిత హృదయం అంటారే దాన్ని అనుభవాల రాతి కట్టడంలో బంధించాను"

"అదిగో బాధపడుతున్నావ్!"

"లేదు మిత్రమా! వెళ్ళిరా. సీత ఒక్కతే రూమ్‌లో కంగారుపడుతూ వుంటుంది"

"వెడతాను" అంటూ ప్రకాశం శెలవు తీసుకొని బయలుదేరాడు. బస్‌స్టాప్‌కు వెళ్ళి సిటీబస్‌కోసం నుంచున్నాడు. బాగా చీకటిపడింది. జనం రోడ్లమీద పల్చగా తిరుగుతున్నారు. నలుగురు అపరిచితులు వచ్చి తన పక్కన నుంచోడం చూశాడు ప్రకాశం. క్షణం. అంతే! ప్రకాశం గుండెల్లో ఒకరు బలంగా గుద్దారు. మరెవరో కాలి తన్ను.. ఓపదునైన ఆయుధం శరీరం లోపలికి దూసుకుని వెళ్ళి రక్తస్నానం చేసి బయటకు వచ్చింది. చిన్న తిమ్మిరి. ఆ వెంట కళ్ళల్లో మంట.. శరీరం నిండుగా జ్వాల...ఆవేదనగా మారడం.. ఏం జరిగిందో, ఏం జరుగుతోందో అర్థంకాని స్థితిలో ప్రకాశం రోడ్డు మీదకు జారి పడ్డాడు.. చుట్టూతా ధ్వనులు, కేకలు లీలగా మారి ఆపైన అదృశ్యమవుతున్నాయి.. అయినా అప్పుడు ఆకాశం మీద చందమామ వెన్నెల వెదజల్లుతూనేవుంది. ఆ వెన్నెల్లో భూమి మీద పాకుతున్న ప్రకాశం రక్తం జ్వాలగా వెలుగుతోంది. ప్రకాశంలో బాధనీ, ఆరాటాన్నీ, ఆవేదననీ అర్థం చేసుకున్న నక్షత్రాలు కళ్ళు విప్పుకుని పలకరిస్తున్నాయి. నేల మీద పొడిచిన ఎర్రనక్షత్రంలా కన్పిస్తూన్న ప్రకాశాన్ని చూసి విస్తుపోతున్నాయి.



# వేట

భార్యను వెంటపెట్టుకుని జయరామ్ వేటకి వెళ్ళాడు. తుపాకీ, మందు గుండూ సమృద్ధిగా తీసుకుని జీపులో బయల్దేరారు భార్యా భర్తలు. అడవిలో వేటను నిషేధించిన ప్రాంతం అది: భార్యను గెస్టుహౌస్‌లో వుంచి వంటకి ఏర్పాట్లు చేయమని చెప్పి, రహస్యంగా అడవిలోకి బయలుదేరాడు జయరామ్.

వెళ్ళీ వెళ్ళగానే అడవి పంది ఒకటి దుంపలు తవ్వి తింటూ కనిపించింది జయరామ్‌కి. తుపాకీతో గురిచూసి దాన్ని కాల్చాడు. తూటా గురితప్పి పంది కాల్లో దిగబడింది. అంతే! పంది తినడం ఆపి, తూటావచ్చిన దిశగా వేగంగా పరుగెత్తుకు రాసాగింది. జయరామ్ తుపాకీ పారేసి అంతకంటే వేగంగా విల్లువిడిచిన బాణం లాగ గెస్టుహవున్‌కేసి పరిగెత్తాడు. అతడి వెనకగా పొదలమీదుగా దూకుతూ, భారీ శరీరాన్ని అతిలాఘవంగా గాల్లో ఎగరేసు కుంటూ పంది జయరామ్‌ను తరమ సాగింది.

గెస్టుహవుస్ ఇంకా పది గజాల్లో వుందనగా జయరామ్ ముందుకు తూలిపడి పోయాడు. పంది గుద్దెద్దు చేలో పడ్డట్టు జయరామ్‌ను తొక్కుకుంటూ గెస్టుహవుస్ లోకి ప్రవేశించింది. లేచి దుమ్ము దులుపు కుంటూ గెస్టు హవుస్ గుమ్మం దగ్గరికి వెళ్ళి, "ఏమేవ్! ఇప్పుడు పంపిన పందిని చర్మం తీసి తరిగి వుంచు. నేను మరో దుప్పినో, జింకనో వేటాడి తెస్తాను" అని తిరిగివెళ్ళిపోయాడు. అటూ ఇటూ తిరిగి అరగంట తర్వాత బితుకు బితుకుమంటూ గెస్టుహవుస్‌లోకి ప్రవేశించాడు. వంట ఇంట్లో అడవిపంది చచ్చిపడి వుంది అతడి భార్య వంటపనిలో వుంది. అతన్ని చూసి-

"వెధవ కట్టెల పొయ్యితో ఛస్తు



న్నాను కళ్ళమండి. ప్రయాణంలో స్టౌ పాడయింది. ఇందాక నువ్వే వచ్చావను కుని కట్టెపేడుతో ఒకటి పెట్టాను. తీరా చూస్తే పంది! ఇంతకీ ఏం తీసుకొచ్చేవు" అంది జయరామ్ భార్య నిదానంగా.

# అదుపు

రెసిడెన్షియల్ స్కూల్లో పని చేయ డానికి అభ్యర్థులను పిలిచారు. ఇంటర్వ్యూ చేసే మిలిటరీ ఆఫీసర్ సన్నపాటి ఉపాధ్యాయుడిని సెలక్ట్ చేశాడు. ఆ ఉపాధ్యాయుడికి ఎలాంటి శిఫారసూ లేదు. మిగతా వాళ్ళందరూ ఉత్తరాల ఉద్దండులే! అందుకే మిలిటరీ వ్యక్తి కాబట్టి శిఫారసు లను లెక్క చేయలేదు.

"మీరు యింత సన్నగా వున్నారు. మా స్కూల్లో వున్న పిల్లలు అల్లరిలో మొనగాళ్లు. వాళ్లని మీరు అదుపులో పెట్టగలరా?" అడిగాడు మిలిటరీ ఆఫీసర్.

అందుకతను నవ్వి, "మీరే చూస్తారు గదా! నా అర్హత వృత్తిలో ప్రవేశించాకనే మీకు ఋజువు చేయగలను" అన్నాడు.

ఉపాధ్యాయుడి గొంతులో ధ్వనించిన ఆత్మ విశ్వాసానికి ఆఫీసర్ ఏమీ మాట్లాడకుండా అపాయింట్ మెంట్ ఆర్డరు చేతి కందించాడు.



రెండు నెలల తర్వాత ఆఫీసర్ అకస్మాత్తుగా తణిఖీకి వెళ్లాడు. సన్నపాటి వుపాధ్యాయుడు కండలు తేరి నున్నగా ముద్దొస్తూవున్నాడు. విద్యార్థులు ఎవరిపని వాళ్లు నోరు మెదపకుండా పక్కకి చూడకుండా చేసుకు పోతున్నారు. ఆఫీసర్‌కి వాళ్ళ క్రమశిక్షణకి మూర్ఛ వచ్చినంత పనయింది. నలుగురు ఉపాధ్యాయులు ఒకరి తరువాత ఒకరు వాళ్లని అదుపులో పెట్టలేక రాజీనామాలు యిచ్చారు. వాళ్లలో ఒకతను పిచ్చాసుపత్రి పాలయ్యాడు కూడా.

"పిల్లలు ఇంత క్రమశిక్షణతో ఎలా వుంటున్నారు? బైదిబై మీకు ఇక్కడ గాలీ, నీరూ బాగా పడినట్టుందే" అన్నాడు ఆఫీసర్.

ఉపాధ్యాయుడు నవ్వి, "కొత్తలో వీళ్ళందరి భోజనాలు ఒక్కడినే తినడం యిబ్బందిగా వుండేది. ఇప్పుడు నా భోజనం మాత్రమే నేను తినగలుగుతున్నాను" అన్నాడు.

ఆఫీసర్ అయోమయంగా చూశాడు ఏమీ అర్థంకాక.

"అల్లరి చేసిన పిల్లల భోజనాలు నేను తినేస్తాను. అది నా నియమం, పిల్లలు కొత్తలో ఈ క్రమశిక్షణకి అలవాటు పడి మూడోనాటికి సగం మంది మారిపోయారు. వారం రోజుల్లో మరే పిల్లవాడూ తన భోజనాన్ని అల్లరికోసం త్యాగం చేసుకునే స్థితిలో లేకపోయాడు" అన్నాడు ఉపాధ్యాయుడు.

## ఆత్మవంచన

ఘోషణరావుగారు ఆ చుట్టుపక్కల పేరున్న లక్షాధికారి. తన ఆస్తి మీద ఎవిడి కన్నూ పడకుండా ఆల్సేషియన్ కుక్కను కొని ఇంటికి కాపలా పెట్టాలన్న ఆలోచన వచ్చింది ఆయనకి. మన్నాటి కల్లా మేనేజర్ ఆయనకి కుక్కలు కొని పెట్టి మెప్పుపొందాడు. అయితే ఆల్సేషియన్ కుక్క ఇంటికి వచ్చిన ప్రతి వ్యక్తి మీదా చిర్రుబుర్రులాడి అవకాశం కనిపిస్తే కలియపడాలని సరదాపడుతూ వచ్చింది. రోజూ తింటోన్న మేక




లివరూ, ఎముకల పులుసూ, పాలూ, బిస్కట్లూ దాని పళ్ళ తీటను మరింత పెంచాయి గానీ తగ్గించలేదు.

ఒక రోజున మేనేజర్ మీదనే తిరగబడిందా శునకరాజం. మేనేజర్ దగ్గర దానికి కాస్త 'దొంగవాసన'తగిలివుండాలి. ఆఫీసులో లెక్కలు తెమలక మేనేజర్ ఆఫీసు కాగితాలూ, పెన్సిలూ, రబ్బరూ జేబులో పెట్టుకుని గేటు దాటుతూ అర్సేషియన్ దాడికి గురయ్యాడు. జేబులోంచి చటుక్కున భూషణంగారి ఆస్తిబాపతు చిహ్నాలయిన సదరు కాగితం, పెన్సిలూ,



రబ్బరూ బయట పారవేయడానికి బద్ధకించో, సిగ్గుపడో ఆయన కాలుఎత్తి దాని డొక్కలో తన్నాడు. తన్నినప్పుడు ఆయనకి తెలియదు – అంత బలంగా తన్నినట్టు. పాపం సుకుమారంగా పెరుగుతూన్న ఆల్సేషియన్ కుక్క ఉంగలు చుట్టుకుపోయి గిలగిల తన్నుకుని ప్రాణాలు వదిలేసింది.

డబ్బుతో పనిగాబట్టి భూషణరావూ, చేతిలో పనిగాబట్టి ఆయనగారి లీగల్ ఎడ్వయిజరూ కలసి మేనేజర్ మీద కేసు పెట్టారు.

"అయిదొందల రూపాయిల కుక్కని చంపిన నేరానికి మిమ్మల్ని శిక్షించాలని కోర్టు భావిస్తోంది. చెప్పుకునేదేమయినా వుందా?" అడిగాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"ముద్దాయినా? కాలునా?" అడిగాడు మేనేజర్ తరఫు లాయర్.

జడ్జి కలగజేసుకుని, "కాలును విడిగా శిక్షించమని మీ కోరిక అయితే అలాగే ముద్దాయి కాలును కోర్టువారి స్వాధీనం చేయండి" అన్నాడు.

ముద్దాయి తరఫు లాయర్ బోను సమీపించి ముద్దాయి కాలు లాగి లాయర్ ముందున్న టేబిలు మీద పెట్టాడు.

అది కొయ్యకాలు.

## ఇంటర్వ్యూ

అభ్యర్థులు ముందుకు వెళ్లి గదిలో అడుగు పెడుతున్నారు కాని పెద్దాపురం చాంతాడులాంటి క్యూ తరగడంలేదు. రైల్వే శాఖలో సిగ్నల్ మేన్ వుద్యోగానికు ఇంటర్వ్యూ జరుగుతోంది. సర్టిఫికెట్స్ పట్టుకుని నిలబడిన అభ్యర్థుల్లో కొందరికి శోష వచ్చినంత పనయింది. రెండు వుద్యోగాలకు రెండు వేల మందిని ఇంటర్వ్యూ చేస్తోన్నట్టు తెలిసి శేషావతారం స్పృహ తప్పిపోయాడు. అతడికి సోడా పట్టించి పరస తప్పించి గదిలో ప్రవేశ పెట్టారు కొంత మంది దయార్ద్ర హృదయులైన ఇంటర్వ్యూ పోటీదారులు.

ఇంటర్వ్యూ చేసే ఆఫీసర్లు అయిదుగురూ కౄరమృగం మీద బాణాలు కుప్పించినట్టు శేషావతారాన్ని ప్రశ్నలతో

ముంచెత్తారు. పేరూ, వూరూ అడిగారు. ఏం చదివావన్నారు. అక్కడితో చదువు ఆపేశావేం అన్నారు. ఈ వుద్యోగానికే ఎందుకు రావలసి వచ్చిందన్నారు.

శేషావతారానికి సోడా ఘాటు తల కెక్కింది ఆ సమయానికి.

"మీరు అడిగిన ప్రశ్నలకి, ఇవ్వబోయే వుద్యోగానికి ఏ మూలనయినా సంబంధం వుందా ?" అడిగాడు శేషావతారం.

ఆఫీసర్లు నోర్లు తెరిచారు. అంతలోనే మొహాలు చూసుకుని శేషావతారం మీద



తిరిగి బాణాలు గుప్పించారు.

"రెండు రైళ్ళు ఎదురెదురుగా ఒకే పట్టాల మీద వస్తున్నాయి. ఏం చేస్తారు ?"

"లీవర్ లాగి, స్విచ్ వేసి ఒకదాన్ని రెండో పట్టా మీదికి మళ్లిస్తాను"

"లీవర్ పాడయితే ?"

"ఎర్ర సిగ్నల్ చూపుతాను"

"సిగ్నల్ కొయ్యలు పాడయితేనో ?"

"ఎర్రజెండా చూపుతాను"

"ఇంజన్‌లో వున్న వాళ్ళు నిన్ను చూడక పోతేనో !"

"మా స్నేహితుడికి ఫోన్ చేస్తాను."

"అదేమిటి ? వాడెవడు ?"

"వాడు న్యూస్ పేపర్లో ఫోటోగ్రాఫర్ !"

శేషావతారం ఎన్నుకోబడ్డాడు.

# పిఫ్టీ పిఫ్టీ

ఆ ఆఫీసుకి చండశాసనుడు ఆఫీసరుగా వచ్చాడు. మేనేజర్ దగ్గిరనుండీ, ఆఫీసు బాయ్‌వరకూ చండశాసనుడికి దడదడలాడిపోసాగారు. ఆఫీసులో పొదుపరితనం, క్రమశిక్షణా చెట్టాపట్టాలు వేసుకుని నడుస్తున్నాయి. ఆఫీసుకి వచ్చిన కవర్లను చింపాక తిరగవేసి అంటించి వుపయోగిస్తున్నారు స్టాఫ్ అంతా. ఒక్కో కవరూ అయిదుసార్లు వాడుతున్నాడు చండశాసనుడు. ఆఫీసులో సిరా, జిగురు వంటివి కనిపించడంలేదు. ఎవరి పెన్నులో వారే సిరా పోసి తెచ్చుకోవాలని చండశాసనుడు హుకుం జారీ చేశాడు.

స్టోర్ కీపర్‌కి పని తగ్గి పోవడానికి బదులుగా పని పెరిగిపోయింది. ఎవరికైనా కాగితాలు కావలసివస్తే వాటిని పావుటావులుగా చేసి అడిగిన ఇండెంటులో సగం యివ్వమనీ, పెన్సిలు అడిగితే సగం ఇవ్వమనీ చండశాసనుడి ఆదేశం! స్టోర్ హవుస్‌లో కొన్ని సామానులకి బూజు! ఆఫీసు మేనేజర్ ఇండెంటు పెట్టాడు కాగితాలూ, పేడ్లూ కావాలని. ఇంకా ఇతర వస్తువులకూ ఇండెంటు పెట్టాడు.

స్టోర్ కీపర్ ఆ ఇండెంటు మీదవున్న

ప్రత్యేక ఆదేశం చూశాడు. ఆ ఇండెంటులో వున్న వస్తువులలో సరిగ్గా సగం ఇవ్వమని చండశాసనుడు నీళ్ళ సిరాతో రాశాడు.

స్టోర్ కీపర్ అయోమయంలో పడ్డాడు. చండశాసనుడిని అతి కష్టం మీద ధైర్యం తెచ్చుకుని కలిశాడు.

చండశాసనుడు ఉగ్రంగా ఏమిటన్నట్టు చూశాడు.

స్టోర్ కీపర్ చేతిలో ఓ కూజా, గ్లాసూ ఉన్నాయి.

"సార్! తమరు సగం సగం ఇండెంటు ఇవ్వమన్నారు. మేనేజర్‌గారు ఇది కూడా



కావాలని కోరారు. వీటిని కూడా సగం సగం ఇవ్వమన్నారా?" అన్నాడు స్టోర్ కీపర్.

చండశాసనుడు మరింత వ్యగ్రంగా చూస్తూ వుండిపోయాడు.

## డబ్బు

స్కూటర్ వేగంగా పోతోంది. శిరీష్ సుఖంగా గాలి పీల్చుకొంటున్నాడు. చెవుల పక్కనుండి కోసుకుపోయే గాలితో ప్రాణం హాయిగావుంది. దారి పక్క నిలబడిన వ్యక్తి ఎవరో చెయ్యి వూపాడు. అతడి మొహంలో దీనత్వం కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. శిరీష్ స్కూటర్ ఆపాడు.

"సార్! నా జేబులో మందులున్నాయి. అర్జంటుగా వెళ్ళవలసివుంది. నా భార్యకు అర్జంటుగా మందులు అందించాలని చెప్పారు డాక్టరు" అన్నాడు ఆ వ్యక్తి.

"లిఫ్టు కావాలా?" అడిగాడు శిరీష్.

ఆ వ్యక్తి తలాడించాడు. శిరీష్ అతడిని ఎక్కి కూర్చోమన్నట్టు తల ఆడించాడు. ఆ వ్యక్తి మొహంలో వెలుగు కనిపించింది.

కాలేజి వద్దకు రాగానే "ఆపండి సార్!" అని అరిచాడు వెనక కూర్చున్న వ్యక్తి. శిరీష్ స్కూటర్ ఆపాడు. ఆ వ్యక్తి స్కూటర్ దిగి థాంక్స్ చెప్పి బయలుదేరాడు.

శిరీష్ అకస్మాత్తుగా పాంటు జేబు తడుముకున్నాడు. కళ్ళముందు చీకట్లు కమ్మాయి. జేబులో పెట్టుకున్న యాభై రూపాయిల నోటు లేదు. శిరీష్‌కి అకస్మాత్తుగా అంతసేపూ స్కూటర్ వెనక ప్రయాణం చేసిన వ్యక్తి మనసులో మెదిలాడు.

'అవును. అతడే దొంగిలించి వుంటాడు' అన్నది అతడి మనసు. "ఏయ్ మిస్టర్! ఇలారా!" అరిచాడు శిరీష్.

ఆ వ్యక్తి వెనక్కి తిరిగి శిరీష్ దగ్గరకు వచ్చాడు.

"మర్యాదగా ఆ యాభై రూపాయిల నోటు ఇలా యివ్వండి" అన్నాడు శిరీష్. ఆ వ్యక్తి తెల్లబోయాడు.

"ఏ యాభై!" అడిగాడు ఆ వ్యక్తి.

"అదే! నా జేబులోంచి మీరు కొట్టేసిన నోటు!"

"నాకేం తెలియదు సార్!"

"మీ జేబులు చూపించండి."

"నా జేబులో నా యాభై రూపాయిల నోటు వుందిసార్! మందులకోసం తీసుకు వస్తున్నాను"

"అబద్ధం! ఇందాక మీజేబులో మందులే వున్నాయని అన్నారు. ఇప్పుడు ప్లేటు మారుస్తున్నారు"

"నన్ను నమ్మండి సార్! లిఫ్టు



ఇవ్వరేమోనని అలా చెప్పాను"

"నాన్సెన్స్!" అంటూ శిరీష్ అతడితో కలియబడి జేబులోంచి యాభై రూపాయిల నోటు లాక్కున్నాడు. ఆ తర్వాత పచ్చడి చేసి రోడ్డు వారనే అతన్ని వదిలి స్కూటరెక్కాడు.

ఆ సాయంకాలం శిరీష్ ఇంటికి తిరిగి వచ్చాడు. సునీత ఆశ్చర్యంగా అతడికేసి చూసి, "నాకు చిల్లర మార్చమని యాభై నోటు యిచ్చి చిల్లర తెచ్చే లోపుగానే స్కూటర్ ఎక్కి తుర్రుమన్నారు. డబ్బుల్లేకుండా ఇంతసేపూ ఎక్కడ తిరిగారు" అంది.

శిరీష్ నిర్ఘాంతపోయి జేబులు తడుము కున్నాడు.

ఆ వ్యక్తి దగ్గర లాక్కున్న యాభై రూపాయిల నోటులో మిగిలిన చిల్లర డబ్బులు చేతికి తగిలాయి.

# మనీ పర్స్

కోర్టు హాలు నిశ్శబ్దంగా వుంది. జడ్జిగారు పండిపోయిన తన జుత్తు తడుముకొని ముద్దాయి నిలబడిన బోనుకేసి చూశారు.

"చూడమ్మా! నువ్వు నిజమే చెబుతా నన్నావు. ప్రమాణం చేశావు. అడుగడుగునా అబద్ధాలు చెబుతున్నావు. అది మంచి పద్ధతికాదు" అన్నారు ముద్దాయిని చూస్తూ.

ముద్దాయి తెల్లబోయింది.

"నేను అబద్ధాలు చెబుతున్నా నంటారా ?" అంటూ గుడ్ల నీరు కుక్కు కుంది.

"అవునమ్మా! పబ్లిక్ ప్రాసిక్యూటర్ మొదట నీ వయసు అడిగితే పాతిక సంవత్సరాలన్నావు. నేను అడిగితే పాతిక సంవత్సరాలు ఇంకా రాలేదన్నావు. నీ తరఫున లాయర్ అడిగితే ఇరవై అన్నావు" అన్నారు జడ్జి.

ముద్దాయి తెల్లబోయి, "అవునండీ నాకు గుర్తులేదు" అన్నది.

జడ్జిగారు మందలింపుగా నవ్వి "చూడమ్మా : ఈ వయసులో నీకేగుర్తు

లేదంటే నా వయసునాటికి ఇంకా గుర్తు వుండదు ఏ విషయమునూ. ఉదాహరణ చెబుతాను. ఉదయం ఇంటినుండి బయలు దేరేటప్పుడు నిన్న వేసుకున్న తెల్ల చొక్కాలో మనీ పర్సు మరచిపోయి అలవాటుగా రిక్షా ఎక్కేశాను. డబ్బు లివ్వబోయే ముందు ఆ విషయం గుర్తు కొచ్చింది. దాన్లో ఈ నెల జీతం అంతా ఉంది. లేకపోతే రిక్షాలో పారవేసుకున్నట్టు భ్రమపడనా? అలాగే నీవయసు ఒకసారి గాకపోతే ఒకసారయినా ఖచ్చితంగా గుర్తుండి తీరుతుంది!" అన్నారు.



'జడ్జీ అంటే అలా వుండాలి!' అనుకున్నారు కోర్టులో వున్న వాళ్లు. ఆ మాటలు జడ్జిగారి చెవినబడ్డాయి. తనలో తానే గర్వంగా ఫీలయ్యారు. ఆ ఫీలింగుతోనే చిద్విలాసంగా సాయంకాలం ఇంటికి వెళ్ళారు.

"మీకు ఈ వయసులో మతిపోలేదు గదా?" అంది జడ్జిగారి భార్య.

"ఏం?" అన్నారు జడ్జిగారు తెల్లబోయి.

"మనీ పర్సు యివ్వమని డజను మందిని వరసగా పంపించారేం?"

"మనీ పర్సు కోసమా? నేనా? పంపడమా? కొంపముంచి యిచ్చావా?"

"ఏం? మీరు పంపలేదా? పంపనిదే అంతమందికీ కరెక్టుగా మనీ పర్సు ఎక్కడుందో ఎలా తెలుస్తుంది? మీ సరసం పల్లగావుండు!"

"........."

"మొదట వచ్చినవాడికే ఇచ్చాను. ఆ తర్వాత కూడా మనుషులను పంపారు మతిపోయినట్టు?"

జడ్జిగారు భార్యకేసి వెర్రెత్తినట్టు చూడసాగారు.

ఎమ్. వి. వి. సత్యనారాయణ

# తనదాకా వస్తే...

కంపార్ట్‌మెంటంతా తపస్సమాధిలో వున్న మునీశ్వరుల్లా వుంది. ప్రయాణీకు లందరూ ఎవరి నిద్రలో వాళ్లున్నారు. నేను కూడా మాగన్నుగా నిద్రపోతున్నాను. కానీ నాకెదురు సీట్లో కూచున్న లావుపాటి శెట్టిగారు మాత్రం సంవత్సరా లరబడి నిద్ర మొహం ఎరగని వాళ్లా, పెద్దగా శబ్దం చేస్తూ గుర్రు పెడుతూండడం వల్ల నాకు పరమ చికాకుగా ఉంది.

అటూ ఇటూ కదులుతున్నాను.

కాస్సేపు కళ్ళు విప్పి అతడి వంక కొరకొరా చూస్తున్నాను.

ఏం లాభం. తప్పదు ఈ రొద.

ఏదో స్టేషనొచ్చింది. "టీ కాఫీ" కేకలు లీలగా వినపడుతున్నాయి. తలుపు తెరుచుకొని కాలేజీ కుర్రాడ్లా కనిపిస్తున్న షోకిల్లా వచ్చి సరాసరి కుంభకర్ణుడి పక్క

సీటు ఆక్రమించి చుట్టూ కలయ జూశాడు.

నేను మళ్ళీ చెరుపు మరుపుగా కునుకు తీయసాగేను.

కళ్లు విప్పేను గురక శబ్దానికి విసు క్కుంటూ. ఎదురుగా కుంభకర్ణుడి భుజం మీద తలవాల్చి నిద్రపోయే ప్రయత్నం చేస్తున్నాడు షోకిల్లా పురుషుడు.

మళ్లీ కళ్లు మూసుకున్నాను.

రైలు బ్రిడ్జిమీద నుంచి పోతున్న శబ్దాలు వినిపిస్తున్నాయి. మళ్లీ నిద్రా భంగం. కళ్లు తెరిచి ఎదురుగా చూసి



దిగ్భ్రాంతుణ్నయ్యాను.

షోకిల్లా కుంభకర్ణుడి లాల్చీ జేబులోని పర్సుని జాగ్రత్తగా తీసి, తన జేబులో వేసుకుంటున్నాడు.'హమ్మ. దొంగవెధవా' అనుకుని ఏమాత్రం అలికిడి చేయకుండ సగం మూసిన కళ్ళతో గమనించసాగేను.

యథాప్రకారం తలవాల్చి నిద్ర నటిస్తున్నాడు దొంగ ముండాకొడుకు. ఏదో స్టేషన్ వస్తోందనటానికి సూచనగా రైలు వేగం తగ్గింది.

దిగిపోయే ప్రయత్నం చేస్తున్నాడు షోకిల్లా.

స్టేషన్లో ఆగింది ట్రైను.

గభాల్న లేచి పైనున్న సూట్కే సందుకుని ద్వారం వేపు నడవబోతున్న అతణ్ని వాటేసుకుని-'దొంగ 'దొంగ' అని కేకలు పెట్టేను.

నా పట్టు నుంచి విడిపించుకునేలోపున నా కేకలకి మేలుకున్న జనం అతడి చుట్టూ కమ్ముకున్నారు.

పోలీసుల్ని పిలవటం, అతణ్ని అప్ప జెప్పటం, పర్సు ఓనరుని నిద్రలేపి, అంద జేయడం జరిగిపోయింది వరసగా.

దారిపొడుగునా తమ పొగడ్తలతో నన్ను ఆకాశానికెత్తేశారు కుంభకర్ణుడు, ఇతర ప్రయాణీకులు.

షెర్లాక్ హోమ్సులా పోజుపెట్టి నా సీట్లో కూర్చుని తీరిగ్గా కుంభకర్ణుడికి-'ప్రయాణాల్లో మెలకువగా ఉండటం' గురించి చిన్నసైజు ఉపన్యాసం ఇచ్చేను.

ఇంతలో నేను దిగాల్సిన స్టేషన్ వచ్చింది.

లేచి సూట్కేసు కోసం పైకి చూద్దునూ...

నా కళ్ళ ముందు కారడవులూ, కాటుక కొండలూ కనిపించాయి. నక్షత్రాలు నాట్యం చేశాయి.

"నా...నా..సూట్కేసు" - సంగిగా, నాకే వినిపించనంత నీరసంగా అన్నాను.

"ఆ దొంగ వెధవ చేతిలో సూట్కేసు చూసేనండి. బహుశా అది మీదేనేమో..." ఎవరో అంటున్నారు.

సినిమాలో ఫ్లాష్బాక్లా - షోకిల్లా, అతడి చేతిలో సూట్కేసూ క్లోజప్లో కనపడి అదృశ్యమయ్యాయి.

—భాగవతుల




# ప్రఖ్యాత పాశ్చాత్య కాఫీ హోటళ్ళు

"అంతరాత్మకు ఉత్తేజం కలిగించి, మనస్సును తేలిక పరచటమేకాక జీర్ణ శక్తికి, కంటి జబ్బులకు, జలోదరం, వాత రోగాల్ని నివారించుటలో సాటిలేని మేటి ఔషధంగా ఉపయోగించే ఆరోగ్యకరమైన పానీయం"

ఇది కాఫీని గూర్చి ఆంగ్ల భాషలో చేసిన మొదటి విజ్ఞాపన. ఆనాటి నుండి ఈనాటి వరకు ఒడుదొడుకుల్ని అధిగమిస్తూ క్రమక్రమంగా ప్రపంచమంతటా విస్తరించింది. ఈనాడు ప్రపంచ జనాభాలో మూడవ వంతు ప్రజలు కాఫీకి అలవాటు పడ్డారు. ప్రస్తుతం భోజనం లేకున్నా ఓర్చుకుంటారేమో కాని కాఫీ లేకుంటే సహించలేరు. ఈనాడు తృప్తిగా కాఫీ గుటకలు వేస్తూ సామాజిక, సాంస్కృతిక రాజకీయ గోష్ఠులు, భావి కార్యక్రమాలు రూపొందించబడుతున్నాయి. సాహిత్యకారులు, కళాకారులు, తత్వవేత్తలు కలుసుకొని తమ భావాల్ని వెల్లడి చేసుకోవటానికి కాఫీ హోటళ్ళు వేదికలుగా మారాయి.

నిజానికి కాఫీ అనేక సంఘర్షణలను తట్టుకొని అందరికీ ప్రీతిదాయకమైంది. కాఫీ ఉత్పత్తి, ప్రచారం జరిగిన తీరు, గుణదోషాల చరిత్ర–ఇవన్నీ అతి విచిత్రంగా, ఆసక్తికరంగా పరిణమించాయి. ప్రప్రథమంగా మానవుడు ఈ అద్భుత పానీయాన్ని ఎప్పుడు, ఎలా పరిశోధించాడు అనేది ఇప్పటికీ వివాదకరమైన అంశంగానే ఉంది. రికార్డులననుసరించి క్రీ.శ. 700లో అరేబియా ప్రజలు కాఫీని ఔషధంగా వినియోగించేవారని తెలుస్తోంది.

కాఫీని మొదట 'కాఫకా' అనేవారు. అరేబియా భాషలో దీనిని 'కహ్వా' అని పిలిచేవారు. కహ్వా అంటే అరబ్బీ భాషలో 'శక్తి' అనే అర్థం వస్తుంది. ఇథియోపియా (అబీసీనియా)లో దక్షిణ పశ్చిమంలో కాఫ్కా అనే నగర సమీపంలో కాఫీ ఉత్పత్తి జరిగింది. ఇక్కడే క్రీ.శ. 525లో కాఫీ మొక్క ప్రప్రథమంగా కనుగొనబడింది.

క్రీ.పూ. 3వ శతాబ్దంలో అబీసీనియాలోని ఒక క్రైస్తవ ఫాదరీ ఒకరోజు బీడులో తన గొర్రెల్ని మేపుతుండగా అవి ఉన్నట్లుండి గంతులు వేయసాగాయి.



అవి ఒక కొత్తరకం ఆకుల్ని, గింజల్ని తిని అలా గంతులువేస్తున్నాయని ఫాదరీ గ్రహించాడు. వెంటనే ఫాదరీ ఆ వనస్పతి (కాఫీ) గింజలతో పానీయం తయారు చేసి శిష్యులకిచ్చి తాను కూడా సేవించాడు. ఆ పానీయం సేవించగానే వారికి నూతనోత్సాహం, చురుకుదనం కలిగినట్లు అనిపించింది. ఆ పానీయంవల్ల వారికి మత సంబంధమైన క్రియా కలాపాల కోసం రాత్రంతా జాగరణ చేయటానికి పరిష్కార మార్గం లభించినట్లయింది. క్రమేణ ఆ పానీయం సంగతి అందరికీ తెలిసిపోయినప్పుడు ఛాందసులు ఇది మద్యంలా ఉన్మాదకరమైనదని వ్యతిరేకించారు. కాని ఈ వ్యతిరేకత ఉన్నప్పటికీ తొందర్లోనే ప్రజాభిమానం చూరగొంది.

కాఫీ మొక్క ఇథియోపియానుండి ఎమన్‌కు తీసుకొనిరాబడిందని, ముసల్మాను తీర్థయాత్రికులు ఈ కొత్తపానీయాన్ని ఇతరదేశాల్లో ప్రచారంచేయటానికి సహాయపడ్డారని ఒక కథ ప్రచారంలో ఉంది. అవిసెన్నా అనే ప్రఖ్యాత అరేబియా తత్వవేత్త క్రీ.శ. 1040 నాటివాడు. ఆయన కాలంలో కాఫీ పానీయముందని మరో కథ వాడుకలో ఉంది. ఏది ఏమైనా 12వ శతాబ్దం తరువాత దాదాపు అన్ని ముస్లిం దేశాలకు కాఫీ ప్రాకిందనేది నిర్వివాదమైన అంశం. ప్రజలు తమ ఇంటికి వచ్చినబంధు, మిత్రులకు కాఫీ ఇచ్చేవారు. ఒక దశలో ఈ కాఫీ మతానికి తీవ్ర ఆటంకంగా పరిణమించింది. 16వ శతాబ్దం మధ్య కాలంలో ఛాందసులైన ముసల్మానులు కైరో, మక్కాలలోని కాఫీ హోటళ్ళకు నిప్పుపెట్టి బూడిద చేశారు. ఈ రగడ ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించింది. వాసవంగా కాఫీ అప్పుడు చాలా ఖరీదైన పానీయం. సామాన్య పౌరుడికి అందుబాటులో లేదు. దీన్ని ఎక్కువగా రోగ నిర్మూలన పానీయంగానే ఉపయోగించేవారు.

17వ శతాబ్దం పూర్వార్థం నాటికి కాఫీ ఇటలీ, ఫ్రాన్స్, ఇంగ్లాండ్‌లలో వ్యాపి చెందింది. కొన్ని శతాబ్దాల వరకు అరేబియా ప్రజలు కాఫీ తోటలపై ఏకచ్ఛత్రాధిపత్యం వహించారు. వారే కాఫీ గింజల్ని ఇతర దేశాలకు ఎగుమతి చేసేవారు. ఒక్క ఫలవంతమైన గింజను



కాని, మొక్కను కాని తమ దేశం బయటకు పోనివ్వలేదు. అదృష్టవశాత్తు 1690లో కొందరికి కాఫీ మొక్కలు లభించడంతో పశ్చిమాన శరవేగంగా ప్రచారంలో కొచ్చింది.

## మొట్టమొదటి కాఫీ హోటలు

క్రీ.శ. 1500లో కైరో నగరంలో మొట్టమొదటి కాఫీ హోటలు స్థాపించబడింది. 15వ శతాబ్దం మధ్యభాగంలో షేక్ షహబుద్దీన్ ధమాని అనే వ్యక్తి ఎడన్‌లో మొదటి కాఫీ హోటలు తెరిచాడు. ఫ్రాన్స్‌లో 1557 న, ఇంగ్లాండ్‌లో 1652న, కస్తుంతునియాలో 1554న మొట్టమొదటి కాఫీ హోటళ్లు ప్రారంభించబడ్డాయి. అరబ్బు దేశాలలో ధార్మిక కార్యక్రమాలలో నిద్రను పారద్రోలటానికి కాఫీ ఉపయోగించేవారు. అయితే ముస్లిం మతగురువులు దీన్ని కురాన్, ఇస్లాంకు వ్యతిరేకమని ప్రకటించారు. కాని ఇదే పానీయం కాలక్రమాన ఇచ్చటి జాతీయ పానీయంగా మారింది.

1674లో ఇంగ్లాండ్ మహిళలు తమ భర్తలు తమను ఒంటరిగా వదిలి కాఫీ హోటళ్లలోనే ఎక్కువ కాలం వెచ్చిస్తు






న్నారని ఆందోళన లేవతీశారు. ఇరు వర్గాలలో తీవ్ర సంఘర్షణ జరిగింది. పురుషులు దీనికి సమాధానంగా కాఫీని సమర్థిస్తూ, ప్రశంసిస్తూ కరపత్రాల్ని పంచారు. చివరకు ఈ 'కాఫీ యుద్ధం'లో పురుషులకే విజయం లభించింది.

ఆ రోజుల్లో కాఫీ హోటళ్ళకు ఉన్నత వర్గ ప్రజలే వచ్చేవారు. ఛాందసులు కాఫీని తీవ్రంగా ప్రతిఘటించారు. కొందరు కాఫీని 'బొగ్గునీళ్ళు' అని హేళన చేశారు. కాని ఒక టర్కీ వ్యాపారస్థుని చాకచక్యంతో కాఫీ ప్రతిష్ట మరింత పెరిగింది. అతడు తాను కాఫీ తాగుతున్నట్లు ఒక అట్టపై బొమ్మ గీయించి "నేనీ ఔషధ సేవనవల్లనే ఇంత ఆరోగ్యంగా ఉన్నాను" అని కింద రాయించాడు. ఆ ప్రకటనలో ఉన్నట్లే వ్యాపారస్థుడు కూడా దృఢంగా, ఆరోగ్యంగా ఉన్నాడు.

ఇంగ్లాండ్‌లోని రెండవ ఛార్లెస్ 1675లో 3,000 కాఫీ హోటళ్ళను అధికారికంగా మూసేయించాడు. ఆ కాఫీ హోటళ్లు రాజకీయ కుతంత్రాలకు, కుట్ర



౩కు కేంద్రంగా ఉన్నాయని భావించడం వల్లనే ఆ పని చేశాడు. అవి విప్లవ పాఠశాలలని బెదిరిపోయాడు. కాని ప్రజల ఒత్తిడి, తీవ్ర వ్యతిరేకత వల్ల ఛార్లెస్ లొంగిపోవలసి వచ్చింది. మళ్ళీ కొన్నాళ్ళకే కాఫీ హోటళ్ళన్నీ కిటకిటలాడి పోయ్యాయి. లండన్‌లో సాహిత్యవేత్తల కేంద్రంగా కాఫీ హోటళ్ళ ఖ్యాతి పెరిగింది. డ్రైడన్, ఎడిసన్, జాన్సన్, రెనాల్డ్స్, గోల్డ్‌స్మిత్, స్టీల, డేనియల్ డెఫో, పోప్‌లాంటి దిగ్గజులైన రచయితలు, కవులు, మేధావులు కాఫీ హోటళ్ళలోనే సాయంత్రాల్ని గడిపేవారు. అందులో చాలామంది తమ గొప్ప గొప్ప రచనల్ని కాఫీ హోటళ్ళలోనే రాశారు.

డాక్టర్లు కూడా కాఫీ ప్రచారానికి ఎంతో తోడ్పడ్డారు. వారు కాఫీ సేవనాన్ని సమర్థిస్తూ వివిధ పత్రికలలో ప్రకటనలు చేసేవారు. కాఫీ ప్రియులు కాఫీ హోటళ్ళలో తమ సీటును 'బుక్' చేసుకునేవారు. ప్రతీ కుర్చీకి ఒక ప్రత్యేక 'వెయిటర్' ఉండేవాడు.

## మహిళలకు నిషేధం

జర్మనీలో మహిళలకు కాఫీ నిషేధించబడింది. రెండవ ఫ్రెడరిక్ చక్రవర్తి స్త్రీలు కాఫీ త్రాగకూడదని కఠినంగా నిషేధాజ్ఞల్ని జారీ చేశాడు. స్త్రీలు ఈ నిషేధానికి వ్యతిరేకంగా ఊరేగింపులు, ఆందోళన జరపగా నిషేధం రద్దు చేయవలసి వచ్చింది.

ఉత్తర అమెరికాలో 1607న కెప్టెన్ జాన్‌స్మిత్ అనేవ్యక్తి మొట్టమొదట కాఫీ ప్రచారం చేశాడు. ఆ తరువాత ఒక్కొక్క దేశ సరిహద్దుల్ని అధిగమిస్తూ ప్రపంచంలోని అన్ని దేశాలకు విస్తరిల్లింది. అయితే 19వ శతాబ్దం మధ్యభాగంలో టీ ప్రచారం వల్ల కాఫీ వ్యాపికి కొద్దిగా నష్టం వాటిల్లింది.

ప్రారంభంలో అన్ని కాఫీ హోటళ్ళలోనూ ఒక ప్రత్యేకమైన స్థానంలో కర్రతో చేసిన ఒక పెట్టె ఉండేది. ఆ పెట్టెపై 'టూ ఇన్‌స్యూర్ ప్రాంప్ట్‌నెస్' అని రాసి ఉండేది. కాఫీ కావాల్సిన వ్యక్తి ఆ పెట్టెలో నాణాలు పడేయాలి. పెట్టెలో నాణాలు పడవేసినప్పుడు 'టక్' మని అయ్యే శబ్దానికి బేరర్ చటు




క్యాస ఇటు తిరిగి కాఫి అందించేవాడు. ఆ విధంగా 'టూ ఇన్స్యూర్ ప్రాంప్ట్ నెస్' ఆధారంతోనే టిప్ అనే శబ్దం రూపొందింది. ఈ శబ్దం సంక్షిప్తంగానూ, సారగర్భితంగానూ ఉంది. ఇప్పటికీ మనకు 'వెయిటర్' తొందరగా, వినయంగా కాఫీ, టీలు అందిచ్చినందుకు 'టిప్' ఇస్తూనే ఉంటాం.

ఇక భారతదేశంలో కాఫీ 17 వ శతాబ్దంలో అడుగు పెట్టింది. దక్షిణ భారతదేశంలోని బాబా బూదన్ అనే ముస్లిం ఫకీరు మక్కా యాత్రకు వెళ్ళాడు. అక్కడినుండి తిరిగి వస్తూ తనతోపాటు కాఫీ గింజల్ని కూడా వెంట తెచ్చాడు. ఆ గింజల్ని ఒక పర్వత ప్రదేశంలో నాటాడు. ఈ నాటికీ బాబా బూదన్ కాఫీ గింజల్ని నాటిన పర్వత ప్రదేశాన్ని 'బాబా బూదన్ గిరి' అని పిలుస్తున్నారు. ఆ తరువాత కేనస్ అనే ఆంగ్లేయుడు ఆ పర్వత దక్షిణ భాగంలో కాఫీ తోటల్ని పెంచాడు. కొంత కాలానికి దక్షిణ భారత దేశంలోనే కాక భారత దేశమంతటా వ్యాపించింది. భారతదేశంలో కాఫీ హోటళ్ళు బ్రిటిష్ పరిపాలనలోనే నెలకొల్పబడ్డాయి.

ఈనాడు ప్రపంచంలో బ్రాజిల్ అత్యధికంగా కాఫీ ఉత్పత్తి చేసే దేశం. అక్కడ కాఫీని 'పచ్చబంగారం' అని పిలుస్తారు. కాఫీని గూర్చి "బ్రాజిల్ తుమ్మితే ప్రపంచానికింతటికీ జలుబు చేస్తుంది" అనే ఒక సామెత ఉంది. ఈ సామెతలో అతిశయోక్తి ఏంలేదు. 1975లో బ్రాజిల్‌లో కురిసిన హిమపాతంవల్ల కాఫీ పంటలన్నీ నాశనమైనాయి. దీని ప్రభావం ఇతర దేశాలపై పడక తప్పలేదు. కాఫీ ఖరీదుఆకాశాన్నంటింది. బ్రాజిల్‌లో సరాసరి ప్రతి సంవత్సరం 14,40,000 టన్నుల కాఫీ ఉత్పత్తి జరుగుతుంది. 1975 కంటే ముందు ఒక టన్ను కాఫీ సగటు ధర 4,500 రూపాయలు వుండేది. హిమపాతం సంభవించి కాఫీ తోటలన్నీ నష్టపోయిన పిదప అదే టన్నుకు 36,000 రూపాయలైంది. ప్రపంచంలోని చాలామంది ప్రజలు దీనిని ఉపయోగించటానికి అలవాటు పడటం వల్ల కూడా రోజు రోజుకూ విపరీతంగా ధర పెరిగిపోయింది.



భారతదేశంలో 3.40 లక్షల ఎక రాల భూమిలో కాఫీ తోటలు పెంచబడు తున్నాయి. సాధారణంగా సగటు వార్షిక ఉత్పత్తి 25,000 టన్నులు ఉంటుంది. 1971 - 72 లో 1,10,231 టన్నుల కాఫీ ఉత్పత్తి జరిగింది. మన దేశంలో ఇప్పటికీ ఇదే రికార్డు. మన దేశంలో కర్నాటకలో 70 శాతం, కేరళలో 20 శాతం, తమిళనాడులో 10 శాతం కాఫీ ఉత్పత్తి జరుగుతోంది. ఇదికాక ఆంధ్ర ప్రదేశ్, అస్సాం, ఒరిస్సా, మధ్య ప్రదేశ్, అండమాన్ నికోబార్ దీవులలో కూడా స్వల్పంగా కాఫీతోటలున్నాయి.

మన దేశంలో మొత్తం కాఫీ తోటల సంఖ్య 53,000. ఈ తోటలలో సుమారు రెండున్నర లక్షలమంది కార్మి కులు పనిచేస్తారు. ఇందులో ఇండియన్ కాఫీ బోర్డ్ కాఫీ పరిశోధనా కేంద్రం, కాఫీ ఎగుమతి సంస్థ, కాఫీ హోటళ్ళలో నియ మించబడే శ్రామికులు కూడా చేరుతారు.

"కాఫీ గుండె, మస్తిష్కం, స్నాయు వులకు ఉత్తేజం కలిగిస్తుంది. అలసట, విచారాల్ని తొలగించి ఉత్సాహాన్ని, చురుకుదనాన్ని కలిగిస్తుంది. కాఫీ సేవి కులకెంతో అవసరం. ఎందుకంటే ఇది ఏ శ కనీ హరింపకుండా నూతనోత్సా హాన్ని కలుగ చేస్తుంది. భోజనం చేసిన తరువాత కాఫీ సేవిస్తే 'నిండిన పొట్ట' సోమరితనాన్ని తొలగిస్తుంది" అని ఒక ప్రముఖ డాక్టరు అభిప్రాయం. కాని కొందరు విశేషజ్ఞుల అభిప్రాయాను సారం "అధికంగా కాఫీ తాగటం వల్ల (రోజుకు 7-8 కప్పులు) తలనొప్పి, అనిద్ర, గుండెదడ, సెక్స్ జీవితంలో ఇబ్బందులకు కారణాలవుతాయి" హోమియోపతి చికిత్సలో కాఫీ కఠినంగా నిషేధించబడింది. అతిగా కాఫీ సేవిం చటం వల్ల గుండె జబ్బు (కారోనరీ హార్ట్ డిసీజ్) రావచ్చు.

ఒక కప్పు కాఫీలో 50 మిల్లీగ్రాముల కేఫీన్ ఉంటుంది. అయినా డాక్టర్లు కాఫీ చెడు ప్రభావం గూర్చి ఏకాభిప్రాయం వెలిబుచ్చటం లేదు. *

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/ HD /402